# ఎమెస్కో వచన రామాయణం
## (రెండవ సంపుటం)

రచన :

శతావధాని కోట వీరాంజనేయశర్మ

MSCO
190

యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం-సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM VOL-2

As retold by

SATAVADHANI KOTA VEERANJANEYA SARMA



First Edition :
March '80

Second Edition :
July '83

Publishers :

M. SESHACHALAM & Co.,
Machilipatnam-Secunderabad.




Cover Design :
BAPU

Printers :

PRASAD PROCESS,
Secunderabad-26

Price : Rs. 6-00

Distributors :

M/s ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
2237 Rashtrapathi Road, Secunderabad-3

# ద్వాదశాదిత్యమండలం వలె ప్రకాశించే 13 సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం

ఏనాడు వాల్మీకిమహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుంచి అవిచ్ఛిన్నంగా శాఖోపశాఖలతో బహు నామాలతో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహాకార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం త్రొక్కటం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర కావ్యంవలె చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులు వున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కథ వస్తె ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కులన్నీ ఇందులో విడదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుంటే చవిటినేలలు, కేదారఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు, నిస్సార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపరసుఖాలు తమంత తామే కోరి వరించి వస్తయ్. ఈ రచనా విన్యాసం సరికొత్తది. పండిత పామరభేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూసుకుంటే తెలుస్తుంది. ఇంతకు

పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గు భాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్య అయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకా ఎన్నో ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాషులు గండి.

# స్మృత్యంజలి

వ్రాయకయున్న లోపంబేమి? నీ శక్తి
వ్రాయింపఁగల్గెఁ గావ్యములనెన్నొ,
మితభాషివైన నేమికొఱఁత? సలిపిరి
వమితభాషులుగ మా యట్టివారి,
గుప్తదానముసేయఁ గోరిననేమి? నీ
సేతదాతలను సృష్టింపనేర్చె,
లౌకికవృత్తియాలంబమయగునేమి?
లక్ష్యంబుమాత్రె నలౌకికునిగ,
సులభతయు సుప్రసన్నతఁ గలుగనేమి?
పలుకులందునఁ బలుకు ప్రపత్తిగూర్చె
వింతమానిసి వనుటొక వింతగాదు,
శ్రితగుణ విధేయ! యో నరసింహరాయ!

ఓ నరసింహరాయ మహితోన్నతమూర్తి! సదాశయా! భవ
త్స్థానము "స్వర్గలోకమున తప్ప మరిక్కడగా" దటంచుఁదా
మానితభావనాపరత మమ్ములదూరముసేసి చేర్చె స్వ
స్థానముదేవతావిభుఁడు, సాగరమయ్యెను మాకు డెందముల్
మంజులసాధుతామలయమారుతదివ్యలతాంతమాలికా
పుంజసుగంధగంధిలము పూజ్యరఘూద్వహపుణ్య గాథ, నే
రంజితమర్త్యలోకజనమానసపద్మముఁ జేసినాఁడ, స్మృ
త్యంజలిగాఁగఁ దత్ఫలము త్యాగముసేసితి నీయశస్సుకై.
నీకిఁక జన్మలేదు ధరణీజభవామృత దివ్యగాథ వా
ల్మీకిఋషి ప్రయుక్తమయి లేఖక పాఠకభక్తలోక మెం
దాకపఠించి ముక్తులయి ధన్యతగాంచుచునుండు చుండు రం
దాక సుపర్వలోకమునఁదావకపుణ్యము నిల్చి యుండుటన్.

కర్త
కోట వీరాంజనేయశర్మ
శతావధాని

స్వామి! భవత్కృపన్ బ్రథమసంపుటమున్ రచియించి భక్తితో
భూమిసుతాత్మదేవు పదముల్ స్పృశియింపఁగనుంచినాను శ్రీ
భామయ సూనమట్టులుగ; పావని! రెండవ సంపుటంబునున్
బాష్కరపండితా! భవబంధహారంబుగ వ్రాయఁజూడుమా.

సర్వలోకోత్తరంగా సీతా కల్యాణంతోపాటు రెండవ కూతురు ఊర్మిళను లక్ష్మణునకూ, తమ్ముడు కుశధ్వజుని కుమార్తెలు మాండవి, శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నులకూ ఇచ్చి ఏకకాలంలో జనక భూపతి పాణిగ్రహణవిధి పరిసమాప్తం గావించి, మృష్టాన్న సంతృప్తుల కావించి, భూసురాశీర్వాదాలు పొంది, ఆత్మజాతలకు అక్కడికంతో అరగొరలేని ఆభరణాలూ, పరిచారికలనూ ఒసంగి రాచమర్యాదలతో, దశరథ క్ష్మాపాలుని విడిదికి సాగనంపాడు. ఆ సాయంకాలం యజ్ఞార్థం వచ్చిన అవనీదేవులనూ, వివాహ నిమిత్తం వచ్చిన భూదేవులనూ, తపోధనులైన మహర్షులనూ సమావేశపరచి, నూత్నవధూవరులు నాల్గు జంటలనూ కన్నులకు తృప్తిగా అలంకరించి సభలో కూర్చుండబెట్టి, విద్వాంసులచేత వీణావాదనం, గాత్రం, నృత్యం మొదలైన కళావిన్యాసాలు జరిపించి, సదస్యుల ఆశీస్సులు వధూవరులకు ఇప్పించి వృద్ధరాజు సంచులు కోసి ధనం సంతర్పణ చేశాడు. గోసహస్రాలు కోరకుండా ఇచ్చి, పాలు పిండుకొనుటకు కనక కుంభాలు దానం చేశాడు. ఆ రాత్రి వెన్నెల్లో, ఏమి వడ్డించారో, ఎంత వడ్డించారో, ఏమి తిన్నారో, ఎంత తిన్నారో తెలియకుండా విందు చేశాడు. భోజనానంతరం పరదేశ బ్రాహ్మణులు విడిదిలో సంభాషించసాగారు.

గౌరీపతి :-అవధాన్లూ! నీహయాంలో ఒక తండ్రికి కలిగిన కొడుకులంతా ఒక్కసారే పెండ్లికొడుకులు కావటం ఎరుగుదువా?

అవధాన్లు :- గౌరీపతీ! నా హయాం ఏమిటి, ఎవరి హయాంలో కూడా జరిగి ఉండదు. వియ్యంకులు సత్కారంలో పోటీ పడ్డారు. ఇద్దరూ ఇద్దరేనయ్యా.

గౌరీ :- నిజమే అవధానీ! ముక్కోటి దేవతలు వచ్చి సందర్శించారంటే, ఈ వివాహం మూడు లోకాలకు సంతోషదాయకమనేగా.

అవ :- సందేహమేముందీ! సీతారాముల తలంబ్రాల సమయం ఎంత

మనోజ్ఞంగా వుందో చూశావుగా. రాముడు లేచి వంగినప్పుడు, ఆ శరీర కాంతులు సభంతా జలదశ్యామలం చేస్తుంటే, సీతమ్మ లేవంగానే కోటిశంపాలతలు మెరిసిపోయినై. ఊర్మిళా లక్ష్మణులు ప్రాలుబోసుకుంటుంటే, తరుణారుణదీప్తులు క్రమ్ముకొన్నై. మాండవీ భరతులూ, శ్రుతకీర్తి శత్రుఘ్నులూ, రామలక్ష్మణుల ప్రతిబింబాలే. యుధాజిత్తు, మేనల్లుడు భరతుణ్ణి చూడటానికి వచ్చి అయోధ్యలో లేడనీ, అంతా మిథిలకు పోయారని తెలిసి, పాపం పెండ్లివేళకు చేరుకున్నాడు. ఆయన కూడా అధికంగానే సత్కరించాడు. మళ్ళీ మనకయోధ్యలో భూరిసంభావనం దొరుకుతుంది. రెండు జాములైంది. పొద్దున్నే ప్రభువులతో ప్రయాణం. సుఖంగా పోవచ్చు. పద పడుకుందాం" అనుకుంటూ నిద్రించారు.

వృద్ధరాజు సకుటుంబ పరివారంగా, అయోధ్యకు వేకువనే ప్రయాణించాడు. విశ్వామిత్రుడు, రామలక్ష్మణుల పాదాభివందనం గ్రహించి, లేవనెత్తి, శరీరం నిమిరి "రామా! కల్యాణ రామా! నా సంకల్పం సంపూర్ణంగా నెరవేరింది. యుగయుగాలు నీ పేరూ, నీ చరిత్రా, నీ కీర్తి నిత్యనూత్నంగా వెలుగుతుంది. నీ నామం దుష్టులకు గుండెల్లో గాలం లాగా, శిష్టులకు సర్వాభీష్ట ప్రదాతగా, తారకంగా, ప్రజాహృదయాల్లో, వాక్కుల్లో నిల్చిపోతుంది. నేను శీతశైలానికి తపస్సు నిమిత్తం పోతున్నాను. భూపతీ! నీ బిడ్డల నీకు చేర్చాను. మహర్షి శ్రేష్ఠా! వశిష్ఠా! నీ సమయస్ఫూర్తికీ, దూరదర్శిత్వానికీ కృతాంజలి" అంటూ సెలవు తీసికొన్నాడు. మైథిలుడు వియ్యంకుని కొంత దూరం సాగనంపి, పురం చేరుకున్నాడు. అయోధ్యాముఖమై నడుస్తున్న సమయంలో, పక్షులు విపరీత ధ్వనులు చేస్తూ ప్రదక్షిణంగా తిరిగిపోతున్నై. ఆకాశం రక్తవర్ణం కాసాగింది. మృగాలు నిర్నిమిత్తంగా భయంతో పారిపోజొచ్చినై. నక్కలు కూసినై. ఈ అపశకునాలు ఆకర్ణించి, వసిష్ఠులతో, పర్యవసానం ఏమిటని ప్రశ్నించాడు. పరిస్థితి ప్రమాదం సూచిస్తున్నా, పులుగులు ప్రదక్షిణించి పోతున్నై కనుక భయపడవలసిన పని లేదన్నాడు.

ఇంతలో సుడిగాలి రేగింది. ఆ ఘాటికీ, వేగానికీ, అంతా తెలివి తప్పారు. భాస్కరమండలం కావిరి కప్పింది. భూమి కంపించింది. వృక్షాలు సమూలంగా విరిగిపడినై. చీకటి దెసలు గ్రమ్మింది.

## పరశురాముని అవతారోప సంహారం

ఆజాను బాహుడు, జటావల్కలధారి, దుర్నిరీక్ష్య తేజోమూర్తి, ఎడమ భుజం వైష్ణవ ధనువుతో విలసిల్లగా, కుడిచేత పట్టిన గండ్ర గొడ్డలి కుడిభుజంపై ప్రకాశించగా, శాంత రౌద్రరసాలూ, బ్రాహ్మణ క్షత్రియ ధర్మాలూ కొట్టవచ్చినట్టు కనుపించగా, అడుగడుగునా పుడమి రేణువలె ఎగురుదిగుడు కాగా, అభిముఖంగా వెండి కొండవలె నడిచి వచ్చాడు. అతని చూచి మునులేకాదు గజగజ వణికారు. మాట తడ బడింది. నోటతడి ఆరింది. ఆపాదమస్తకం కొయ్యబారింది. వసిష్ఠాదులు త్వరగా ఎదురుపోయి అర్ఘ్య పాద్యాలిచ్చి, మధుర వాక్కులతో కుశల ప్రశ్నలు వేశారు. వారి సపర్యల గ్రహించి, వృద్ధుని ఉపేక్షించక, "రామా! సత్యపరాక్రమా! విన్నాను. తాటక సంహారం, మునిజన సంరక్షణం, శివధనుర్భంగం గాథలు! ముక్కంటి విల్లు విరచుట సామాన్యమైన పని కాదు. నీ బాహుబలానికీ, సవీర్య శౌర్యానికీ నిజంగా నిదర్శనమే. అయినా, నేను స్వయంగా చూడవలెనని బృహద్ధనువును కొనివచ్చాను. ఈ విల్లును "జామదగ్న్యం" అంటారు. ఇది వైష్ణవం. దీన్ని ఎక్కిడి శరం సంధించు. తర్వాత మనం ద్వంద్వ యుద్ధానికి దిగుదాం" అన్నాడు. అంతదాకా బాహ్యస్మృతిలేని దశరథ మహారాజు "మహాత్మా! అనుగ్రహించు. బ్రాహ్మణుడవు. మహా తపోరాశివి. క్షత్రవంశ నిర్మూలనం చేసి, తండ్రికి తర్పణము విడిచి శాంతుడవైనావు. మునుల సమక్షంలో ధనువును తాకనని ప్రతిజ్ఞను చేశావు. నా రాముడు బాలుడు. కల్యాణ చిహ్నాలు కానవస్తున్నవిగా స్వామీ! వీడు అహంకరించి విల్లు విరిచి శివాపచారం చేయలేదు, ఎక్కుపెట్టబోతే విరిగింది కాని. మీ ఆశీఃపాత్రుడే కాని, ఆగ్రహపాత్రుడు గాడు. సమస్త భూమండలం కాశ్యపునకు ధారపోసిన త్యాగమూర్తివి. ఈ బాలునిపై కారుణ్యం

చూపించు. వానితోడిదే లోకంగా బతుకుతున్న వృద్ధుణ్ణి మమ్మల్ని కృప జూడు" మంటూ అంగలార్చాడు.

అది అంతా అడవి రోదనం అయింది. ఆ మాటలు ఆయనయందు కృపారసం కలిగించలేదు! "ఓయి రఘువంశభూషణా! రామా! ఈ రెండు విండ్లవృత్తాంతం చెపుతా విను. త్రిపురాసుర సంహారార్థం విశ్వకర్మ మిక్కిలి యత్నపూర్వకంగా ఈ శరాసనాలు రెండూ కల్పించి ఈశ్వరునకూ, విష్ణువునకూ ఇచ్చాడు! ఈ చాపం ధరించి త్రిపుర దాహం చేసి శంకరుడు సుఖమున్నాడు. సురలు విష్ణుశంకరులలో ఎవరు శ్రేష్ఠులని విధాత నడిగారు. వారి అభిమతం నెరవేర్చటానికి వారికి వైరం కల్పించగా, ఆ మహా సంగ్రామంలో, విష్ణుహుంకారానికి, ఈశ్వర ధనువు పెటిలింది. దేవతలు విష్ణు ప్రభావం గొప్పదని భావించారు. అది తెలిసి రుద్రుడు రౌద్రంలో ఆ కోదండం దేవరాతునకిచ్చాడు. విష్ణువు ఋచీకునకు శరంతోసహా ఇచ్చాడు. ఆయన, నా తండ్రి జమదగ్ని మహర్షికి ఇచ్చాడు. ఆ మహా పూజ్యుడు అస్త్రధారణ సేయక తపానికి పోతూ నా చేతికిచ్చాడు. ఈ రెండు విండ్లకథ ఇది. ఇప్పుడు దీని గ్రహించి సజ్యం చేయు" మన్నాడు. ఆ మాటలు విన్న రాముడు చిరుహాసంతో జనకుడు ప్రక్కనున్నందున వినయంతో "రామా! భార్గవరామా! పరశురామా! మీరు చెప్పిందంతా శ్రద్ధగా విన్నాను. మీ అసమ తపశ్శక్తి, మీ జనక వాక్యపాలనం, మీ దురహంకార రాజలోక ప్రతీకారం, ధర్మరక్షణ సాటిలేనివి. మీ పని ముగించారు. శేషం నేను పూరిస్తాను." అని పరశురాముని చెంతనున్న వైష్ణవధనువందుకొని శరం చేతపట్టుకున్నాడు.

ఈ అద్భుత దృశ్యం చూడటానికి ఖగచారులంతా, విమానారూఢులై అంతరిక్షంలో నిల్చారు. వశిష్ఠాది మహర్షులు మాత్రమే సహజస్థితిలో ఉన్నారు. వృద్ధరాజు మొదలుగా పరివారమంతా అయోమయస్థితియందున్నది. రాముడు ద్వాదశాదిత్య మండలోదయంవలె వెలుగుతూ, చాపాన్ని సజ్యంచేసి, శరాన్ని పూరించి, ఆకర్ణాంతం నారిలాగి "ఓ భార్గవా! నీవు చెప్పిన పని ముగిసింది. ఈ అస్త్రం వ్యర్థంకారాదు. నేను బాణం లాడిగి ఉపసంహరించను. లక్ష్యంచూపు. నీవు బ్రాహ్మణ శ్రేష్ఠు

దవు. మా గురువులైన గాధేయునికి చుట్టమవు. అందుచే నీపై ప్రయోగించను. నీ గమనం కానీ, నీ పుణ్య లోకాన్ని కానీ దగ్ధంచేస్తాను" అన్నాడు. పరశురాముడు నిస్తేజుడై, సర్వం తెలుసుకొని "రామా! నిన్నెరింగితిని. నా గమనం భంగించకు. రాత్రివేళతప్ప, క్షణకాలం ఒక చోట నిల్వను. ఇది కశ్యపుని ఆజ్ఞ. నేను స్థిరజీవిని. నా సంపాదిత పుణ్యలోక సముదాయం లక్ష్యంగా ఇస్తున్నాను. ప్రయోగించు" అని మహేంద్ర పర్వతానికి వెళ్ళిపోయాడు. రాముడు శరసంధానంతో లక్ష్యాన్ని ఛేదించి శాంతమనస్కుడైనాడు.

నారదుడు: తుంబురా! ఈ చిత్ర సన్నివేశాన్ని గూర్చి ఏమంటావు?

తుంబు: నారదా! నాకు నిజంగా మతిపోయింది. అవతార మూర్తి అయిన పరశురాముడు రామునిచే పరాభూతుడు కావటం ఏమిటి?

నార: మిత్రమా! నీకు తెలియలేదన్నమాట. రాముడుకూడ అవతార మూర్తే.

తుంబు: అయితే ఒకటి క్రిందూ, ఒకటి మీదా ఎందుకవుతుంది?

నార: ఆ రహస్యమే లోకానికి ఇంతవరకూ తెలియదు. ఆవేశావతారం పరశురామునిది. రాజులు కామక్రోధవశులై, స్వార్థసుఖలంపటులై, తాపసులను రక్షించటం, ప్రజలధర్మంగా పాలించటం మానివేశారు. యుగధర్మం ప్రవర్తించాలంటే రాజులు ధర్మపాలకులు కావాలి. అందుకే అజేయమైన బ్రాహ్మణ వంశంలోపుట్టి, రాజలోకాన్ని సంహరించాడు. మళ్ళీ రాజవంశం పునరుద్ధరించి, ప్రజారంజకంగా, వేదధర్మసమ్మతంగా పాలనను సాగించటానికే భగవంతుడు క్షత్రియ వంశంలో జన్మించాడు.

తుంబు: బాగుంది. కానీ, నా సందేహం పోలేదు.

నార: ఏమూసందేహం?

తుంబు: అందర్నీ చంపిన జామదగ్ని దశరథుని ఎందుకు చంపలేదూ?

నార: ఆయన భార్గవరాముడ్ని శరణుజొచ్చాడు. అదిగాక, రఘుపాలకుడు కూడ. పైగా, సంతానహీనుడు. అందుచే అప్పటికీ వదలిపెట్టాడు.

తుంబు: రెండు అవతారాలూ భగవంతునివేకదా? ఇంతవరకు ఒక దానినొకటి ఎదిరించటం జరగలేదే.

నార: ఇప్పుడుమాత్రం పోట్లాట జరిగిందా? భార్గవుడు తామస ప్రధానుడైన రుద్రుని తేజాన్ని పొంది సంహారకార్యం జరిపాడు. ఎందుకు ఆవేశంపొందాడో ఆ పని ముగించాడు. తానిక చేయవలసిందిలేదు. ఆయనకు రాముని పుట్టుక దేనికో తెలుసు. తానుపాసించిన శివుని విల్లువిరిచాడనే నెపంతో కారణం కల్పించుకున్నాడు. అభిముఖంగా వచ్చాడు. తనది వైష్ణవచాపం. ఆ శక్తి రామునియందు అంతర్లీనం కావాలి. రాముడు పూర్ణావతారం. ఎక్కువ ప్రవాహవేగంలో తక్కువ నీటివేగం కలిసిపోయినట్లు కలిసిపోవాలి. పోయిందికూడ.

తుంబు: చాలా మంచి విషయాలు చెప్పావు. రామచంద్రుడు భార్గవుడు చనగానే ఆ ధనువును వరుణునకిచ్చి, తండ్రిని ప్రయాణానికి ఆజ్ఞ ఈయమంటున్నాడు. మనంకూడా పయనం సాగించుదాం" అంటూ పోయారు.

## అందరూ అయోధ్యా ప్రయాణం

రాముని మాటలకు ముసలిరాజు తేరుకున్నాడు. భార్గవుడు అపకారం ఏమీ చేయకుండా పోయినందుకు కొండెక్కినంత సంతోషం పొందాడు. ఈ వార్త ముందుగాచేరగానే నగరరక్షణార్థం ఆగిన అమాత్యవర్యులు మహారాజు నలుగురు కొడుకులతో, నలుగురు కోడండ్లతో పట్టణ ప్రవేశం చేస్తున్నాడన్న సంగతి నగరమంతా చాటింపువేయించారు. బాటలు ఊడ్చి నీళ్ళుచల్లి పూలు వెదజల్లారు. అడుగడుగునా తోరణాలు కట్టి, అరటిస్తంభాలునాటి, మణిదీపాలమర్చి, రకరకాల చేతిపనితనం కనబడే చిత్రలేఖన వస్త్రాలు అమర్చి, చాందినీలు కట్టారు. ముద్దులొలికే ముగ్గులతో రంగవల్లులు తీర్చారు. విలువగల దుస్తులూ, ఆభరణాలూ ధరించి పౌరులు గుంపులై, కోలాటములూ, భజనలూ, వేశ్యాభినయములూ, విచిత్ర వేషధారణలూ, సన్నాయి, బాజా, డోలు, ఢంకా,

తప్పెటలు, ఆటలు పాటలు దిక్కులు ప్రతిధ్వనించగా, పట్టపుదేనుగుపై అంబారీవేయించి, రెండు వైపుల గజసందోహం నిల్పి, గుర్రాలకు జీనులువేసి అలంకరించి, మావటీడులూ, రౌతులూ, నడుపుతుండగా పట్టణం పొలిమేరలుదాటి, అర్ధయోజనం ఎదురుపోయి, పెండ్లికొడుకుల భార్యలతో అధిరోహింపజేసి రాణులను ముత్యాలుకూర్చిన మేనాలలో కూర్చుండబెట్టి, బంగరుగద్దె అమరించిన వెండిపల్లకిలో వృద్ధరాజును ఆశీనుంగావించి, మంగళహారతులతో, వేదమంత్ర పఠనంతో, అక్షతలు, పూలు వర్షిస్తుండగా పురప్రవేశం జరిగించారు. పదహారురోజుల పండుగ వరకూ, అయోధ్యావాసులు ప్రభువు ఏర్పాటుచేసిన సువారాలలోనే భోజన భాజనాలు ముగించారు. అర్థులకూ, ఆర్తులకూ, నిరతాన్నదానం జరిగింది. తగినంత సత్కారాలుకూడా సమకూర్చబడినై. నూతన వధువులకు అత్తలు అమ్మలైనారు. కోడళ్ళను వెనుక వేసుకుని వచ్చే అమ్మలను చూచి కొడుకులు మురిసిపోయారు. కొడుకుల ఆభిజాత్యం, ఐశ్వర్యం చూచి పొంగిపోయిన అత్తలకు కోడళ్ళు కన్నులలో పాపలయ్యారు. ఏ జంట ఎక్కడ ఏ దినం వుంటుందో ఎవరికీ తెలియదు. దశరథుని పుణ్యకర్మల ఫలితంగా, అనుకూలదాంపత్యంగల ఆ నలుగురూ ఆనందంగా కాలంగడుపుతున్నారు. వివాహానికివచ్చిన యుధాజిత్తు మేనల్లుని కొరకై వేచి యుండి బావగారి అనుమతితో, శత్రుఘ్న సమేతంగా భరతుని తీసుకొని కాశీపురం వెళ్ళాడు.

(బాలకాండం సమాప్తం)

# అయోధ్యాకాండ

వృద్ధుడైన మేనమామకు భరతుడు అధిక ప్రీతుడైనాడు. అట్లని శత్రుఘ్నునిపట్ల ఉదాసీనంగా ఉండలేదు. తన తోడబుట్టువుకు ఈ ఇద్దరు బిడ్డలు కల్గినట్లే భావించి చూచుకుంటున్నాడు. ఆ అనుజులు ఒకరినివిడిచి ఒకరుండలేరు. భరతుడు భగవత్పరతంత్రుడైతే శత్రుఘ్నుడు భాగవత పరతంత్రుడు. శంఖచక్రాంశలలో జన్మించినారు; కనుక ఆ సాన్నిహిత్యం ఇక్కడకూడా అలాగేవుంది. అక్కడవున్నా వెంటవెంట తండ్రియొక్క, అనుజులయొక్క, తల్లులయొక్క క్షేమ వార్తలు తాము తెలుసుకుంటూ, తమ కుశలవార్తలను వారికి తెలుపుతూ, రాజ్యవ్యవహారాలలో మామగారికి తోడుపడుతూ, అనుకూలవంతులైన భార్యల అనురాగాలను అనుభవిస్తూ సుఖంగా కాలం గడుపుతున్నారు. వృద్ధరాజు నలుగురు కొడుకులలో ఇద్దరు దూరంగా వున్నారనేబాధ కలుగుతున్నా, ఉన్న ఇద్దరినీ చూసుకుంటూ దినాలు పుచ్చుతున్నాడు.

## రామలక్ష్మణులు అయోధ్యలో
## సంసారయాత్ర సాగించుట

రాజకుమారుల వివాహానంతరం అయోధ్యావాసుల ఆనందం పట్టపగ్గాలూ, విడుప విధులూ లేకుండావున్నవి. నిత్యకల్యాణం, పచ్చతోరణం అన్నసామెత వారిపట్ల శతగుణితంగా సార్థకమవుతూంది. వీథివీథినా, పురాణాలూ, హరికథలూ, బొమ్మలాటలూ, వీధి భాగవతాలూ, సంగీతసభలూ, భజనలూ, గంగిరెద్దుల మేళాలూ మొదలైన జాతీయ

జీవితం ప్రతిబింబించే వినోదాలూ, శాస్త్రచర్చాగోష్ఠులూ, జరిగిపోతున్నై. ఆ పురంలో వినోదానికేగాని విషాదానికి తావులేదు. అన్యోన్యతకేగాని ఆగ్రహానికి నిలువనీడలేదు. ఆదరణకేగాని అసూయకు చోటులేదు. వృత్తి ధర్మాలు సమష్టికేగాని స్వార్థానికి కాదు. ఆర్థిక వ్యత్యాసాలు, అందువల్ల కలిగే న్యూనతాధిక్యములు విషయ నిర్ణయములలో తప్ప సంఘవ్యవస్థలో గాని, నిత్యజీవిత వ్యవహారలక్ష్యాలలోగాని కనుపించవు. ప్రభువుతోగాని, అధికారులతోగాని పౌరులకు సంబంధములేదు. అతివృష్టి,అనావృష్టి,క్షామం, డాంబరం మొదలైన ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడే ప్రభువులకూ, ప్రజలకూ సంబంధం. రాజులు శాసనాలు చేయరు. మహర్షులు చేస్తారు. వారు ప్రజాక్షేమం ఎలా లభిస్తుందో, దానికి సంఘవ్యవస్థ ఎలా వుండి, ఎలా నడిస్తే ఫలం వస్తుందో చర్చావేదికలపై నిర్ణయిస్తారు. అది లిఖితం చేస్తారు. దాన్ని ప్రభువులు సరిగా అమలు జరుపుతారు. అంతే. ఎక్కడ రాజులు స్వేచ్ఛాచారులుగా సంచరించి ప్రజలను పీడిస్తారో, అడవులలో వుండే వారు తెలుసుకుంటారు. ప్రకృతి వైపరీత్యాలు ఎందుకు వస్తయ్యో వారికి తెలుసు. వెంటనే ఆ రాజులను మందలిస్తారు. వినకుంటే పదచ్యుతుల్ని చేస్తారు. అంతేకాని ప్రజకేమీ సంబంధం వుండదు.అందుచే ధర్మం స్థిరంగా నడుస్తుంది.

ఈ వేదధర్మానుసారంగా ఏర్పరచిన రాజనీతి, ప్రజాప్రవర్తనం ఇక్ష్వాకులపాలనలో వేళ్ళూని, మహావృక్షాలై, శాఖోపశాఖలుగా విస్తరించినై. మనస్సులోనే సాధించి దర్శించుటకు వీలైన పవిత్ర సంఘీభావం ఆచరణలో ఆదర్శకంగా సాధింపబడింది. మహర్షుల తపోబలంతో, నిస్వార్థ సేవలతో, రాజుల చిత్తశుద్ధి పాలనతో భూలోక స్వర్గసుఖాలను అనుభవించే పౌరులు గల అయోధ్యలో, నూతన దంపతులూ, అంకురిత యౌవనులూ అయిన రామలక్ష్మణులకు,తల్లిదండ్రుల సేవలతో, దానధర్మాలతో, విద్యావ్యాసంగాలతో, పరస్పర ప్రణయ మధురసంభాషణలతో, విద్యుక్త కర్మాచరణలతో కాలం గడుస్తున్నది. ఒకనాడు సోదరులు సాయంకాలం పరరాష్ట్రవాసులుగా అలంకరించుకుని బ్రాహ్మణవాడికలో ప్రయాణిస్తున్నారు. గృహస్థులు, దర్భాసనాలను చంకబెట్టుకొని, జారీ చెంబులు చేతపట్టి, పాపుకోళ్ళు తొడిగి సరయూనదికి స్నానార్థం పోతున్నారు. గృహి

ళులు ముంగిళ్ళు వూడ్చి, నీళ్ళుచల్లి, ముగ్గులువేసి, పశువులకు కాదగిన పనులు నవరించుకొని, స్నానాదులు ముగించి, పెరటిలోని తులసి కుండిక పరిశుభ్రం చేసి, దీపారాధనలు చేసి, పండ్లు నైవేద్యం పెట్టి, రాత్రికి కావలసిన వంటకాలను తయారుచేయడానికి వంటగదులలోకి పోతున్నారు. పిల్లలు ఇంటిలో దీపాలు వెలిగించి ఉంచవలసిన చోట్ల వుంచుతున్నారు.

ఇంకా ముందుకుపోయి నాల్గువాకుల కూడలిచేరుకున్నారు. ఆ కూడలిలో రఘుమహారాజు నిలువెత్తు విగ్రహం మధ్యగా నిల్పబడివుంది. ఆ విగ్రహానికి చుట్టూ వలయాకారంగా రాతితో నిర్మించిన విశాలమైన గదులున్నై. ఆ గదులు పరదేశవాసులు వేళగాని వేళల్లో పట్నం ప్రవేశిస్తే విశ్రాంతి తీసుకుంటానికి వినియోగిస్తారు. అక్కడ దాదాపు వందమంది కూర్చుంటానికి వీలుగా ఒక గృహం వుంది. ఉత్తర దక్షిణాలు పొడవుగాను, తూర్పు పడమరలు తక్కువగాను, దీర్ఘచతురస్రాకారంలో అది కట్టబడింది. దక్షిణపువేపు గోడమధ్యగా వేదిక వున్నది. దానిపై చిత్రాసనం వేయబడింది. ముందు వ్యాసపీఠం, అందులో, భూర్జపత్ర గ్రంథం వుంది. గోడపైనారవావేవి మనోహరంగా రంగులతో చిత్రించబడినవి. పరిమళ ద్రవ్యాలు వెలిగించబడినై. శ్రోతలకు చిరుగద్దెలు నాల్గువరుసలుగా ఉత్తరపు గోడవరకు వేయబడి వున్నై. మొగసాలలో ఏడుగంటలు కొట్టారు. శ్రోతలు ఆ చిరుపీఠములలో మూడు వరుసలలో కూర్చున్నారు. గృహిణులలో వృద్ధులు నాల్గవ వరుసలో ఆసీనులైనారు. ధౌత వస్త్రములు ధరించి, చిరుగడ్డము, కొంచెం ఎదిగిన శిరోజాలూగల పౌరాణిక ముఖ్యుడు వచ్చి ఉన్నత ప్రదేశంలో కూర్చున్నాడు. అందరూ లేచి నమస్కరించి మరల కూర్చున్నారు.

ఆయన ప్రార్థనాదికం పూర్తిచేసి, "ఈనాడు కొన్ని ధర్మసూక్ష్ములపై మహర్షులు చేసిన ప్రవచనాలు వినిపిస్తాను వినండి. ఇవి ఎంతో దూరదృష్టితో, విజ్ఞతతో, అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలకు తావులేకుండా చెప్పబడినై. తండ్రి ఆజ్ఞచే పరశురాముడు కన్నతల్లి, కంఠం గండ్ర గొడ్డలిచే నరికాడు. ఇది ధర్మమా? అధర్మమా? అన్న మీమాంస సామాన్యులకు కలుగుతుంది. కలగటంలో తప్పేమీలేదు. సామాన్య సంఘ

ధర్మంలో "మాతృదేవోభవ. పితృదేవోభవ" అని చెప్పబడి వుంది. అది సంఘం పారంపర్యంగా పాటిస్తూవుంది. అటువంటప్పుడు తల్లిని కొడుకు చంపటం ధర్మమెలాగవుతుందని శంకవస్తుంది. సామాన్యులు దాన్ని ధర్మ విరుద్ధం అనో, క్రూరత్వం అనో అంటారు. కాని, ఇది జరిగినగాథ. కల్పితంకాదు. కల్పితమే అనుకుందాం. ఈ కథ ఎందుకు సామాన్య ధర్మానికి విరుద్ధంగా చెప్పబడింది?

ప్రకృతిలోని జడచైతన్యాలు రెండూ, దీర్ఘకాలికంగా కొన్నీ, స్వల్పకాలికంగా కొన్నీ మార్పుచెందుతుంటై. ఆ మార్పు మన అనుభవాలకు అందని విధంగాకూడా మారుతుంటై. అటువంటి మార్పులనే అసామాన్య ధర్మాలంటారు. అటువంటిదే ఇది. ఇటువంటివి సామాన్యానుభవం గలవారు పరిష్కరించలేరు. ఆ పరిష్కారం మహర్షులే చేయాలి. ఎందుకంటే, సత్యదర్శనులూ, సర్వసంగపరిత్యాగులూ కనుక. పుత్ర ధర్మం ప్రకారం తల్లిదండ్రులిద్దరూ దైవస్వరూపులే. ఇక, భార్యాభర్తల ధర్మంలో భర్త అనుసరణం భార్య ధర్మం. భార్యను అన్నివిధాలా భరించటం భర్త ధర్మం. ఈ కథలో (కల్పితమైనా) రేణుక శారీరకంగా కాక, మానసికంగా వ్యభిచరించింది (ప్రధానమైనది మనస్సేకాని శరీరంకాదు. దానికి ప్రత్యేకంగా అస్తిత్వంలేదు). అది సామాన్యధర్మంలోకూడా దోషమే! దానికి శిక్ష మరణమే. అది భర్తే చేయవచ్చు. కాని, ఆయన సంయమి. పరశురాముడు బ్రాహ్మణుడైనా క్షత్రధర్మం కలవాడు. క్షత్రియుడు ధర్మం పాలించేవాడు మాత్రమేగాని, మార్చే అధికారం కలవాడు కాడు. అందుచే తండ్రి అతనినే కోరాడు. అతడది చేశాడు. అంతేకాని, పుత్రధర్మంతో తానైతాను చంపలేడు. ఆజ్ఞా పరిపాలనచేసిన కొడుకును వరమిస్తానన్నాడు. ఆ వరం తల్లి పునర్జీవితురాలగుటగా మారింది. చచ్చి బ్రతికిన జీవిలో సర్వం చచ్చిపోయి క్రొత్త జన్మ కలుగుతుంది కనుక దోషం పరిహరింపబడింది. అసామాన్యధర్మాలు సామాన్యులకు తెలియటానికే ఈ కథ (కల్పింది అయినా) చెప్పబడింది. రేపు సుమతి కథలోని ధర్మసూక్ష్మం చెప్తాను. భర్త క్రూరుడు. దుష్టచిత్తుడు. అయితే సుమతి ఏమి చేసింది? "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం, న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః గో బ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం లోకా

స్నమస్తా స్సుఖినో భవన్తు." ఎవరిదారిన వారు నమస్కారంచేసి వెళ్ళారు. సోదరులు ఇంకొకవీథికి పోయినారు. అక్కడ వీథిభాగవతులు "కౌశికసవన సంరక్షణం" అనే నాటకం ఆడుతున్నారు. సోదరులు కొంత సేపు విని దించి గృహోన్ముఖులైనారు. వారిని అనుసరించి వృద్ధరాజు అంగరక్షకుడు అల్లంత దూరంగా వస్తున్నాడు.

ఎదురుగా గుర్రాలు పూన్చిన శకటం వచ్చి ఆగింది. అందులో నుంచి భద్రుడుదిగి అధిరోహించుడని కోరాడు. అన్నదమ్ములు విస్మయులై నిల్చారు. అంగరక్షకుడు చేరవచ్చి "కుమార ప్రభువులు వెంటనే మాతృదేవి మందిరానికి దయచేయండి" అంటూ తలుపు తీశాడు. రాముడు "భద్రా!" అని పిల్చి పూరకున్నాడు. అంగరక్షకుడు అందుకొని "చిన్న ప్రభువులు ఒంటరిగా కాలినడకను పట్టణంలో తిరగటం, అందులో వేషాంతరంలో తిరగటం చాలా ప్రమాదకారణం. ప్రభువులూ, సుమంత్రులవారూ, మీ రక్షణంకోసం రహస్యంగా మమ్మలను నియమించారు" అని చెప్పాడు. రామచంద్రుడు తలపంకించి అంగరక్షకునితో ఇలా అన్నాడు. "పూజ్యుడా! పెద్దల కర్తవ్య నిర్వహణలో పాలనాధికారం, దూరదృష్టీ, చారచక్షుత్వం ప్రస్ఫుటంగా కనుపిస్తున్నై. ఈ జాగరూకత పుత్ర వ్యామోహముగా భ్రమించుటకు అవకాశము గల్పించుతున్నది. తన ప్రజలనే అనుమానించినచో ప్రభువు అంతరాంతరాల్లో ఏదో సందేహం వుండక తప్పదు. మేము కేవలం ఉబుసుపోకకురాలేదు. స్వేచ్ఛాజీవులైన ప్రజలు నిత్యజీవిత వ్యవహారాల్లో వారి మనోగతభావాలను వెల్లడించుకుంటుంటారు. అదియే ప్రభువులు గుర్తించవలసిన ముఖ్యవిషయం. ప్రజల ప్రత్యక్ష చర్య శాసనాచ్ఛాదితం. పరోక్షపుచర్య సత్యసంగతం. అది తెలుసుకుంటానికే మేం వచ్చాం. రాజపుత్రులమైనా మేం ప్రజలమేకదా. ప్రజాహితం ఎలా వుండాలో గ్రహించి ప్రభువులకు నివేదించటం మా కర్తవ్యంగా భావించి వచ్చాం. మా రక్షణ మా వద్దనే వున్నది. ఇక పదండి" అంటూ అందరూ కౌసల్యాదేవి మందిరానికి పోయారు. రాజప్రాసాదంలో కాల సూచకంగా గంటలు తొమ్మిది మ్రోగినై. అంతవరకు బిడ్డల రాకకోసం తల్లులూ, భర్తల రాకకోసం భార్యలూ ఎదురుచూస్తున్నవారు కర్తవ్యోన్ముఖులయ్యారు.

# దశరథుని స్వగతము

చైత్ర మాసం వచ్చింది. ప్రకృతి నూత్నాలంకారధారిణి అవుతున్నది. తన వంశానికి యుగయుగాలుగా తరుగని కీర్తి ఆర్జించిపెట్టే రామచంద్రుని అద్భుతసభావిలో రానున్న ఉన్నత స్థితికి సంతోషించి, ఆ సంతోషాన్ని తన సహస్రకిరణ కరాలతో రవి పంచుతున్నాడు. దళసరి గడ్డలకై తాపత్రయ పడేవారు తాళవృంతాలకై తహతహ పడుతున్నారు. ఉష్మదరానికి ఉప్పరిగెపై వృద్ధరాజు అష్టమచంద్రుణ్ణి తిలకిస్తూ గాలిని వాంఛిస్తూ ఆసనంలో ఆసీనుడై ఆలోచనలో పడ్డాడు. ఆ రాత్రి రామభద్రుడు కైక ఇంటికి ఆహ్వానింపబడ్డాడు. అందుచే రాణిగానుగానీ, పరిచారికలుగానీ సమీపంలో లేరు. ఇంతలో గుర్రపుడెక్కల చప్పుడు విని భూపతి లేచి మేడపైనుంచి చూశాడు. రాముడు లక్ష్మణ సహితుడై రథం దిగాడు. వెంటనే లక్ష్మణుడు అన్న ఆజ్ఞ తీసుకుని ఆ రథంలోనే పెత్తల్లి మందిరానికి వెళ్ళాడు. సీతా, ఊర్మిళా, సుమిత్రా అక్కడే ఉన్నారు. రథం దిగుతున్న రాముణ్ణి చూచి మహీపతి రెప్పవాల్చటం మరిచాడు. ఆ త్రిలోక సుందరమూర్తి ఆత్మజుడైనందుకు తన పూర్వ పుణ్య విశేషాన్ని మనసారా మెచ్చుకున్నాడు. రాముడు గృహాభ్యంతరానికి పోగానే మరల తన ఆసనంలో చేరగిలబడి-

'ఆహా! ఏమి నా భాగ్యం? మా రాముని గుణాలు ఎన్నని కొనియాడను. ఆ అవయవ సౌష్ఠవమూ, ఆ శరీరకాంతి చూచి పురుషులకే మోహం కలుగుతుందంటే ఆశ్చర్యమేముంది? అస్త్రవిద్యలోనా, దేవ దానవ మానవోత్తములలో నెవ్వరు సాధించలేని శక్తిని సాధించాడు. వినయంలోనా, పండి ఒరిగిన వరి వెన్నువలె వున్నాడు. వివేకంలోనా, విష్ణుదేవుని పోలి ఉన్నాడు. ఓర్పులోనా, భూదేవి చాలదు. విచక్షణలోనా, వేయితలలు గల అనంతుడుకూడ చాలడు ఆ పరోపకార పారీణత, ఆ దయాహృదయం, ఆ మధురభాషణం, ఆ నిగ్రహం, ఆ పరేంగితజ్ఞానం, ఆ మాతాపితృ సేవాదీక్ష, ఆహా! వర్ణనాతీతం. మా వంశవారాశిలో, ఒక హరిశ్చంద్రుడు, ఒక రఘువు, ఒక అంబరీషుడు, ఒక దిలీపుడు- కాదు

కాదు. ఆ మహాపురుషులందరు కలసి ఈ చింతామణిరత్నంగా ఆవిర్భవించారు. ఇన్ని సద్గుణములు ఒకచోట చేరటం, ఆ చేరిక మానవాకృతి నందటం, ఆ ఆకృతి నాకు ఆత్మజుడు కావటం, అందులో జ్యేష్ఠుడు కావటం, ఆపై...ఎంత మధురోహ కల్గింది? ఎన్నాళ్ళకు కల్గింది? ఇంక క్షణం వ్యర్థం కానీయను. మా నాయన్ని యువరాజును చేస్తాను. హాయిగా, ఆనందంగా, అబ్బాయి పాలిస్తుంటే చూస్తూ కాలం గడుపుతాను. ఇదే తగిన సమయం. మా బాబు రాజైతే ప్రజలు ఎంతో సంతోషిస్తారు. ధరిత్రికి తగినవాడు ప్రభువౌతాడు. దశరథా! నీవు నిజంగా ధన్యుడవు. నీ జాతక మిప్పుడు బాగుగా లేదు. అపశకునములూ, దుస్స్వప్నములూ కలుగుతున్నై. రేపే మంత్రి సామంత వశిష్ఠాది ప్రముఖులతో నాలోచించి, ప్రజాభిమతాన్ని గ్రహియించి నీ కర్తవ్యం నీవు నెరవేర్చుకో'... ఇంకా ఊహ సాగుతూనే వున్నది. పదధ్వని విని సహజస్థితిలోకి వచ్చి కన్నులు తెరిచాడు. ఎదురుగా, కేకయ రాజపుత్రీ; కౌసల్యా పుత్రకుడూ.

రాముడు అభివాదంచేసి నిల్చున్నాడు. పరవశించి మైమరచిన దశరథుడు తన దీర్ఘ బాహువులు చాచి, ఆలింగనం చేసుకుని, ఆసనం చూపించాడు. కైకేయి ప్రభువు ప్రక్కనే చిన్నపీఠంపై కూచుంది.

దశరథుడు : రాణీ! చిరంజీవుల వద్దనుంచి వార్తలు వచ్చి చాల రోజులైంది. నీవైనా వేగులవాళ్ళను పంపలేకపోయావా?

కైకేయి : మేనమామల ఇంట్లో సుఖంగానే వున్నారు. మొన్ననే మీ కుశలం తెలుసుకుంటానికి వార్తాహరులను పంపాడు. మీరేమో బహుకార్యవ్యగ్రులై రాకపోవటంచేత చెప్పలేదు. ఇవ్వాళ చెపుతామనుకున్నాను. పెద్దబ్బాయి ఇక్కడనే వుంటున్నాడు. వాడిక్కడ వున్నట్లే వుంది.

రాముడు : నాన్నగారూ! చూచారుగా అమ్మగారి అనురాగం. తమ్ములు లేరన్న బెంగ నాకేగాని వారికి లేనేలేదు.

కైకేయి : ఎందుకు రామా! బెంగ? భరతుడూ నీవూ అన్నిట్లోనూ ఒకటే. మా అన్నగారికి మగ సంతానం లేదుగా. ఆ కొరత వాడక్కడ తీరుస్తున్నాడు. లక్ష్మణుడు నీ కెట్లో, శత్రుఘ్నుడు వాడి కట్లే.

మా సుమిత్రక్కయ్యదే మరీ గొడవగా వుంది. రామయ్య ఇక్కడా, లక్ష్మయ్య పెద్దక్కయ్య దగ్గర. పాపం ఎలా పొద్దు పుచ్చుతూందో.

దశ : దేవీ! సంతానవతులు గాకముందు సవతుల మధ్య సామరస్యంవుండ టం సంభవం కావచ్చునేమో కాని, అయిన తర్వాత ఇంత సహరస భావం వుండడం కష్టం. ఈ ముదిమిలో ఆ బాధలేమింకా దేవేరు లంతా, బిడ్డలకన్నా అధికంగా ఆనందం కల్పిస్తున్నారు.

కైకేయి: చూడండి అబ్బాయి ఎంత గంభీరమూర్తో.

దశ : (నవ్వుతూ) నీ వెందుకన్నావో నాకు తెలుసు. వాడు అచ్చంగా నా పోలికే.

కైకేయి: అవునవును. ఇంకా ఇద్దర్నీ చూడకపోయూరా?

దశ : ఇంతవరకే నా ఇష్టం. ఆపైన అబ్బాయి ఇష్టం.

కైకేయి : రామం నీవేమీ మాట్లాడవేం?

రాము: నే మాట్లాడవలసిందేమున్నదమ్మా. పెద్దల సంభాషణ పరమానం దంగా వుంది.

దశ : దేవీ! ప్రొద్దుపోయింది. బాబు శయనమందిరానికిపోవాలికదా! రథం సిద్ధంగా వుండమనుకుంటాను.

కైకేయి : మీ రామయ్యకు విశ్రాంతి చాలదని బెంగపడకండి. ఈ రాత్రి ఇక్కడే వుంటాడు. నూత్నమందిరం దూరం.

దశ: మీ తల్లి కొడుకుల యిష్టం. మధ్యలో నాదేముంది?

కైకేయి: మీ ఆరాటం నాకు తెలుసులెండి. మీ కోడలుమందిరంలోఅబ్బాయి రాకను అవలోకిస్తూ వుంటుంది. అలంకారం పూర్తయిందని పద్మ ఇందాకనే చెప్పి వెళ్ళింది.

దశ : బాబూ! మీ చిన్నమ్మ ఎంత హృదయం కలదో, ఎంత ప్రేమాను రాగాలు కలదో, ఎంత సున్నితంగా కార్యాలు నెరవేర్చగలదో గ్రహించావుగా. నీవు ఇంక లోటేమిటి?

రాము: నాన్నగారూ! నాకు లోటున్నదని ఎన్నడయినాఅన్నానా? అమ్మను గురించి అంతగా చెప్పాలా!

"కడుపుం బాపుడు, కామితంబుల నిడున్, గష్టంబులం జొప్పలో

డుడుకుం బాపును, తోడునీడయగునై లోకంబు సేకూర్చు, ప్రే
ముడి మన్నించును నల్పు దోసములం, బెంపున్
సొంపు గల్గించుం, బు
త్రుండు వాంఛించున దేమియున్నది? కృతార్థుం డన్నిటం
దల్లిచే."

మొగసాల ప్రాంగణంలో పదిగంటలుకొట్టారు. రామునితో కైకేయి శయన మందిరానికి పోతూ, "మీరు క్రిందికి రండి. నేను వెంటనేవస్తాను" అని వెళ్ళిపోయింది. మహీపాలుడు "తన అనుమానం వృథాగా కలిగిందేనా? తా నింతకాలం సంసారం చేసి గ్రహించినదేమిటి? నిప్పులాంటి కైకేయి ఇంతవరకు 'తన మార్గానికి అడ్డంగా నిలుస్తుంది' అని తలంచినది తనలో కలిగిన భ్రమయేనా? భ్రమ ఎందుకు కావాలి? నేనింతవరకు యువరాజ పట్టాభిషేక ప్రస్తావన చేయలేదు. ఆ మాట అంటే ఆమెమనస్సుఎలా మారుతుందో? ఏమైనా, ముందుగా ప్రజాభిప్రాయం తెలుసుకుని వారంగీకరిస్తే, సర్వ ప్రయత్నాలు సమకూర్చి వ్యవధానం లేకుండా తెలియపరుస్తాను. అయింతర్వాత ఎవ్వరు ఏం చేయలేరు" అని తలపోస్తూ క్రిందికి వెళ్ళాడు.

## ప్రభువు ప్రజాభిప్రాయాన్ని ప్రకటింపగోరుట

తెల్లవారింది. ఏకాంత మందిరంలో కూర్చుని, సుమంత్రుడ్ని త్వరగా రమ్మని కబురు పెట్టాడు. అతడు రాగానే త్వరలో సామంతులనూ, మిత్రులనూ, బంధువులనూ,పౌరులనూసమావేశపరచమనిచెప్పాడు. జనక భూపతినీ, యుధాజిత్తునూ మాత్రం పిలువవద్దని హెచ్చరించాడు. మంత్రి వెళ్ళగానే, మనస్సు చేయిపెట్టి కలచినట్లు కలతపడుతున్నది. ఎంత తొందరగా కార్యం ముగిస్తే అంతమంచిదని ఆదుర్దాలో మునిగిపోతున్నాడు. సమావేశ దినం రానే వచ్చింది. సకల సామంత బంధుమిత్రపౌర పరిజన సమేతంగా మహాసభ కలకలలాడి పోతోంది. రత్న సింహాసనంపై వృద్ధరాజు చింతామణి పీఠిపై ఇంద్రుడులాగా ప్రకాశిస్తున్నాడు. దిక్పాలకులులాగా మంత్రులూ, బృహస్పతి శుక్రుల్లాగా, వశిష్ఠ వామదేవులూ,

దేశల్లాగా పౌరసామంతాదులూ కన్నుల పండువు చేస్తున్నారు. ఇంత ఆకస్మాత్తుగా ఇంత పెద్ద ఎత్తున సభ జరగటం అందరికీ ఆశ్చర్యంగానే ఉంది. అందరి హృదయాలూ విషదా స్మృతాలై యున్నవి. సూదిపడితే వినిపించేంత నిశ్శబ్దం ఆవరించింది.

అయోధ్యాపతి ఆసనంపై నుంచి లేచి, సభ నలుమూలలు పరికించి చూశాడు. పెద్దలకు అభివందనం చేశాడు. సామాజికులకు అభివందనం తెలిపాడు. మంత్రుల వంకా, మహర్షుల వంకా, నమ్రతతో తిలకించాడు. మేఘగంభీర ఘోషణంగా, వృద్ధసింహ గర్జనంగా ఉపన్యాసం మొదలు పెట్టాడు. "సభాసదులారా! ఇది మిక్కిలి ఆనందకర సమయం. బహు కాలానికి మళ్ళీ మిమ్ముల నందర్నీ ఒక్కచోట చూచే భాగ్యం కలిగింది. మీరంతా కారణం చెప్పకుండా ఆహ్వానింపబడ్డారు. అందుకు మీరు ఆలోచనాపరులు కావటం ధర్మం. నాకది తెలుసు. అయితే ఈ సంగతి ముందుగా తెలుపతగింది కాక, సమక్షంలోనే తెలుపవలసి వుంది. ఈ సభలోనే వివరించాలి. ఇది చాలా ముఖ్యమైన విషయం. ఎంతో దీర్ఘంగా, సూక్ష్మంగా ఆలోచించి నిర్ణయించటం జరగాలి.

ఇక్ష్వాకువంశ ప్రభువులు మొదటి నుంచీ ఒక సంప్రదాయం నెలకొల్పారు. అది ప్రజాభీష్ట ప్రకారం ప్రభుత్వ వారసుణ్ణి నిర్ణయించటం. ఇంతవరకూ ఆ మర్యాద తప్పకుండా పాటించబడింది. ఇకముందు కూడా ఆ సంప్రదాయమే సాగాలి. నేను పెద్దలు పోయిన మార్గంలోనే అరవై వేల సంవత్సరాలు యథాశక్తి పాలించాను. అంతో ఇంతో మీ ఆదరాభిమానాలు చూరగొన్నాను. నాలాగే మీరుకూడా కొంతవరకు విరక్తి కలిగి వుండవచ్చును. ఎప్పుడో ఈ పని చేయవలసి వుండెను. కాని, నేను సంతాన హీనుడను కాబట్టి ఇంతకాలం నేనే పాలకుడుగా వుండక తప్పలేదు. భగవదనుగ్రహంవల్లా, మీ అందరి ఆకాంక్షవల్లా పుత్రవంతుడనైనాను. బిడ్డలుకూడా అన్నివిధాలా అర్హులుగానున్నారు. ఆ కారణంచేత, ఈ శ్వేతచ్ఛత్రం నీడలో తలపండి, జరాభారంతో శరీరం నిండి, ఇంక తప్పుకుని సకాలంలో మీకు నూత్నానందం కలిగించాలనే సంకల్పం నాకు కలిగింది. ఆ శుభవార్త మీకు తెలుపుటకే ఆహ్వానించాను.

ఇప్పుడు నా మనస్సులోనిమాట వెలిబుచ్చుతున్నాను. ఇక్కడ వున్న భూసురశ్రేష్ఠులూ, సామంతరాజులూ, మిత్రప్రభువులూ, బంధువులూ, మంత్రిసేనాపతులూ ఏకగ్రీవంగా అంగీకరిస్తే ఆ విధంగా చేస్తాను. నా అభిప్రాయం మీకు నచ్చనిచో, మీరు సూచించిన రీతినే నడుచుకుంటాను. నాకు తెలిసినంతవరకు, సాకేతవాసుల తలలో నాల్కగావుండి, వారి మన్ననలకు పాత్రుడైన శ్రీరాముని యువరాజుగా చేసి వాని పాలనలో మీరు పరమ సుఖసంతోషాలతో, పుత్రపౌత్ర పారంపర్యంగా ఆనందాన్ని అనుభవిస్తుంటే చూచి, ఆ పైన పెద్దలవలెనే ఆశ్రమ స్వీకారం చేద్దామనివుంది. పుష్యమీ నక్షత్రంతోకూడిన పూర్ణ చంద్రుడులాగా, రాజ్యలక్ష్మీకరగ్రహణంతో రామచంద్రుడు శోభించి, శోభింపచేస్తాడని నా తలంపు. ఇది అన్నివిధముల తగిన ఆలోచనేయని నా అభిప్రాయం. మీ మీ భావాలు తెల్పుడని మనవి"

## ప్రజలు రాముని రాజుగా కోరుట

ప్రభువు ఉపన్యాసం ముగించి ఆసీనుడైనాడు. సదస్యుల కరతాళ ధ్వనులు మిన్నుముట్టి, దేవదుందుభి నినాదంతో వియ్యమందుకున్నై. ఆ సవ్వడి సద్దుమణిగిన తర్వాత, జంటలుగా, పదుగురుగా, ఏకాంతంగా ఎవరికితోచినరీతి వారు నడచి అందరుకలసి ఒక్కమాటగా, అర్థసిద్ధి మహామాత్యుని, కాశ్యపమహర్షిని ముందుగా నిల్పుకొని "రామచంద్రుడు రాజవుట మాకందరకు సమ్మతమే. మా అభిమతానికి ప్రతినిధులుగా, ఈ ఇద్దరు పూజ్యులను ఎన్నికచేశాము. వారు చెప్పినది మా పూర్ణాంగీకారంగా ప్రభువులు మన్నింపవచ్చును" అని పలికారు. దశరథుడు లేచి, మళ్ళీ సభనుద్దేశించి "మహాజనులారా! నాకొక సంశయం కలుగుతున్నది. నేను రాముని యువరాజుని చేస్తానని అనగానే, వ్యవధానం కూడా లేకుండా మీరు సమ్మతించారు. అంటే నా పాలనలో ఏదో లోపం మీకు కనబడివుండవచ్చు. లేక నా కోరిక చెల్లించటానికైనా అనవచ్చు" అని కూర్చున్నాడు. వెంటనే కాశ్యపుడులేచి ప్రభువుతో ఇలా అన్నాడు.

## రాముని లోకోత్తర గుణవర్ణనం

"ప్రభూ! మా ప్రజాంగీకారానికి మీరన్న రెండు భావాలూ

కారణంకాదు. అది రాముడు పుట్టినప్పటినుంచీ, ఆయన రాజైతే బాగుంటుందని మేం మనసారా కోరుకుంటూనే వున్నాం. మా అభిలాష, రామచంద్రుని వయస్సుతోపాటు పెరుగుతూనే వచ్చింది. అందుకు కారణం మీ పరిపాలనలో లోపం వున్నందుకుకాదు. మెరమెచ్చులకుగానీ, మొగమాటంకొద్దీగానీ, రాజభయంచేతగానీకాదు. అతనిలో లోకోత్తర మైన గుణాలు చూసినందువల్లనే. మా పూర్వులు పూర్వ ప్రభువులను గూర్చి క్రమానుగతంగా చెప్పుకుంటూ వచ్చారు. వారు సమకాలీన రాజ లోకంకంటే సర్వవిధాలా గొప్పవారే. అయితే, ఈనాటి మా అనుభవంలో, వారందరిలోవున్న ప్రత్యేక గుణాలకన్నా, రఘురామునిలో ఇంకా విశేష ణంగా వుండే గుణాలు ఎన్నోవున్నై. వివరిస్తా. వినండి.

మూకటిముడి వేసుకుంటానికి ముందు కురులు మూడకముందే లోక భీకరురాలైన తాటకను చంపాడు. బ్రహ్మర్షి, అపరసృష్టికర్త అయిన విశ్వామిత్రుని యాగం రక్షించి మారీచుణ్ణి పారద్రోలి, సుబాహునితోపాటు నిశాచరులను పిలుకు మార్చాడు. యుగాంతరాలుగా, భర్త్రుశాపోపహతయై, అదృశ్యంగావున్న గౌతముని ఇల్లాలు అహల్యకు శాపమోచనం కల్పించి, సంసారిణిగా చేశాడు. రాజలోకానికి కంటకంగావున్న శివధనువును చందు వలె విరిచాడు. ఇరువదియొక్కమారు దండయాత్రచేసి, కార్తవీర్యార్జునుడు లాంటి అధముల హతమార్చి క్షత్రియజాతిని నిర్వంశం చేసిన మహా తపస్వి పరశురాముణ్ణి నిర్వీర్యునిచేశాడు. ఇవి రాముని బాల్యక్రీడలేకదా. అన్నిటికంటే మరో గొప్ప విషయం, ఋష్యశృంగుల మహాశక్తి కార ణంగా, అగ్నిహోత్రమధ్యంలో ఆవిర్భవించిన ప్రాజాపత్య పురుషుడిచ్చిన పాయస ప్రభావంతో జన్మించాడు. ఇదంతా లోకవిదితమే.

ఇక ఆమాత్యులంగా, నగరవాసులంగా, పౌరులుగా మేం గ్రహించిన, గుర్తించిన గుణాలువున్నై. బలశాలిననికానీ, రాజపుత్రుడనని కానీ గర్వంలేదు సరికదా, ఇతరుల ప్రాభవైశ్వర్యాలను ఆవగింజంత అసూయకూడాలేదు. అజ్ఞానంతో కానీ, అహంకారంతో గానీ, అపరిచితత్వంతోగానీ, అనరానిమాట అన్నా, చేయరాని పనిచేసినా, పరమశాంతంతో, ఎంతో నిండుగా, నవ్వుతూ దగ్గరకు పిల్చి అప్యాయ

వాక్కులతో అతని పొరబాటును గుర్తింపచేస్తాడే తప్ప దండన విధానాన్ని దరికి రానియ్యడు. ఆటపాటలో సైతం అందరితో అన్యోన్యంగా, కలసి కట్టుగా వుంటాడేకాని, ఎడమొగం. పెడమొగం పెట్టడు.

బలవంతుడైనా ఉద్ధతుడుకాడు. ఉన్నతుడైనా అల్పబుద్ధిలేదు. పెద్దలచాటు బిడ్డడైనా దానధర్మాలకు తక్కువలేదు. కులీనుడైనా నైచ్య పథగామికాడు. దైవాంశసంభూతుడైనా అహంకారికాడు. ఎటువంటివాడైనా, ఎంత గొప్ప వాడైనా, చెడ్డపనిచేస్తే సహింపడు. నిరంతరం ప్రజాక్షేమం కోసం, మిత్రులను పంపో, తాను స్వయంగానో విచారించి లోపాలు సవరించి శుభం చేకూర్చటానికే అవకాశం వినియోగిస్తున్నాడు కాని, స్వార్థానికి వినియోగించటంలేదు.

ప్రభువులు మమ్మల అపార్థం చేసుకున్నారనే. అమాయక హృదయంతో చెపుతున్నాము. పల్లానికి నీరుపారటం, సూర్యుణ్ణిచూసి పద్మాలు విచ్చటం, చంద్రునిరాకతో కలువలు కళకళలాడటం, సాంద్ర జలధరాచ్ఛాదనంతో మయూరాలు నాట్యంచేయటం, వసంతంలో కోకిల గొంతువిప్పి కూయటం, ఎంత సహజమో, మా కల్యాణగుణ భద్రుడు రామభద్రుడు రాజుకావాలని కోరటం అంత సహజం. పెద్దలకు పెద్దలా, చిన్నలకు చిన్నలా ఆపేక్షణీయుడు. అంతేకాని మీ పాలనలో లోపం వున్నదని ఎప్పుడూ మనసా, వాచా, కర్మణా అనుకోలేదు. ప్రజలమైన మాకు ప్రభువు లెవరైనా ఒకటే. మాకు కావలసింది మా కష్టసుఖాలను గుర్తించి వెలితిగానీ, నైచ్యంగానీ లేనివిధంగా పాలించటం మాత్రమే. మా అభిప్రాయం కోరినందున, దాపరికం లేకుండా ధర్మప్రభువులకు తెల్పుకున్నాం" అని ఆసనస్థుడైనాడు.

ఆనందాశ్రువులురాలుస్తూ దశరథుడు "పూజ్యులారా! మీరు చెప్పిన కారణాలు నూటికి నూరుపాళ్ళు సత్యం. చిరంజీవిని యువరాజు చేస్తాను. ఆలస్యం చేయను. సర్వసుఖప్రపాత్రమూ, వికసితఫలపుష్ప సంకలితవనీ గోత్రమైన ఈ చైత్రంలోనే, నా పుత్రుణ్ణి యువరాజునుచేసి, మీ అభిమతం తీరుస్తాను. నా తుది కర్తవ్యం నెరవేరుస్తాను" అని ముగించి, సదస్యసత్కారాది విధులు నిర్వర్తించి "జయరామచంద్ర, జయ దశరథ రాజేంద్ర!" అనే పౌరజన ఆనందకోలాహలంమధ్య వశిష్ఠ గురు

దేవులను చూచి "మహర్షి శ్రేష్ఠా! మీ అనితర తపశ్శక్తి సామర్థ్యాల వల్లా, మీ సమయస్ఫూర్తి, మీ దూరదర్శితా, మీ అపార ఆశీఃపరంపరా తోడై, నేను అరవై వేల సంవత్సరాలు అప్రతిహతంగా అయోధ్యా పాలనం చేశాను. ఇక విరమించదలిచాను. రాముణ్ణి రాజుగా చేయసంకల్పించాను. మొగమాటంలేని పౌరుల అభిమానం, ఆకాంక్ష, అభిప్రాయం సంపాదించాను. మీరు సత్వరం శుభలగ్నం వ్యవధి తక్కువగా అందే నాల్గురోజులకు మించకుండా నిర్ణయించండి. సంభారాలను సమకూర్చవలసిందిగా ఆదేశించండి. సంతోష సూచకంగా శతఘ్నులు ప్రేల్పించండి" అని ప్రార్థించి స్వస్థుడైనాడు. గురుదేవులు లేచి-

## వశిష్ఠుడు పట్టాభిషేకానికి వలసిన వస్తువుల మంత్రులకు చెప్పుట

"అమాత్యులారా! విన్నారుకదా ప్రభువుల ఆజ్ఞ, ప్రజల అభిమతమూ. కావలసిన ఉపకరణాలను వివరిస్తాను. వెంటనే కాలాతిక్రమణం లేకుండా సిద్ధపరచండి. వ్యవధిలేదు. రేపు భానుడు నడుమింటికి వచ్చువేళకు రామచంద్రునకు పట్టాభిషేకం జరగాలి. రత్నాలు, బంగారం, లాజలు, బలులు, ఓషధులు, తెల్లనిపూలూ, తెల్లనిహారాలూ, తేనె, నేయి, కాశికవస్త్రం, రథం, జెండా, ఆయుధ సామగ్రీ, చతురంగ బలం, పట్టపుటేనుగు, తెల్లనివీచోపులు, తెల్లని గొడుగు, బంగారు కుండలు నూరు, కొమ్ములకు పైడితాపిన వృషభం, సంపూర్ణాకారంగల పులితోలు, చందనం, మొదలైన వస్తువులను ఈ రాత్రి మూడవజాము నకు ప్రభువు ప్రాసాదంలో అగ్నిగృహంవద్దకుచేర్చాలి. రాజనగర మంతా, తోరణాలతో, పలురకాలైన హారాలతో, ద్వారాంతఃపురాలు అలంకరించాలి. ముత్యాల సున్నం మిద్దెలకు వేయాలి. పన్నీరుచల్లి, రంగవల్లులు దిద్దాలి. సుగంధ ద్రవ్యాలతో ధూపం ఇంటింటా వేయాలి. పాలూ, పెరుగూ, పిండివంటకాలతో తృప్తిగా భూసురులకు పది గడియలు ముగిసేలోపల భోజనాలు పూర్తి అయ్యేట్టు చూడాలి. భోజనానంతరం భూరి దక్షిణలు, మనో వాంఛితములు వారికి సమర్పిం

డాలి. ప్రత్యేకంగా, నేయీ, పేలాయీ, పెరుగూ వృద్ధులకు దానం చేయించండి. రేపు సూర్యోదయం కాగానే స్వస్తివాచనం జరగాలి. అపరిగ్రహీతలైన ఆచార్యోత్తములను నూర్గురిని పిలిపించి, వారు కూర్చుండుటకు పీటలు వేయించాలి. దేవతాయతనముల (దేవాలయాలు) భూసురమంత్ర పఠనంతో, దేవతార్చనలు జరగాలి. నర్త నర్తకీజనం సమస్త వాద్యవిశేషాలతో, నూత్నాలంకారధారణంచేసి మహీపాలుని ద్వితీయకక్ష్యయందు (రెండో ప్రాకారం) సిద్ధంగావుండాలి. తాము మనసార కోరినవాడు రాజుకానున్నాడు కనుక పౌరులందరూ దర్శనార్థం యథాలంకారధారులై వేచి వుండాలి" అని ఆదేశించి "ప్రభూ! మీరు కోరిన ప్రకారం అన్ని సంగతులు మంత్రులకు చెప్పాను. ఆ విషయాన్ని గూర్చి ఆలోచించవలసిన పనిలేదు. ఇకపైన మీ ఇష్టం."

## రాజు రాముని సభకు పిలిపించుట

"గురుదేవా! సంకల్పసిద్ధులు. పాకలోనుండి గాధేయప్రభువునకు దేవతలకు సాధ్యంకాని విందుసల్పిన మహాత్ములవు. మీ వాక్కే సర్వకార్యాలూ సమకూర్చగలవు. నామభేదమేకాని మంత్రులంతా సుమంత్రులే. ఈవార్త సభా సమక్షంలో రాముని చెవినివేస్తే మంచిదని అనుకుంటున్నాను. మీ సెలవైతే పిలిపిస్తాను" అన్నాడు రాజు. మంచిదన్నాడు మహర్షి. "సుమంత్రా! నీవేగి బాబును తోడ్కొనిరా!" అన్నాడు ప్రభువు. అవనతమస్తకంతో అరిగినాడు అమాత్యుడు. సుందరంగా అలంకరించిన రథంలో, సూర్యవంశ పద్మినీ సూర్యుడు సభాద్వారదేశం చేరాడు. అంతదాకా, సేనాపతిత్వం ఇవ్వటానికి కుమారుని రాకను ఎదురు చూస్తున్న ఇంద్రుడులా, దేవతల్లాగా వున్న రాజూ, పౌరజనం, రాముని రాకతో ఆనందాశ్రువులు వర్షించారు. సుమంత్రుని కైదండ ఊతగా రథావతరణంచేసి రాముడు సభలోనికి వస్తుంటే, వినయంతో మంత్రి అంజలిబంధంతో అనుసరించాడు. రాముడు రాజసింహాసనంసమీపించి మెట్లెక్కుతుంటే, మహాయోగి సమాధిలో వాయువును కుంభించి, గ్రంథిత్రయం భేదించుకుంటూ, క్రమంగా కుండలినిలోనుండి సహస్రారానికి ఎక్కిస్తుంటే, దేవభావం, ఆత్మభావంలో ఐక్యమవుతున్నప్పుడు, ఏవార

జీవితాగ్రంలో సహస్రాంశంగా మిగిలివున్న మనోధర్మదర్పణంలో ప్రతి ఫలించే చిదానందాన్ని, ఆ మహోత్సవన్ను అనుభవించింది. "నాన్నగారూ! రాముడు పాదాభివందనం చేస్తున్నాడు" అన్నమాటలు, దృష్టిదోషం తగులుతుందనికానీ, తన విపరీతవ్యామోహానికి నవ్వుతారేమోయని కానీ తలంచకచూస్తున్న ముసలిరాజు లేవనెత్తుటలోనే ఆలింగనం పూర్తిచేసి ఆశీర్వదించి, ఆసనం చూపించాడు. వశిష్ఠాది పూజ్యులకూ, సభకూ నమస్కారంచేసి కూర్చున్నాడు. దశరథుడు రామునితో ఇలా అన్నాడు.

## రాజు తనకోరిక రామునితో చెప్పుట

"రామా! పౌరజన సమక్షములో నీకొకమాట చెప్పవలసివుంది. అందులకే నిన్ను పిలిపించాను. అవిచ్ఛిన్నంగా ఇంతవరకూ సాగిన ఇక్ష్వాకువంశం నాతోనే ముగుస్తుందనుకున్నాను. భగవదనుగ్రహం వల్ల, పెద్దల ఆశీస్సులవల్ల చతుర్దిక్కుల్లాగా నలుగురు పుత్రులుకలిగారు. రాజశాస్త్ర సమ్మతంగా జ్యేష్ఠుడు రాజుగావలసి వుంటుంది. నీలో జ్యేష్ఠతయేగాక, సర్వసద్గుణాలూ, ప్రజాభిమానం మూర్తీభవించివున్నై. అందువల్ల ఈ ధర్మసింహాసనంపై శ్వేతచ్ఛత్రచ్ఛాయలో నీవు ప్రకాశిస్తుంటే, నీ శీతలంపాంగా వీక్షణచంద్రికాచ్ఛాయలో నేను విశ్రాంతి పొందుదామనుకున్నాను. ఈ నాకోరిక ఈ మహాసభ ఏకగ్రీవంగా బలపరిచింది. ఈ రోజు పునర్వసూ నక్షత్రం. రేపు పుష్యయోగముందు యువరాజుగా నిన్ను అభిషేకిస్తాను. ఈ సమయంలో ఒకటీ రెండు మాటలు నీకు చెపుతాను. నీకు తెలియవనికాదు. ఒక కారణం సంప్రదాయం. రెండవ కారణం నా వ్యామోహం.

నీవు ఆకారంచేతనే సర్వజనదర్శనీయుడవు. పలుకులచేతనే సకలప్రాణి సంతోషప్రదాతవు. అస్త్రధారణచేతనే అరిలోకభయంకరుడవు. నీకు సాటి నీవే. ఈ మాటలు తండ్రిగా నేను బహిరంగంగా అనతగినవికావు. కాని, ఇందాక జరిగిన సభాచర్చల అనంతరం ప్రజావాణికి ప్రతిధ్వని ఇవి. వినయం, విజితేంద్రియత్వం నిత్యసుశీలతా, కామాన్నీ, క్రోధాన్నీ పెంచే వ్యసనాలకు దూరంగావుండటం, ఆప్తులైనా, ప్రజాభిప్రాయంలో దుష్టులైతే పరిత్యజించటంముఖ్యం. తనకు అపకారం

కల్గించేటట్లు మంత్రుల మంత్రాంగంతో కనుపిస్తేగానీ, తనకు వ్యతిరేకంగా రహస్య పన్నాగాలు పనిచేస్తున్నట్లు తెలిసినప్పుడు కానీ, జాగరూకతతో ప్రవర్తించాలి కానీ, అధికారం వున్నదని అణచివేతకూ, ప్రతీకారానికీ పాల్పడవద్దు. తాత్కాలికంగా విజయం పొందినా, అంతర్గతమైన అవమానాగ్ని అనంతకోటి రూపాలతో అవకాశాన్ని అన్వేషణ చేస్తుంది. నిసర్గంగా అందరూ మంచివాళ్ళే. సర్వసాధారణంగా సంఘజీవులు ఉదాసీనులే. కనుక వ్యతిరేకతకు హేతువు తనలోనే వుంటుంది. నీకట్టి బాధలులేవు. అనువర్తనులైన సోదరులున్నారు. అనుకూలురైన ప్రజలున్నారు. ధనధాన్యాగారాలు ఎప్పుడూ సమృద్ధంగా వుండాలి. ప్రకృతి వైపరీత్యాలవల్ల సంభవించే కష్టనష్టాలకు ప్రభువు పాలనం కారణం కాబట్టి, అరమరలేకుండా ఆదుకోవాలి. అందుకు ఆ రెండు కోశాలూ పుష్కలంగా ఉండాలి. అందుకని ప్రజలపై విహితమైనదాని కంటే అధికంగా పన్ను విధించరాదు.

ఇది అంతరంగిక భద్రత. మానవుల స్వభావాలు భిన్నభిన్నంగా వుంటవి కాబట్టి, బాహ్యభద్రతకూడా అవసరం. అందుకు చతురంగ బలం, అస్త్రశస్త్రాలు, నిండుగా, గంభీరంగా, పుష్కలంగా, పటిష్ఠంగా వుండాలి. అప్రమత్తులైన పర్యవేక్షకులు వుండాలి. సూక్ష్మదర్శనులూ, బుద్ధికుశలురూ అయిన మంత్రులుండాలి. ఇప్పటికి అయోధ్యాపతుల పాలనలో అరిక్తత రాలేదు. ముందు రానేరాదు. సర్వలక్షణ లక్షితమూ, సర్వసంపన్నమూ అయిన ఈ రత్నసింహాసనం రేపు నీకు అప్పగించబడుతుంది. ఇకపోయిరా నాయనా!" హుంకారంతో పదకొండు గంటలు మ్రోగినై. మంగళవాద్యధ్వానాలు మార్మోగినై. సభసమాప్తమైంది. నియమిత కార్యాసక్తులై మంత్రులూ, సేనాపతులూ వెళ్ళారు. రాజు తొందరగా ఏకాంత మందిరానికి పోయాడు. వసిష్ఠుడు పోతూ రాజుతో "మీ గ్రహబలం లగ్నానికి వక్రంగావుంది. జాగ్రత్త" అని రహస్యంగా హెచ్చరించి మరీ వెళ్ళాడు. తార్కికులూ, జ్యోతిష్కులూ పోతూ ఇలా ప్రసంగించుకున్నారు.

తార్కి: "సిద్ధాంతిగారూ! ఇంత అట్టహాసంగా జరిగిన సభలో ప్రభువుల వుపన్యాసంలో కొన్ని ఒడుదుడుకులు కనిపించాయి.

సిద్ధాం: లగ్నంలో రాజయోగకారకుడైన కుజుని వక్రవీక్షణం పడింది. అది బలవత్తరంగావుంది. మహర్షులవారు ఎలా నిర్ణయించారో?

తార్కి: ఇది వశిష్ఠులవారు పెట్టారని ఎవరు చెప్పారు?

సిద్ధాం: ఒకరు చెప్పేదేమిటి? ఇది అనూచానంగా వస్తున్నదేగా?

తార్కి: ఈనాటి ఈ సన్నివేశ సంఘటనలు, సంప్రదాయ విరుద్ధంగా లేవా? ప్రభువు చివరి మాటలో, "ఈరోజు పునర్వసూనక్షత్రం, రేపు పుష్యయోగంలో అభిషేకం" అని అనలేదా? అటువంటప్పుడు ఇది రాజుగారు పెట్టుకున్న ముహూర్తమే. మహర్షులవారు ఏం జరుగుతుందో తెలిసినవారు కనుక రాజాజ్ఞను పాలించాడు.

సిద్ధాం: ఇది ప్రత్యక్షంగా చూచినవాళ్ళం కాబట్టి సరిపెట్టుకుంటున్నాం. తెలియనివాళ్ళు మహర్షులవారినే ఆక్షేపిస్తారు. "బ్రహ్మమానస పుత్రులూ, మహర్షి శ్రేష్ఠులూ, ఇక్ష్వాకులకు వంశగురువులూ అని ప్రగల్భాలు చెప్పుకునే ఆయనేనా ఈ ముహూర్తంపెట్టిం" దంటారు; కాని, ప్రభువుల కక్కుర్తికార్యం అని అనుకోరు.

తార్కి: ఎవరేమనుకున్నా, రాజ తిరస్కారం చేయరానిపని. కనుక, నివారించలేదు. ఒకవేళ ఆయన సిద్ధపడితే ఆ వృద్ధుని ఆవేశంలో అయ్యవారికి ఉద్వాసం తప్పేదికాదు. అమాయకప్రజ ఆయన్ని దూయబట్టేది. అయినా పోతూపోతూ ప్రభువు చెవిలో ఏదో అనే వెళ్ళాడు.

సిద్ధాం: నిజమేనండి. నేనూ చూశాను. ఏదో మరచిపోయిన సంగతి గుర్తు చేయటానికి అనుకున్నాను.

తార్కి: సిద్ధాంతిగారూ! ఇదిరాచకార్యం. మనంపౌరులం. ఇందువల్ల వచ్చే ఫలితాలు మనవేమీకావు. ఈ సమయంలో గూఢచారులు ముఖ్యంగా పనిచేస్తుంటారు. మనదారిన మనంపోతే మంచిది."

ప్రభువు ఏకాంత మందిరానికిపోతూ, సుమంత్రునితో మళ్ళీ రామచంద్రుణ్ణి తన వద్దకు తీసుకురమ్మనిచెప్పి వెళ్ళాడు. సుమంత్రుడు రామనివాసానికి పోయాడు.

## వృద్ధ రాజు హృదయ సంఘర్షణ

తలపైవున్న పంకా లాగబడుతున్నది. వాతాయన రంధ్రాలకు (కిటికీలకు), ద్వారాలకుకట్టి, నీటిలో తడిపిన వట్టివేళ్ళ తడకలగుండా శీతల వాతం వస్తున్నది. తన హృదయం చల్లబడదేమి? శతసంఖ్యలో ఉల్కాపాతాలూ, సహస్రసంఖ్యలో భూకంపాలూ, లక్ష సంఖ్యలో అగ్ని పర్వతాలూ కలిగించని వుత్పాతం కలుగుతున్నది. కారణం ఏమైవుంటుంది? ధర్మాతిక్రమణం జరిగిందా? ఇందులో అధర్మమేముంది! పెద్దవాడు రాజు అవటం రాజధర్మమేకదా. అందులో బహిరంగంగానే ప్రకటించి, ప్రజాభీష్టంపొందిన తర్వాత శంకకు తావెక్కడవుంది?

బుద్ధి: ఎక్కడవుందా? నీలోనేవుంది.

దశ: నాలోనా? నేనెందుకు శంకిస్తాను? నేను మనఃపూర్వకంగా రామ పట్టాభిషేకం వాంఛించి, అందుకు యత్నం ముమ్మరంగా సాగిస్తున్నాగా.

బుద్ధి: ఇంత కక్కుర్తిగా నీ తండ్రి నీ పట్టాభిషేకం చేయతలపెట్టాడా?

దశ: లేదు. ఇందుకు ప్రబలకారణంవుంది. జాతకరీత్యా నా గ్రహసంపత్తి బాగాలేదు. ఆసన్నమరణాన్ని సూచిస్తున్నది. అందుకే తొందర పడుతున్నాను.

బుద్ధి: మీ వంశ పురోహితుడూ, అంతరంగిక అమాత్యుడూ అయిన వశిష్ఠమహర్షి చేత ఎందుకు ముహూర్తం పెట్టించలేదు? ఆయన్ను కూడా అనుమానించావుగా! ఆయనకు నీ భయం తెలియందికాదే.

దశ: పొరపాటే జరిగింది. నేను లగ్నం రేపని చెప్పినప్పుడైనా చెప్ప వచ్చుగా?

బుద్ధి: బుద్ధిమంతులు ఎందుకు చెప్తారూ? అది ఆలోచనామందిరమా? మహాసభ మధ్యంలో రాజాజ్ఞను తిరస్కరిస్తారా? పోనీ నిన్ను హెచ్చరించి మరీ పోయారుకదా?

దశ: ఆయన అన్నమాటలో అర్థం నాకు బోధపడలేదు.

బుద్ధి: నీ కర్థంకాదు. మరొక సమయంలో అయితే బోధపడేదే. నీవు రాజ మార్గం వదలి, అన్యమార్గంలో గమ్యం చేరదలిచావు. ఎక్కడ నీ

ప్రయత్నానికి భంగం వాటిల్లుతుందో అనే భయం నిన్ను ధీజదుష్టి చేస్తున్నది. నీ నలుగురు కొడుకుల్లో ఇద్దరు ఇక్కడ లేరు. ముఖ్యంగా నీ ముద్దుల మోహంపుటిల్లాలు కైకేయీదేవి కొడుకు భరతుడైనా-

దశ: అబ్బా! ఇక ఆపు. ఆ మాట వినలేను. గుండెలో గునపంపోటులాగా తగులుతున్నది.

బుద్ధి: అదే నీలో ఉత్పాతం కలిగిస్తున్న అగ్నిహోత్రం. రాజా! నీవు బాహ్యంగా ఎంత ధర్మపరుడవో, ఎంత బలవంతుడవో, ఎంత గంభీరుడవో, లోపల అంత సంకుచితభావుడవు, అంత దుర్బలుడవు అంత వెలితిగలవాడవు.

దశ: నిజమే. నేను కైకను పెండ్లాడేటప్పుడు రాజ్యం ఉంకువచేశాను. అది బహుకాలంనాటి మాట. మామ గతించాడు. బావమరదికి సంతానం లేదు. భరతు డక్కడే వుంటాడు. వానితోపాటే శత్రుఘ్నుడూ. కైకకు ఇచ్చినమాటలో కొడుకుకోరితే ఇస్తానన్నాను. ఇక రాముని పట్టాభిషేకానికి పోటీదారిని ప్రయాణం ఏముందీ?

బుద్ధి: అయితే ఈ కలవరం నీకు దేనికి? ఈ సంగతి ఇంతమాత్రమే అయినప్పుడు జనకుణ్ణి, అందులో, నీ ప్రేమపాత్రుడైన రాముని భార్యకు తండ్రిని, నీ బావమరది యుధాజిత్తును, భరత శత్రుఘ్నులను ఎందుకు ఆహ్వానించలేదు? నీవు పిలిపించినవాళ్ళు అంతకంటె ముఖ్యులా? రాజా! నేను బుద్ధిని. నా కంటే బలం కలది మనస్సు. మనస్సు ఇంద్రియాధీనంగా వున్నంతవరకు నన్ను లక్ష్యం చేయదు. తర్వాత విచారించి నన్నే ఉపాయం అడుగుతుంది. కాని, నేనేం చేయలేను. చివరిమాట చెప్తున్నాను. పైన నీ ఇష్టం.

నీ వంశం మహాపవిత్రమైంది. సత్యవాక్య పరిపాలనం సర్వదా ఆచరించింది. ఇంతవరకు నీవూ ఆ విధంగానే ప్రవర్తించావు. అయితే ఈ విషయంలో నీవే అనుమానాన్ని కల్పించుకున్నావు. భరతుడు దగ్గర వుంటే రాజ్యం అడుగుతాడనేదే ఆ అనుమానం.

అతనికి నీ విచ్చినవరంమాట తెలియదు. ఇక తెలిసినవాళ్ళు నీవు కాక ముగ్గురు. ముగ్గురిలో విద్యుంకుడు గతించాడు. నీ వన్నట్లు దావమదిటికి బిడ్డలు లేరు కనుక, తెలిసినా ఆ సంగతి అతనికి చెప్పడు. తనరాజ్యం ఇచ్చి తనవద్దనే వుంచుకుంటాడు. మిగిలింది నీ మూడోభార్య కైక. ఆమె రామునిలో జీవిస్తున్నది. ఆమె ఆ సంగతి మరచిపోయింది. ఆమెకూడా కొడుకుకు ఎన్నడూ చెప్పలేదు. ఇది వాస్తవం. మిగతాదంతా నీ అనుమాన కల్పితం. అందుకే మీ కులగురువు నీ గ్రహబలం లగ్నాన్ని వక్రంగా చూస్తున్నదని గుప్తకూడా చేశాడు. పర్యవసానం నీమీద, నీ సమయపాలనంమీదా వుంది.

దశ: బుద్ధీ! నీవు చెప్పింది సత్యం. ఇప్పుడిక చేయగలిగిందికేదు.మందిలో మాట ఇచ్చాను. ఆపితే ప్రజాభిప్రాయం మారుతుంది. అల్లకల్లోలం జరుగుతుంది. పర్యవసానం వ్యతిరేకమైతే పశ్చాత్తాపంతో మరణిస్తాను. అది ఎలాగూ తప్పదు. ఈ వేడుక కన్నారా చూడనైనా చూస్తాను" అంటూ బుద్ధితో ఘర్షించి ఒక నిశ్చయానికి వృద్ధరాజు వచ్చాడు.

మంత్రిచే వార్త నెరింగిన రాముకు ముందు సంశయించి, హుటాహుటి తండ్రి దర్శనార్థం వెళ్లాడు. నమస్కరించి నిలిచాడు. కంపిత కరాలతో గాఢాలింగనం చేసుకొని, ప్రక్కన కూర్చుండబెట్టి చెప్ప సాగాడు.

## మహీపతి రామునితో మంతనము సల్పుట

"నాయనా! రామా! ఇప్పుడు నేను చెప్పేది చర్వితచర్వణమే. కానీ, చెపుతున్నాను. నన్ను గురించి చెప్పవలసిందేమీలేదు. నా పరిపాలనమూ, నా గుణాలకూ, వర్తనకూ, ప్రజలూ, బుధులూ, నీ తల్లులు ప్రతీకలు. నేను ముసలివాడనయ్యాను. అందులో కొన్ని రోజులుగా దుర్నిమిత్తాలు తోస్తున్నై. కన్నుమూస్తే దుస్స్వప్నాలు కనిపిస్తున్నై. జాతకాన్ని పరిశీలించిన జ్యోతిష్కుడు. రాహువూ, కుజుడూ, రవీ జన్మ తారలో ప్రవేశించారు. మారకంగానీ, అంతకు తుల్యమైన అనర్థంకానీ,

లేక రెండుగానీ చాలా దగ్గరలో సంభవిస్తాయని చెప్పారు. ఆ భయంతో ఏ క్షణాన ఏమి ఉపద్రవం వస్తుందో అని అవ్యవధిగా ఈ కార్యం తల పెట్టాను. నా సంకల్పంలో తర్కానికి తావులేదు. నాలక్ష్యం ఒక్కటే. అది నిన్ను రాజుగా చేయటం. నా మాటవిని, అందుకు నీవు అంగీకరించు. సోదరులుగానీ, మామగారుగానీ లేరుంటా, ఈ అకాండ తాండవం ఏమిటని అనుమానించకు. వారు దూరదేశస్థులు. కబురుపోయి వారు వచ్చునప్పటికి కాలం చాలా గడిచిపోతుంది. అంతవరకు నా శరీరం నిలుస్తుందని నాకే నమ్మకంలేదు. నీ తమ్ములు నీ వలెనే యోగ్యులు. మొదట కొంత బాధ పడినా, తర్వాత కృతతోషులు (అయిన దానిని హర్షించువారు) అవుతారు. అన్నీ నేను ఆలోచించే ఏర్పాట్లు చేశాను.

ఈ రాత్రికి కోడలూ నీవూ ఉపవసించాలి. దర్భలపై శయనించాలి. మందిరంచుట్టూ అప్రమత్తులైన వీరులు పహరా యివ్వాలి. మనం మానవులం. మన జాగ్రత్తలో మనం వుండాలి. తర్వాత దైవానుగ్రహం. అందుకే పెద్దలు "క్షత్యాగంతు మనుష్యాణాం, సప్తమం దైవచింతనమ్" అన్నారు. రేపు మధ్యాహ్నానికి నీవు రాజువు అవుతావు. అది మన వంశ మూలపురుషుడు మార్తాండుడు మధ్యందిన గతుడై చూచి ఆనందిస్తాడు. పోయిరా నాయనా! పొద్దుపోయింది" అని సాగనంపాడు. మేడ దిగిన రాముణ్ణి మిత్రులు గుచ్చి గుచ్చి అడిగారు. రాముని మాట నోరు దాటిందోలేదో స్నేహితులంతా పరుగులుతీసి కౌసల్య చెవిలో కమ్మని వార్తామృతం పోశారు. ఆమె వారిని చిరాయువులుగా దీవించి బహుకంగా సత్కారంచేసింది.

రామచంద్రుడు మిగిలిన మిత్రులతో ముచ్చటిస్తూ తల్లి మందిరానికి వెళ్ళాడు. ఆమె ధౌతవస్త్రావేష్టితయై, ఈషన్నిమీలిత నేత్రారవిందయై, నిశ్చలయై, మౌన ముద్రాంకితయై మనస్సు శ్రీరంగేశుని దివ్యపాదారవిందములలో లగ్నంచేసి, పుత్రునకు సర్వశోభనములు సమకూర్చుమని ప్రార్థిస్తూ, రెండు చేతులుమోడ్చి ధ్యానంలో మునిగియున్న తల్లిని చూశాడు. ఆయనకు జన్మాంతర సంస్కార బలంచేత అతిథి జ్ఞాపకం వచ్చింది. "ఆహా! మాతృహృదయం ఇంత మకరంద సదృశమా?

మాతృమూర్తిలో ఇంత అలౌకిక, అవ్యక్తసౌందర్యం నిండివుందా? మిశ్రమగుణాత్మకమై వచ్చిన ఈ మానవ శరీరంలో ఇంతతేజస్సు పదవుంటుందా?" అని సానందాశ్రు నయనుడయ్యాడు. భార్యా, పినతల్లీ, భ్రాతా అక్కడ వుండటంచూచి ఆశ్చర్య పడ్డాడు. లోనికి అడుగు పెట్టాడు. సీత సిగ్గుతో చిన్నత్త వెనుక చేరింది. లక్ష్మణుడు చరణాభివందనం సలిపాడు. సుమిత్ర దగ్గరకు తీసుకుంది. కైకేయి తనకై పంపిన ఆభరణాలు చూపించమని చిన్నత్తయ్యకు సీత కనుసైగ చేసింది. కౌసల్య పూజముగించి అందరికీ దేవతాప్రసాదం పెట్టింది. తనబిడ్డ తండ్రికే కాక కైకేయికిసైతం ఆదరాభిమాన పాత్రుడైనందుకు ఎంతో తృప్తిగా నిట్టూర్చింది. అభివాదంచేసిన బిడ్డను లాలనతో ఆలింగనం చేసుకుని, తల నిమురుతూ,

"శ్రీరస్తు! శుభమస్తు! చింతితకామ్యార్థసిద్ధిరస్తు! కనకవృద్ధిరస్తు!
పుత్రాభివృద్ధి, సన్మిత్రాభివృద్ధి, సత్పాత్రాభివృద్ధి, కళత్రవృద్ధి,
ఆయురారోగ్య, మహైశ్వర్యమును, దానధర్మాభిరతియు,
సంతతశుభంబు'
జయము, విద్యాకలాసారజ్ఞతయు, బరమంత్రాంగదర్శన
మర్మజ్ఞతయును,
ఆర్తజనరక్షణంబు, సత్యవ్రతంబు,
వైరిమదగజగర్వ నిర్మాపణంబు,
సాధుపోషణ, దుష్టశోషణ యశంబు
జరుగుగావుత!! శ్రీరంగనాయికరుణ.

అని దీవించింది. రంగేశుని పాదస్పర్శచే పవిత్రమై శక్తిమంతమై, ఐహికాముష్మికప్రసాదన సమర్థంబైన పద్మతులసీదళాలను, అక్షతలతో శిరమంటించింది. "రామయ్యా! విన్నాం. నీ మిత్రులు చెప్పారు. ధరాదేవి శిశిరం వదలి వసంతకాలంలో ప్రవేశించింది. రాజువైన తర్వాత, కొన్ని ప్రత్యేక ధర్మాలను అనుసరించాలి. వద్దనటానికి వీలులేని కొన్ని భోగాలు తప్పవు. సమయాసమయాలు మిక్కిలిగా పాటించబడతై. భార్యభర్తలేకాని, తల్లికొడుకులేగానీ, అగ్రజసోదరులేకానీ, వారిమధ్య ప్రవర్తనం చాలా పరిమితం. ముందు తెలుపక, అంగీ

కారంలేక పరస్పరం కలియరాదు. అజ్ఞానంచేనూ, అహంకారంచేనూ, అధికార వ్యామోహాలచేనూ, మూఢులచేనూ, దుస్స్వార్థులచేనూ రాజ్యాధికార ప్రాప్తి ఎటువంటిదో తెలుసా? తలపై ధరించేది నవరత్నాలు తాపిన బంగరు కిరీటం. ముత్యాలు పొదిగిన తెల్లని పట్టుగుడ్డతో తయారు చేయబడిన గొడుగునీడలో వుండేది. ఆసనం, ఇరుప్రక్కల హేమంతో నిర్మించిన సింహాసనమధ్య రత్న కంబళం, పక్షుల రెక్కలలోనున్న మృదువైన పదార్థంతో చేసిన ఆనుకుడింతూ, కలది. ఆహార విహార వ్యవహార పానీయాలు సామాన్యగృహస్థ జన దుర్లభం. ఇక ఇక్ష్వాకులకివి ఇట్లుగా భాసించవు. కంటకాబద్ధమైన గిజగానిగూడు కిరీటం. పరమ పరిశుద్ధ పవిత్ర జీవిత ప్రతీక శ్వేతచ్ఛత్రం. ఆహార విహారాదులన్నీ, ఆయుర్వృద్ధికీ, ఆరోగ్యానికీ, నియమపాలనకూ, క్రమశిక్షణకూ సాధనాలు. సింహాసనం తృణచ్ఛన్నరూపం. (గడ్డికప్పినబావి). రామా! నాక్షీరం త్రావిన నీకు చెప్పవలసిన పనిలేదు. నీతో ఈ వంశం నూత్న గౌరవ స్థానాన్ని సంపాదిస్తుంది. అందుకు అన్నివిధాలాతోడు మా సుమిత్రమ్మ బిడ్డ. నీకు శుభమగుగాక." కంఠం రుద్ధమైంది. వేడికన్నీటి బిందువులు తల తడిపినై. ఆ వృద్ధురాలి చేతులు తెలియకుండగనే రాముణ్ణి గుండెకు హత్తుకున్నై. ఆ మూర్తిలో మమకారంతో పుత్రుణ్ణి చూసిందో, భక్తితో పరమేశ్వరుణ్ణి చూసిందోకాని, కన్నులుమాత్రం తెరువలేదు. రాముడు మాతృ పరిష్వంగంలో ఎనలేని అనుభూతి పొందాడు. మెల్లగా తల్లి కనులు తుడుస్తూ, "అమ్మా! నాన్నగారు నాకు రాజ్యం దత్తంచేసి విశ్రాంతి తీసుకుంటారట. ఈ రాత్రికి నన్నూ, నీ కోడల్నీ నిరాటుపవాసం చేయమన్నారు. దర్భలపైన పరుండమన్నారు. అందులకు తగిన ఏర్పాట్లు చేయించమ్మా. చిన్నిగారూ! నా తమ్ములను సంతోషపెట్టే సమ యం ఆసన్నమైంది. మా ఇద్దరికీ బాహ్యభేదమేకాని అంతర్భేదంలేదు. తల్లులకు కోడళ్ళుగానీ, కొడుకులుగానీ అనురాగ పాత్రులుగా మెలగు తారు. మేము ఆవాసాని కరుగుతాం. సెలవిప్పించండమ్మా" అంటు సుహృత్తులతో కలసి వెళ్లాడు. సీత వెనుక మేనాలో వెళ్ళింది.

# రాముని ఏకాంతం

దశరథుడు తొందరగా వశిష్ఠులకడకేగి, యువసంపదుడుకు ఉపవాస దీక్ష ఒసంగి రావలసినదిగా కోరాడు. ఆయన యథార్థరథంపై రాము మందిరానికి వెళ్లాడు. రాముడు భయభక్తులతో ఎదురుగాపోయి లోనికి ఆహ్వానించాడు. ఆ తపస్వి దంపతిని వేదవిహిత కర్మానుసారంగా వుపవాసదీక్ష విధించి, "రామచంద్రా! రేపు నీవు యువరాజువు అవుతావు. అప్పుడు మేం చెప్పదగిన స్థితిలో వుండం. ఇప్పుడే రెండేరెండు మాటలు చెపుతాను. సత్యవాక్యపాలనం, ధర్మాచరణం జీవితపరమార్థంగా కీర్తికాముడవు కమ్ము. యశస్వులైన వంశవృద్ధుల మరపించు. శుభం భూయాత్" అని దీవించి తేరుపై ఆశ్రమానికి పోయాడు

దీక్షానంతరం దర్భలపై కూర్చున్నాడు. దూరంగా సీతపాడ్తుంది రంగేశుని ధ్యానశ్లోకాలు చదువుతున్నది. ఆ మధురకంఠంలో భక్తి విశ్వాసాలు అర్థానికి అలంకారం చేస్తున్నై. రాముడు వింటూ కన్నులు అరమోడ్చాడు. క్రమంగా సమాధిగతుడవుతున్నాడు. క్షీరసముద్రం. శేషతల్పం. శ్రీదేవి భూదేవి చరణ సంవాహనం. నాభిస్థానంలోని పద్మనాళాగ్రభాగంలో వికసిత పద్మంలో చతుర్ముఖ బ్రహ్మ, ముప్పై మూడుకోట్ల దేవతలూ, భూభార హరణార్థం అవతరించటానికి ఆ మూర్తిని అర్థించటం కనుపించింది. దృశ్యం మారింది. జలద గంభీర ధ్వానంతో "రావణ సంహారార్థం నేను మానవరూపంతో అవతరిస్తాను. మీరు వానరులుగా జన్మించండి" అంటూ అదృశ్యం కావటం కనుపించింది. యవనిక అపసరణం జరిగింది. పరమేష్ఠితో పాకశాసనుడు "ఇది జరిగితే అవతారప్రయోజనం వుండదు. భంగం జరిగితీరాలి. అందుకు వుపాయం సెలవివ్వండి. రాక్షసుల ఆగడం మితిమీరుతున్నది. యజ్ఞ ధ్వంసం, సాధుబాధా, విపరీతంగా సాగుతున్నది. హవిర్భాగాలు లేక దేవతలు అల్లాడుతున్నారు" అనగానే, ధాత, తలపంకించి, "దీనికి నీవు చేయాల్సినది ఒకటుంది. రెండు విపరీత శక్తులను కల్పించి ఆ ఇద్దరిలో ఆవేశింప చేయాలి. నీ కోరిక సిద్ధింపగలదు" అని సమాధానించాడు.

"ఇది నిజమా? స్వప్నమా? నేను నిద్రించలేదుగదా? ఈ దర్శనానికీ, ఈ అవ్యక్తావ్యక్త సంభాషణకూ అర్థమేమిటి? ఇది దేవతాభాషణం కనుక జరిగితీరుతుంది. నేను అవతారమూర్తినా? అయితే నాకు జరుగనున్న పట్టాభిషేకం భంగం కావలసిందేనా? దీనికి కారకులు దేవతలా? నేను సామాన్యరాజ కుమారుడను గదా? త్రికరణాలల్లో భావింపబడని సంఘటన నాకెందుకు కన్పించాలి? సర్వాధికారి తండ్రి. ప్రజాముద్ర వుంది. భంగించే వారెవరూ? నా అభిషేక భంగానికీ, రాక్షససంహారానికీ సంబంధమేమిటి? ఈ విచ్ఛిత్తికి విపరీత శక్తులు రెండు పూనుకుంటున్నవా? సమన్వయం సాధించలేక పోతున్నాను. ఎంత శక్తి సంపన్నులమైనా మానవులంగదా." ఇంతలో, చతుర్థయామ సూచకంగా రాజప్రాంగణంలోని కంచుగంట కొట్టబడింది. రామునకు సమాధి భంగమైంది. తాను చూచినదీ తలచినదీ స్మృతిపథంనుంచి తుడిచిపెట్టబడింది. యథా రాముడైనాడు.

## రాజవీథులలో పౌరజన సమ్మర్దం

రాముణ్ణి దీక్షితునిగాజేసి సత్కృతుడై చనుచున్న మహర్షి రథం ముందుకు సాగటమే కష్టంగా వుంది. ఎక్కడచూచినా నూత్నాలంకార శోభితులైన యువతీ యువకులు ఇసుకవేస్తే రాలకుండా గుంపులు గుంపులుగా మూగుతున్నారు. కొందరు గృహశిఖరాగ్ర భాగాలమీద ధ్వజాలు కట్టుతున్నారు. కొందరు నీళ్ళుచల్లి ముంగిళ్ళ ముందు ముత్యాల ముగ్గులు చిత్రవిచిత్రంగా తీరుస్తున్నారు. కొందరు తోరణాలు కొందరు అరటి స్తంభాలు, కొందరు పందిళ్ళు రకరకాలుగా అమరుస్తున్నారు. దేవాలయములు, చైత్యములు, శృంగాటకములు, అట్టాలకములు, అంగడులు, వినోదస్థలాలు, విహార ప్రదేశాలు, సభాస్థలాలు, రచ్చపట్టులు, వృక్షాగ్రంబులు, క్రీడకగిరి శిఖరాలు, పూలదండల తోరణాలతో, రంగు రంగుల దీపాళితో అలంకరిస్తున్నారు కొందరు. పదాతులు కొత్త దుస్తులు ధరించి, ఆయుధపాణులై, అధిపతి ఆజ్ఞానుసారం వ్యూహ భేదాలతో, వాద్యఘోషాలంగా, రాచనగరు మొదటి ప్రాకారానికి పోతున్నారు. ఇంటింట దేవ దేవతా పూజార్చనలు జరుగుతున్నై. ఎక్కో

దారిచేసుకొని వృద్ధరాజమందిరానికివెళ్ళి కౌగిలించుకొని, కోడలికీ, దీవెన ఇచ్చి, వుపవాసవిధి తీర్చి వచ్చానని చెప్పి మహర్షి సెలవుతీసుకున్నాడు. పరివేష్టించి వచ్చిన పౌరులకు సెలవొసంగి కంఠీరవం గుహలొనికి పోయి నట్లు శయన మందిరంలోనికి చేరుకున్నాడు రాజు.

## రాముడు నారాయణార్చన సేయుట

నాల్గవ యామంలో పురోహితుడు సీతారాములను సమంత్రకంగా స్నానాది విధుల నిర్వర్తింపజేసి శ్రీరంగేశ్వరుని మందిరానికి తోడ్కొని చని, వేదోక్తంగా, కలశస్థాపనా, ప్రాణప్రతిష్ఠా, ఆవాహనా, సహస్రనామార్చనా, తులసీ, పద్మ, కుంద, మందార, జాతిపుష్పాలతో అష్టోత్తర పూజా ముగించి, నారికేళ, కదళీ, ముద్గ, పిష్టి, గుడోదకాలతో నైవేద్యం పెట్టించి, మంత్రపుష్పం పఠించి, ఆత్మప్రదక్షిణ నమస్కారాలను చేయించి, కర్పూర నీరాజనం సమర్పించి, పునఃపూజా, ఉద్వాసనాదుల పూర్తిచేయించి, అక్షతలనూ, పుష్పాలను కైకొని, "దేవతానుగ్రహ ప్రాప్తిరస్తు! శుభం భవతు, దీర్ఘాయుష్మాన్‌భవ, శీఘ్రమేవ రాజ్యాధికార సిద్ధిరస్తు" అంటూ దీవించి నారాయణార్చనం పూర్తిగావించి, ప్రాసాద ప్రవేశద్వార సమీపానికి తీసుకొనిరాగా, అంతకుపూర్వమే వశిష్ఠులచే పంపబడిన నూర్గురు బ్రాహ్మణులు పీటలపై ఆసీనులై, దంపతులను ఉన్నతపీఠంపై కూర్చుండజేసి, సెలయేటి ధ్వానంలాగా, కోకిల మధుర కూజితంలాగా స్వస్తివాచన మంత్రాలు చదువుతుంటే, దేవాలయాలల్లో ఘంటానాదాలు మ్రోగుతుంటే, డోళ్ళు, సన్నాయి, బాజాలు, బాకాలు, నగారాలు మ్రోగుతుంటే అయోధ్యానగరం పర్వదినం నాటి పాథోధి రీతిగా ఘూర్ణిల్లిపోయింది.

## పౌరభాషణం

ఏనాడు జరిగిందో, ఎన్ని పురుషాంతరాలు గడిచాయో, లెక్క లేదుగదా. అరవై వేల సంవత్సరాలంటే మాటలా? మన పూర్వులకు లేని ఈ మహాదృష్టం మనకిప్పుడు లభించింది. ప్రభువుల అశ్వమేధయాగం మొదలు ఇంతవరకూ కనీ వినని ఆనందాన్ని ఎవరెరుగకుండా అనుభ

విస్తున్నాం. తెల్లవారితే మబ్బువిడిన మార్తాండునివలె ప్రకాశించే సీతా రాముడు, ప్రజాహృదయ పాథోనిధి సోముడు, ఆర్తరక్షణుడు, దుష్ట శిక్షణుడు, ప్రసన్న సుందరుడు, దరహాసవదన మందిరుడు, సద్గుణ గంభీరుడు, భుజబలనిర్జిత వైరివారుడు రాజపుత్రుడు. కన్నులకు పండుగ. వీనులకు విందు. హృదయానికి సుప్రసన్నత. జిహ్వకు రుచి. కర చరణాదులకు సార్థక్యం. ఆహా! ఎంత పుణ్యం చేశామో ఈ మహా యోగం దర్శించటానికి? ఎంత దానం చేశామో ఈ శుభవేళలో జీవించ టానికి? కాదా మరి? అప్పటి ప్రభువుల విషయం అనుకుంటుంటే విన్నాం కాని, కళ్లారా చూచే ప్రాప్తి ఇప్పుడు కదా కల్గింది. ఆ రామయ్య ప్రక్క జానకమ్మ మధుర మంజుల కటాక్షాలు వెదజల్లుతూ ఉంటే తల్లుల మాట తలంపునకే రాదు. సౌందర్యం కలవారు ఉన్నారుకాని, మన సీతమ్మ లాగా బయటా, లోపలా సౌందర్యం గలవారు మాత్రం లేరు. ఇక లక్ష్మయ్య ఉండనే ఉన్నాడు. కోటిసూర్యుల వెలుగు కొల్లగొట్టాడు. ఆ కోపం ఆయనకు ఎంత అందమో చెప్పలేం. పడగవిప్పిన పాము చూడ డానికి ఎంత ముద్దుగా ఉంటుందో, ఆ కోపంకూడా ఆయనకు అంత ముద్దుగా ఉంటుంది. అయితే ఏం? అమృతమూర్తి. చేతికి ఎముక లేదు. అన్నకు మించిన తమ్ముడు. పరిమిత పరిధుల్లో ఉన్నప్పుడే ఇంత దయా, దాక్షిణ్య ధర్మ దానాలతో ప్రజల మెప్పు పొందిన వీరు సంపూర్ణ స్వాతంత్ర్యాధికారం పొందినతర్వాత ధరాపాలనం మూడు పూలూ, ఆరు కాయలు కాగా, ప్రజాక్షేమం పొంగి పొర్లుతుంది. భాగ్యమంటే మనదే భాగ్యం. సూర్యోదయం ఎప్పుడవుతుందో, మా రామయ్య తండ్రినీ, సీతమ్మతల్లినీ సింహాసనంమీద ఎప్పుడు చూస్తామో అని అనుకుంటూ ప్రజావాహిని ప్రభువుల ప్రాసాదంవైపు ప్రవహింప సాగింది. నగరు లోపల మంగళ తూర్యారావాలు మనోహరంగా నినదించుతున్నై.

## భిత్తి, విచ్ఛిత్తుల ప్రవేశం

ఇంద్రుని సంకల్పంతో జనించిన భిత్తి, విచ్ఛిత్తి కామరూప ధారిణులై అయోధ్యానగరం ప్రవేశించారు. ఆ పట్టణ శోభను పరప

శించారు ఆ పౌరజన సందోహంతో పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తున్న ఉత్సాహానంద ప్రవాహాన్ని చూచి మురిసిపోయారు. వారిలో వారు ఇలా మాట్లాడుకున్నారు.

ఛిత్తి : విచ్ఛిత్తీ! మనం దేవతలం కావటంచేత నగరంలో ప్రవేశించాం. కాని, ఈ పని ఇతరులకు సాధ్యంకాదు.

విచ్ఛిత్తి : అవును ఛిత్తీ! అసలే అయోధ్య. ఆపై వశిష్ఠ పర్యవేక్షణలో, భూసురులచే అధర్వమంత్రాలతో, భూతబలి, అష్టదిగ్బంధనం చేయబడింది దుష్టభావులూ, వ్యతిరేక శక్తులూ ఇందు ప్రవేశించ కుండా మంత్ర రక్షితమైంది. ఈ మంత్రాగత శక్తుల్ని మనవే కనుక నిరాఘాటంగా వచ్చాం.

ఛిత్తి: అవునవును. ఇక మనపని మనం నెరవేర్చుదాం. అదిగో గూనిది. ముసలి కొంతముచ్చులాగా, కర్రపూతతో మెల్లగా మేడమెట్లెక్కి పైకి వస్తున్నది. దాన్ని నేను ఆవేశిస్తాను. నీవు సరాసరి కైకేయి మందిరానికి పోయి, రాముని రాకకు ఆతురతతో ప్రతీక్షిస్తున్న కైకను ఆవేశించు. ఆమె మహాశక్తి సంపన్నురాలు. రాముని దర్శన స్పర్శన సల్లాపాలతో పవిత్రురాలయింది సుమా. ఈ గూని పీనుగును నేను మార్చడం క్షణం పట్టదు. నీవు మాత్రం ఆమెలో మనోనిగ్రహం ఎప్పుడు సడలుతుందో అప్పుడు ఆవేశించు. నీ ప్రవేశం జరిగితే పట్టాభిషేకం విచ్ఛిత్తి అప్పుడే జరుగుతుంది. పోదాంపద. నేనా కురూపిని కొంతసేపు లొంగించి తర్వాత నా పని ముగిస్తాను. నీవు మాత్రం జాగ్రత్త. ఆమె మనో నిర్బలత గుర్తించి ప్రవేశించు.

(ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు)

## మేడపైనుండి మంథర అయోధ్యాలంకారం చూచుట

"అబ్బా! ఏమిటి రణగొణ ధ్వని? ఏం కొంపలు మునుగుకు పోతున్నై? వీళ్ళకు పనీపాటా ఏమీ లేనట్లున్నది. ఏం పోయేకాలం వచ్చిందో. ఆ అవ్వాయి చువ్వలేమిటి? ఆ దీపాలేమిటి? ఆ తోరణాలేమిటి? ఆ పాటలూ, ఆ కైతెక్కలేమిటి? గుంపులు గుంపులుగా జనం మూగు

తున్నవి. ఎక్కడికి పోతుందో. ఎవరికీ సవమంతరం సిరి ఎత్తుకున్నదో. ఈ ముసలిముండను చెప్పేదెవరు? అసలు నే నెవరిక్కావాలి? ఎక్కడ పుట్టానో, ఎవరికి పుట్టానో, ఎలా కాశీనగరం చేరానో నాకే తెలియదు. తెలివి వచ్చేవేళకు రాజుగారింట్లో దాసీగా వున్నాను. లోకంతో పాటి దాన్నయితేగా? అందమా? చందమా? అచ్చటా? ముచ్చటా? మరుగుజ్జు దాన్ని. పైగా అష్టవంకర్ల ముండను. ఆ కైకమ్మకు అరణపు దాసీగా పంపి వాళ్ళ పీడ వదల్చుకున్నారు. ఏమాట కామాట అనుకోవాలి. చిన్నప్పటి నుంచీ ఎత్తుకుని గుండెలమీద పెంచాననే విశ్వాసం కైకమ్మకు వుంది. ఎవరి మాటైనా తోసేస్తుందేమో కాని, నా మాట మాత్రం కాదనదు. నేనేమన్నా పాపం నొచ్చుకోదు. నా నోరేమో చెడ్డది. కోపం ఎక్కువ. అసూయ జాస్తి. మా కైకమ్మ తప్ప ఎవరు పచ్చగా వున్నా నా కన్ను కుడుతుంది. ఇంత దౌర్భాగ్యురాల్ని ఎందుకు సృష్టించాడో బుద్ధిలేని బ్రహ్మదేవుడు. ఇలాంటి విపరీత జీవుల్ని సృష్టిస్తాడు కాబట్టే ఆ కుంకయ్యకు పూజాపునస్కారాలు లేకుండాపోయినై. కుమాపినైనా, నోటిపట్టిందాన్నైనా, ఎంతో ఆపేక్షతో, జాలితో దాటుగా ఎన్ని తిను బండారాలు పెడుతుందో, ఎన్ని రకాల చీరలిస్తుందో, ఆ తల్లి కడుపు చల్లంగా వుండా.

ఇంతకూ గోల క్కారణమేమిటో ఎట్లాతెలిసేది? ఎవరాపోయేది? పెద్దమ్మ దాసీదా? ఎంత గర్వం? ఏం పొగరు? ఏం విరగబాటు? ఇదంతా పట్టపురాణి దగ్గర కొలువుతో వచ్చింది. నా కండ్ల ముందర వరికిణీ కట్టిన దానికి ఎంత నాజూకు వచ్చిందో. ఒసేవ్ భద్రీ! భద్రీ! ఒకమాటు ఇలా రావే.

భద్ర: ఏమా నోటి దురుసూ? సరిగా పిలవలేవూ? నీ మోచేతి నీళ్ళం తాగటం లేదులే. మర్యాద ఇచ్చి మర్యాద పుచ్చుకోమన్నారు.

మంథర: ఔరా! ఎంతదానివయ్యావే. పెద్దముండను ఎట్లా పిలిస్తే ఏం? నీ గొప్పతనం కూలిపోయిందా?

భద్ర: నాకు తొందర పనుంది. ఎందుకో చెప్పరాదూ!

మంథర: మా రాణీ అందేనే మీకు వదను. ఆవిడ ఏం చేసిందో. ఆ పెద్దమ్మ అన్నిట్లోనూ పెద్దమ్మేగా.

భద్ర: అట్టే వాగక అదేంటో చెప్పు. లే: పోతే నే పోతున్నా.
మంథర: పోకుండా వుంటావేమిటి? ఈ అర్ధరాత్రి ఆ అరుపులేమిటి?
ఆ కాకిగోలంతా ఎందుకు జరుగుతోందో కాస్త చెపుతావేమోయని రమ్మన్నాను. నీ బంగారం దోచుకోవటానిక్కాదులే.
భద్ర: గుడ్లగూబకు సూర్యుడి వెలుగు పనికిరానట్లు నీకు ఇతరుల మేలు గిట్టదు. తల్లో మెదడుంటే తెలిసేదే. అది లేదుగా నీకు?
మంథర: పోనీలేవే. అందరి తెలివి నీకుందిగా. ఇక చెప్పు.
భద్ర: చెపితే ఏడుస్తావు.
మంథర: నేనెందుకేడుస్తానే. ఏడిపించటమే నా వంతు.
భద్ర: ఎవరేడుస్తారో చూస్తాంగా. రేపు మధ్యాహ్నం పట్టాభిషేకం.
మంథర: ఎవరికి? భరతుడు లేడుగా.
భద్ర: ఆయనకు కాదు. శ్రీరాములవారికి. అంటూ సాగిపోయింది.

ఏదో నీడ మంథరలో కలిసిపోయింది. "ఎవరికి పట్టాభిషేకం? భరతుడికి కాకుండా వెర్రి రామయ్యకు జరుగుతుందా? అందుకు నేను ఏడుస్తానా? ఎంత మాటన్నదీ? ఇది నిజంగా జరిగితేగా నేనేడ్చేది? ఇక చూడు నా తడాఖా. ఈ నగరమంతా శ్మశానంగా మారుస్తాను. ఒప్పు తెలియని ఆవేశంతో చిందులు తొక్కే ఈ ఓబయ్యల కండ్ల నీళ్ళల్లో స్నానంచేస్తా. కడుపు శోకం ఎరగని కౌసల్యమ్మకు కడుపులో మంట పెడతా. ముసలి రాజు మూరెడు గడ్డం బారెడుగా సాగదీస్తా. కడుపు చూపుతూ సవతుల్ని కైకమ్మ పాదాంపై పడేట్లుచేస్తా. మంథరా! నిన్ను చిన్న చూపు చూస్తున్న ఈ దాసీముండల్ని ముక్కుతాప్ప బోసి వీధుల్లో ఈడ్పిస్తా. నా కంఠంలో ఊపిరుండగా ఈ పట్టాభిషేకం ఎట్లా చేస్తారో నేను చూస్తా"నంటూ విసవిస మెట్లు దిగి కైకేయి వద్దకు కర్రసాయంతో పోయింది. కైకేయి రాముడింకా రాలేదేమా అని ఎదురు చూస్తూ గుమ్మంలో నిల్చుంది. ఏదో కొంప మునిగినట్లు గుండెలు బాదుకుంటూ,

## రాముని పట్టాభిషేకం సంగతి మంథర చెప్పి ఏడ్చుట

ఆదరాబాదరాగా కైక వద్దకు పోయింది. దాని రాక, వాలకం చూచి

కైకేయి: ఏమే మంథరా! పదరావే. నిదానంగా రా. అంత తొందర ఏముందీ?

మంథ: నీకు లేదు తొందర. నాకే వుంది. కడుపు మండిపోతున్నది.

కైక: ఎందుకే అంత మంట? ఈ నగరంలో నిన్ననే వాళ్ళెవరే? అందే ఇంకా వాళ్ళు బ్రతికి వున్నారంటావా?

మంథ: చాలుచాలు నీ సరసాలు. ఒకప్రక్క నుంచి కొంపలు కాలి పోతుంటే.

కైక: కాలేది నీ కొంప కాదుగా.

మంథ: నీకే కొంప లేకుండా పోతుంటే ఈ ముసలిముండకు కొంప కూడానా కాలటానికి? కాలుతున్నది నీ కొంపే.

కైక: ఛీ! నోరుమూయి. ఎంతమాట పడితే అంతమాటా అంటావు. మంచీ, చెడ్డా చూడవు. పెద్దాపిన్నా తేడా గమనించవు.

మంథ: నా ఏడుపంతా నీ కోసమే. కళ్ళల్లో పెట్టుకొని సాకిన దానికి కష్టం వస్తే కడుపు మండదూ?

కైక: ఇంతకూ విషయం చెప్పకుండా, అనవసరపు ప్రసంగం దేనికే?

మంథ: చెప్పనూ. చెప్పక తప్పుతుందా? నీసవతి కొడుకుకు రేపు పట్టాభి షేకమంట. బ.డి పోతూపోతూ అడిగితే చెప్పింది.

కైక: ఎన్నాళ్ళకు ఎంత మంచిమాట నీ నోటినుంచి వచ్చిందే. ఇంత సంతోష వార్త చెప్పినందుకు నీకు ఏమిచ్చినా ఋణం తీరదే. ఈ వజ్రాలహారం తీసుకో. నీవు కోరిన పట్టుచీరెలు తీసుకో. నీకిష్టమైన పదార్థాలు చెప్పు చేయించి నీకు విందు చేస్తా. కాదంటే, ఏదయినా చేస్తా.

మంథ: అన్నీ ఇస్తావ్. అన్నీ చేస్తావు. ఏం చేయడానికైనా నీకో స్థానం వుంటేగా?

కైక: నాస్థానానికి ఇప్పుడు వచ్చిన లోటేమిటి? మా రామయ్య రాజైతే నా స్థానం ఎవరికీ వుండదు. భరతుడు నా కొడుకనే మాట కూడా మరపించాడు మా రామయ్య. ఆ వినయం, ఆ భక్తి, ఆ ప్రేమా ఎవరికున్నది? అబ్బాయి పాలనలో ఆబాలగోపాలం ఆనందంగా సుఖిస్తుంది. ఇదుగో హారం. తీసుకో. రా. లోపలికి. ఇదిగో

తాళం చెవి. అదుగో, నా అలంకారాల మందసం. నీకిష్టమైనట్లు అలంకరించుకో. మా రామయ్య రాగానే నీ మాట చెప్పి ఇంకా బహుమతులు ఇప్పిస్తాను.

మంథ: నీ బోడి హారం ఎవరిక్కావాలి? నీ సన్మాన సత్కారాలు ఎవరిక్కావాలి? నేనేం అందమైన దాన్నా? వయసొచ్చిన దాన్నా. ముసలి ముండను నాకెందుకు? నాకు కావాల్సింది నీ ఉన్నత స్థితి. నీకొడుకు పట్టాభిషేకం. అంతేకాని, రామయ్య మంచివాడైతే పెద్దమ్మకు పెద్దరికం. నీకేం వస్తుందీ? నాకేం వస్తుందీ? ఇద్దరం తాబేదార్లమేగా?

కైక: ఎవరికి? ఎందుకు? ఇప్పటికి లేదు. ఇకముందు రాదు.

మంథ: అది తెలిస్తే నా బాధా, నా ఏడుపూ తెలిసేదే. ఇంతపని జరుగుతుంటే, లోకం అంతటికీ తెలిస్తే, నీకు నేను చెప్పేదాకా తెలియలేదంటే, నీవెవరవో, నీ స్థానం ఏమిటో తెలిసిపోయిందిగా.

కైక: అవ్యవధిగా నిర్ణయం జరిగి వుంటుంది. ఆయన కొన్నాళ్ళుగా తన జీవితంమీద నమ్మకం లేకుండా వున్నారు. ఏవేవో దుస్వప్నాలు వస్తున్నట్లూ, గ్రహచారం సరిగా లేనట్లూ చెపుతూనే వున్నారు. ఆ విషయం అమాత్యులకు చెపితే, వారి సలహా ఇచ్చి ఉండవచ్చు.

మంథ: ఇంత అమాయకురాలివి కాబట్టే ఆయన నిన్ను ఆడిస్తున్నాడు. నీవు చెప్పిందే నిజమైతే ఆ సంగతి కాకిచేత కబురంపినా పంపవచ్చు. ఆ పని అయ్యేదాకా నీ ఇంటికి రాడూ, నీకు చెప్పడు.

కైక: పోవే తెలివి తక్కువదానా! నాకెప్పుడు తెలిసినా ఒకటే. అది రామయ్య సంగతి కనుక. మరొకటైతే నేను ఎన్నడూ సహించను. నాకు భరతుడెంతో, రాముడూ అంతే. ఇక వాగక అలంకరించుకో. ప్రభువు రావచ్చు. నేను కూడా సిద్ధంగా వుంటాను.

## కైకేయిని మంథర దూషించుట

మంథ: వుండమ్మా వుండు. నేనుపోతాను. నాకెందుకొచ్చినగొడవ.

మీరంతా ఆనందించే వాళ్ళునూ, నేనేడ్చేదానినీ. ఎవరు రాజైతే నాకేం. వూరు పొమ్మంటుంది. కాడు రమ్మంటుంది. ఇన్నివేల ఏండ్లుగా, కనిపెట్టుకొని ఉన్న విశ్వాసం కొద్దీ, నీకు రాబోయే దుర్గతి తలుచుకొని ఏడుస్తున్నా కాని, నాకు వచ్చేదేముందీ? చచ్చేదేముందీ? ముసలాయనకు ముద్దుల రాణివని నీవు కులుకుతున్నావు కాని, ఆ ముద్దుముచ్చట్లు ఆయన చూపించొద్దూ? అవసరం లేని వాటికి నిన్నాలోచనకు పిలిచాడే కాని, అవసరమైనవి వచ్చినప్పుడు పెద్దమ్మేగా కావలసి వచ్చింది.

ఇది ఇప్పటికిప్పుడు అనుకున్న పనేనటే వెర్రిమొగమా? పిల్లల పెండ్లి జరిగిన నాటినుంచీ రహస్యంగా సాగుతూనే వుంది. మీ అన్నయ్య అబ్బాయిని పంపమందే గుట్టు చప్పుడు కాకుండా పంపటంలోనే ముసలాయన ముందాలోచన ఉంది. అది క్రమంగా సాగి, ఇప్పుడు పాపం బద్దలైంది. రేపు మధ్యాహ్నం నుంచీ నీవు పెద్దమ్మకు ఊడిగం చేయక తప్పదు. పెద్దకొడుకంటే ప్రాణాలు వదిలే ఈ ముసలాయన ఇక రాత్రింబగళ్లూ ఆమె ఇంట్లోనే కాపురం.

అప్పుడు నీ మొగం నా మొగం చూసేదెవరు? ఏ మంత్రులొచ్చినా, సామంతులొచ్చినా, రాజమాతకు నజరానాలు పంపుతారు. ఆమెకు వంగివంగి దండాలు పెడతారు. పేరు మోసిన కైకమ్మ పట్టిపెద్దమ్మకింద జమకట్టబడుతుంది. నా బొందిలో ప్రాణముండగా ఇది చూచి సహించలేను. నన్ను తిట్టినా సరే. వెళ్ళగొట్టినా సరే. ఉపయోగం తెలియని దాని వూడిగం బుద్ధి తక్కువగా చేసినందుకు నెత్తి నోరు బాదుకుంటూ పోతాను. ఈ దిక్కులేని ముండ వుంటే ఎంత? పోయితే ఎంత?

కైక: మనస్తాపం కలిగే మాటలు మానుకో. రామయ్యను గురించి నీకేమీ తెలియదు. తల్లిదండ్రులమాట కాదనగలమోకాని, కైకేయి మాట కాదనడు: సరికదా ఆ మాట చెల్లించి తీరుతాడు. కౌసల్యకన్నది. కైక పెంచి పెద్దచేసింది. నీకు తెలియనిదేముందే. సీతను వదలి ఎన్నిరాత్రులు నా ఇంట్లోతిని పడు కున్నాడో. తమ్ముని తలవని

రోజే లేదు. వాళ్ళవార్తలు రాక ఆలస్యమైతే తన ఆప్తమిత్రుల్ని పంపుతాడు. సంగతి తెలిసేవరకూ కలవరపడుతూనే వుంటాడు. శస్త్రాస్త్రవిద్యలు ముందు నా దగ్గరే నేర్చుకున్నాడు. తల్లినిగా కాక గురుభావంతో నమస్కరించి విల్లుపట్టేవాడు. ఒక్కొక్కప్పుడు నేను కోపగించినా, ఎంతో నిగ్రహం చూపేవాడు. అటువంటి నా ఆనంద రామయ్యకు పట్టాభిషేకం జరుగుతుంటే నాకు గాక మరెవరికి సంతోషం?

మంథ: ఆహా! ఇక ఆపు. నీ స్తోత్రపాఠాలువిని ఇవ్వటానికి నాకే ముంది? ఆ రామయ్య వచ్చింతర్వాత భజనచేయి. ఏమైనా ఇస్తాడు. ఇంత వరకు సవతి కొడుకు పట్టాభిషేకానికే ఏడుస్తున్నా. ఇక నీ అమాయకత్వానికీ, అబలత్వానికీ, అప్రయోజకత్వానికీ కూడా ఏడుస్తా. నీవేమో రాజకీయంగా తెలివిగలదానవనుకున్నా. ఇంత అజ్ఞురాలవనుకోలేదు.

కైక: ఇంతకూ నాకిందులో దోషంకానీ, మోసంకానీ, కనుపించటం లేదు. ఎక్కడైనా, ఏ కాలంలోనైనా పెద్దవాడికి రాజ్యాధికారం సంక్రమిస్తుంది: కాని, చిన్నవాళ్ళకు సంక్రమించినట్లు రాజ చరిత్రల్లో ఎక్కడైనా చూశావా? లేక విన్నావా? పెద్దవాడేకాక, గుణవంతుడూ, సర్వగుణసంపన్నుడూ అయిన వాణ్ణివిడిచి, నిష్కారణంగా నాకొడుక్కు రాజ్యం ఇవ్వమంటే నలుగురిలో అవమానం, అపహాస్యం కూడా జరుగదా?

మంథ: ఎవరా నలుగురూ? ఈ మందికి పనా? పాటా? అడిగేవానివి నీవు. ఇచ్చేవాడుప్రభువు.ఏలేవాడుభరతుడుభరతుడురామయ్యకుఎంతలో తీసిపోతాడో చెప్పు. అధికారం రాగానే అందరినోళ్ళు నొక్కుకుపోతాయి. ఆయనే దేవుడంటూ ప్రదక్షిణాలు చేస్తారు. పాదాలవద్ద పడి గాపులు పడతారు. పేరుకు ప్రజాస్వామ్యంగాని ఆచరణలో అది కనపడదు. నీ రాముడెంత గుణవంతుడో, రాజ్యం భరతునికి ఇస్తాడన్నసంగతి తెలిసిన వెంటనే, నీకూ తెలుస్తుంది. వట్టివాజమ్మ మాటలు దేనికి? అడిగిచూడు. రాజేమంటాడో, రామయ్య ఏమంటాడో.

కైక: అడగటానికి అవకాశం ఏదీ? కారణం లేకుండా అడిగి పూరూ నాగా అపనిందతో నింపమంటావా?

మంథ: అట్లా అడుగూ అంటూ కర్రనేలకేసి కొట్టింది. ఆ శబ్దంలో నుంచి విచ్చిత్తి కైక కర్ణాలల్లో దూరింది.

కైక: అయితే ఇప్పుడేమంటావే?

మంథ: మళ్ళీ మొదటికొచ్చావు. భర్తను భరతునికి రాజ్యం ఇవ్వమని అడుగు. ఆయన వచ్చే వేళయింది. లోకంకోసమైనా నీతో చెప్పటానికి వస్తాడు.

కైక: నీవు కొంతసేపు కిందికిపో. నేను పిలిచినప్పుడురా.

మంథర వణుకుతల పూపుకుంటూ క్రిందికిపోయింది. కైక లోపలికి పోయి ఆసనంపై చేరబడి ఆలోచించసాగింది.

"రాముడికి పట్టాభిషేకమా? అది రేపు మధ్యాహ్నమా? ఆ సంగతి రాజు నాకు ఇంతవరకూ చెప్పడా? భరతశత్రుఘ్నులు లేరా? నలుగురిలో ఇద్దరు కొడుకులు లేకుండా ఇంత కార్యం చేయటమా? మంథర అన్న మాటల్లో కొంత నిజం లేకపోలేదు. ఇప్పుడే ఈ విధంగా చేస్తే, ఆ పని పూర్తి అయింతర్వాత కౌసల్యమాటకు తిరుగు వుంటుందా? రాజిక నా మాటల్లో వుంటాడా? కారణం లేకుండా కయ్యానికి దిగితే అందరూ ఆడిపోసుకోరా? అసలు ఈ పని చేయతగిందేనా? విరోధులకే చెడు తలపెట్టమే. ఇంక హితులకూ, అందులో ఆత్మీయులకు తలపెట్టటం సబబేనా? కన్నతల్లికంటే మమకారంతో, కళ్ళల్లో పెంచినవాడికి కష్టం కలిగించటం మంచి పనేనా? గొప్పకాలుకూడా ఈ పని చేయదే. ఉన్నత వంశంలో పుట్టి, పవిత్రమైన, యశోభరితమైన వంశంలో మెట్టి రాజులందరిలోనూ పేరుగాంచిన నేనీ పనిచేయలేను. నావల్లకాదు.

ఓ పిచ్చి కైకేయీ! నీవు ఎందమావుల్లో నీళ్ళున్నవని భ్రమిస్తున్నావు. చవిటినేలలో సస్యం పండించాలని సంకల్పించావు. ఎంత మంచివాడయినా రాముడు నీ సవతి కొడుకు. అతడు నీపట్ల వినయంగా, అపసవ్యంగా ప్రవర్తించకపోవచ్చు. అదివ ఎంతకు ఊరుకుంటుంది? ఇన్నివేల యేండ్లు కలసి కాపురం చేస్తున్నా, నీ ఇంటికి ఎన్నడైనా వచ్చిందా? ఆ సుమిత్ర ఏమో, ఆమె యేమో. అవకాశం

జారవిడుచుకుని ఆపైన ఆక్రోశిస్తే ప్రయోజనం ఏముంటుంది? నీరు పోయిన చెరువుకు కట్ట మరమ్మత్తు చేసినట్లే, ఇప్పుడే జాగ్రత్తపడు. నీ కొడుకు రాజైతే నీవు రాజమాతవు. రాజమర్యాదలన్నీ నీకే జరుగుతై. రాజు నిన్నాశ్రయించుకుని వుంటాడు. నీకు తోచకపోతే నీ మేలు కోరే మంథరనడుగు. అది నీవు చేయదగిన పని చెపుతుంది. నీకూ తెలుసు. అది ఎంత విశ్వాసపాత్రురాలో, ఎంత ముపకారంకలదో. లేనిపోని అనుమానాలతో అవకాశం జారవిడుచుకోకు. పిలువు దానిని. అడుగుదాన్ని."

అంతర్యుద్ధం ముగిసింది. ఒక్కసారి లేచి ఒళ్ళు విరుచుకుని, బిట్టుగా నిట్టూర్చి, గుమ్మంవద్దకు వచ్చి గట్టిగా, "మంథరా! మంథరా!" అని పిలిచింది. తొందరతొందరగా మంథర వచ్చింది. కైక ప్రసన్నంగా వున్నట్లు దాసి గుర్తించింది

కైక: నీ మనసులో ఏదో వుంది. దాన్ని దాచకుండా వున్నదంతాచెప్పు.

## మంథర కైకకు దుర్బోధ చేయుట

మంథ: ఒకటేవుంది. అది భరతుడు రాజు గావడం, నీవు రాజమాతవు కావటం. పూర్వంలాగే నీవు రాజ్యపాలనాచక్రం తిప్పటం.

కైక: అదిసరే. అందుకు మార్గం కావాలి. ఆ మార్గం లోకానికి ధర్మ దూరం కాకుండా వుండాలి

మంథ: ధర్మాధర్మాలుచూస్తే ముందుకు అడుగు పడుతుందే పిచ్చిదానా? అట్లాచూస్తే, సమాజానికి ఒక ధర్మం, రాజులకొక ధర్మం వుంటుందా? ఒక తండ్రికి నలుగురు బిడ్డలుంటే నలుగురికీ సమానంగా ఆస్తి సంక్రమిస్తుంటే, రాజ్యం ఒకడికే ఎందుకు చెందాలి?

కైక: అది సృష్టి ప్రారంభంనుంచీ వస్తున్న సంప్రదాయం. ఇప్పుడు కాదంటే పోతుందా? ఆనాడు ప్రజాపతులు చేసిన నిర్ణయం. ఆస్తిలాగా రాజ్యం పంచితే నిరంతరం ఘర్షణతప్పదు. సోదరులు ముఖ్యస్థానాల్లోనే వుంటారు. అందువల్ల అన్యోన్యత చెదకుండా వుంటుంది.

మంథ: ఐతే నీ కొడుక్కు రాజ్యం ఎన్నటికీ రాదుగా. జన్మకాలాన్ని బట్టి చూస్తే, రాముడూ, లక్ష్మణుడూ, భరతుడూ, శత్రుఘ్నుడూను. రాముడి తర్వాత, లక్ష్మయ్యకు వస్తుంది. రామయ్యకు సంతువుంటే వాళ్ళకుపోతుంది. మరి నీ బిడ్డకు ఎప్పుడువస్తుందీ? బ్రతికినన్నాళ్ళు తెలివితో సుఖం, ఐశ్వర్యం, రాజ్యం, ఒకటేంటి? అన్నీ సంపాదించుకోవాలి. శ్రీరంగనీతులు వల్లిస్తూ కూచుంటే, సవతి నెత్తెక్కి కూచుంటే, ఇది ఏం పీడరా అని నీవు ఏడుస్తుంటే, అదంతా నేను చూస్తూ గుడ్లప్పగించి వుండే-

కైక: ఇదేమిటే? కౌసల్యకు పూడిగం చేస్తానా? అంతవరకువస్తే, నాతండ్రి ఇచ్చిన ఐశ్వర్యంతో నేను ప్రత్యేకంగా బ్రతుకుతాను.

మంథ: ధర్మాలూ, లోకులూ అని ఇందాక మొత్తుకున్నావే. మొగుణ్ణి వదిలిపెట్టి వేరుగా వుండటం సంప్రదాయం కాదుగా మరి. నీవన్నంత ప్రేమపాత్రుడు రామయ్య ఐతే భరతుణ్ణి మామ ఇంటికి పంపేటప్పుడు వద్దనకపోయాడా? పోనీ, ఇన్నాళ్ళయినా రమ్మని కబురు పెట్టాడా? రామయ్య అంటే ఈ ముసలిమామయ్య కాదంటాడా? ఇది ఇద్దరూ అనుకొని చేసిందే. వట్టి వాజమ్మలంతా వచ్చి చూస్తుంటే, కన్నకొడుకులు లేరని ముసలాయనగాని, తమ్ములు లేరని అన్నయ్యగానీ అనుకున్నారా? అదే లక్ష్మణుడైతే!

కైక: నీవన్న దానిలో కొంత యుక్తి వుంది గాని, నాకూ, నా బిడ్డకూ అపకారం కనపడటం లేదు.

మంథ: ఇప్పుడు కనబడదు. రోజులు గడిచిన కొద్దీ, నీకు భరణం, నీ కొడుక్కు దేశ బహిష్కారం జరిగి తీరుతుంది.

కైక: అలా జరగటానికి వీల్లేదు.

మంథ: అందుకు నీవు చేసిన ఘనకార్యం ఏదీ?

కైక: ఏం చేయమంటావో చెప్పు.

మంథ: వెనక నాకు నీవే చెప్పావు. ఇప్పుడు మరిచిపోయిందా? ముసలి ముండచేత చెప్పించాలని అనుకున్నావా?

కైక: నేనే నీకు చెప్పానా? కొంచెమైనా గుర్తు లేదే?

మంథ: చెపుతాను విను. పూర్వం శంబరుడనే రాక్షసుడితో ఇంద్రుడికి యుద్ధం వస్తే ఇంద్రుడివైపు పోరుకు మీరిద్దరు వెళ్ళారా? లేదా?

కైక: అవునే. వెళ్ళాం. ఎన్నివేల సంవత్సరాల మాట. దానికీ, ఇప్పటి దీనికీ సంబంధం ఏముందీ?

మంథ: ఉంది కనుకనే ఎత్తుతున్నాను. ఆ యుద్ధంలో నీ మగడు మూర్ఛ పోతే, నీవు రథం దూరంగా తోలుకుని పోయావా? లేదా?

కైక: కొంత కొంత జ్ఞప్తికి వస్తూంది. నిజమే. అప్పుడు ఆయన నన్నెంతో మెచ్చుకున్నాడు కూడ.

మంథ: వట్టినే మెచ్చుకోలేదు. నిన్ను రెండు వరాలు కోరుకొమ్మన్నాడు.

కైక: అదీ సత్యమే.

మంథ: మరి నీవు కోరుకున్నావా?

కైక: లేదు. ఇంతవరకూ ఆ అవసరం కూడా రాలేదు.

మంథ: అదీ మాట. ఇప్పుడొచ్చిందిగా. రాజురాగానే ఆ రెండు వరాలూ కోరు. ఎట్లా కాదంటాడో చూద్దాం. ఇక్ష్వాకులు ఆడి బొంకరని ముసలాయన మీసాలు దువ్వుతూ అంటుంటాడుగా. ఆ సత్య పాలనం ఏమిటో ఇప్పుడు తేలుతుంది.

కైక: అడుగుతాను. ఆచరింప చేస్తాను.

మంథ: నీకు రెండు వరాలిచ్చాడు. ఆ రెండూ సార్థకం చేసుకో. ఒకటి భరతునికి పట్టాభిషేకం, రెండోది రాముని వనవాసం. అదీ పద్నాలుగేండ్లు. తెలిసిందా? ఒక దాని కొకటి బలం కలిగిస్తుంది.

కైక: భరతునికి పట్టాభిషేకం వాంఛనీయంగాని, రామవనవాసం ఎందుకు?

మంథ: ఎందుకా? చెప్పాగా. భరతుడు రాజైతే, బలవంతుడైన రామయ్య వూరుకుంటాడా? పామును పక్కలో పుంచుకొని పడుకుండే మూర్ఖులెవరుంటారు? చెప్పులో రాయీ, చెవిలో జోరీగా, కంటిలో నలుసూ, కాల్లో ముల్లూ, ఇంటిలో పోరూ పగవాడికూడా పనికి రాదు.

కైక: సరేకాని, పద్నాలుగేండ్లు బాధించటం ఎందుకు? రాజ్యభ్రష్టుడైన వాడు చేసేదేముందీ? ఏదో నా చేతుల్తో పెంచాను. నాల్గయిదేండ్లు బయట వుంటే, భరతుడు బలపడతాడు. ప్రజంతా లోబడుతుంది.

మంథ: ఆ మాత్రం తెలియకనే అన్నానటే. కృతయుగంలో, సమాజ ధర్మం ప్రకారం, మానవునకు హక్కు పదహారేండ్లు దాటితే ఆ ఆస్తిపైన వస్తుంది. ఇది త్రేత కదా? ఇందులో రెండేళ్ళు తగ్గించారు. అంటే అనుభవంలో పధ్నాలుగేండ్లు లేకపోతే అతనికి హక్కు పోతుంది. అందువల్ల నీ కొడుక్కు వంశపారంపర్యంగా అధికారం, హక్కు లభిస్తుంది. వెర్రి ఆలోచనలు చేయకుండా కార్యసాధనానికి కంకణం కట్టుకో.

కైక: సెబాస్ మంథరా! సెబాస్. ఈ తెలివి నీ తల్లో లేదే. ఆ గూనిలో వుంది.

మంథ: చాల్లే సరసం. ఈ ఆకారంతో పని సాధించలేవు. కోపగృహం లోకి ప్రవేశించు. ముసలాయన్ని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించు. నిరుత్తరుణ్ణి చేయి. నీవే కార్యం చక్క బెట్టుకో. నే పోతున్నా.

కైక: చూస్తావుగా నా శక్తి, నా ప్రయోగదక్షతా! నీవు చెప్పిన తెంపూ నిర్విఘ్నంగా నెరవేస్తాను. ప్రళయం సృష్టిస్తాను. రామాభిషేక సంభారం భరతుని అభిషేకానికి మారుస్తాను. ఈ పనివల్ల యుగాంతరాలదాకా మాయని మచ్చనాకు రానీ, ఆబాలవృద్ధం నోటికి వచ్చినట్లు ప్రేలనీ, నేను లెక్కచేయను. గోటితో కాగల పనికి గొడ్డలి వుపయోగించిన రాజు పశ్చాత్తాపం పడినా నేను లొంగను. ఈ అవమానానికి ప్రతీకారంచేసి తీరుతాను. నా సవతిని నేలబెట్టి కాల రాస్తాను. ఈ విఘ్నానికి తెలివిలేని మానవులు నన్ను దూషిస్తే, తెలివిగల దేవతలు మెచ్చుకుంటారు. నా శీలంతోపాటు వృద్ధిపొందిన ఆత్మశక్తిని, లోక కల్యాణం కోసం త్యాగంచేస్తాను. అడవిలో వున్నా, అయోధ్యలోవున్నా రాముడు సకల లోకాభిరాముడే. అతడు పుత్రులలోకల్లా మేలుబంతి. అడవికిపోయి అక్కడ మంచి కార్యాలుచేస్తే, దానివల్ల లోకం సంతోషిస్తే, దానికి కారణం నేనే అవుతాను. నాకు రామయ్యపై ద్వేషంకానీ, అసూయగానీ లేదు. నమ్మించి ద్రోహం తలపెట్టిన రాజుపైనే.

ఆయన ఇంతకాలం మనస్సులో దాచుకున్న ఈ రహస్యాలోచన విచ్ఛిత్తి అయితీరాలి. మంథరా! నా కంటికి నీవు జగదేక సుందరివిగా కనబడుతున్నావు. అందుకు కారణం నీలో అతిలోకమైన తెలివీ, సమయస్ఫూర్తి, నా మీదా, నా బిడ్డమీదా వున్న అభిమానం, అనురాగం. నాలో లేని క్రౌర్యం, కఠినతా, ఇప్పుడు అప్పుతెచ్చుకుంటాను. అభినయిస్తాను. జయం సాధిస్తాను. ఇదే నా శపథం. భరత పట్టాభిషేకమూ, రామ వనవాసమన్నా జరగాలి, లేదా నా శవానికి అంత్యక్రియలైనా జరగాలి. పోవే. సంతోషంగా పో. నీ కోరిక తీరుస్తాను.

## కైక కోపగృహంలోనికి పోవుట

అంటూ తోకతొక్కిన భుజంగిలాగా లేచి, నిట్టూర్పులకు వున్నత వక్షస్థలం క్రిందుమీదుకాగా, విచ్చిన మల్లెపూవుపై వ్రాలిన తుమ్మెదలాగా మనోహరంగావున్న కన్నులు, మందారంపై వ్రాలిన సీతాకోక చిలుకలాగా మిశ్రమారుణ కాంతి నిండగా, చక్కగా దువ్వి ముడివిన వేణీభరం, తల విసురునకు సడలి జారి, నగయుగళ మధ్యంలో నడిచే యమునా నదిపలె పిరుదులు దాటుకుంటగా, కంగులువీచ్చి సవరించి ఎడమ భుజంపై నుంచి వెనుకకు వేసిన పైట చెరగు పర్వతాల నతిక్రమిస్తున్న శరత్కాలమేఘంలాగా వక్షోజాలను అతిక్రమించుచుండగా, గాలికి కంపించే ఏలకితీగ చందాన సుకుమార లావణ్యశరీరం ఆపాదమస్తకం సంచలిస్తూవుండగా, లేతతమలపాకులకంటే మృదువుగా, స్నిగ్ధంగా వున్న చెక్కిళ్ళు కుంకుమవర్ణం దాల్చగా, నిర్మల నిశ్శబ్దంగావున్న సరోవరం లాంటి మనస్సు తుఫాను సమయంలో క్షుభితమవుతున్న సముద్రంకాగా, మాటిమాటికీ అధరం కంపిస్తుండగా, ఇంద్రజాలికుని మంత్రదండ స్పర్శతో తాడు పామైనట్లు మంథర మాటలతో మనసు మారిన కైక, దుర్నిరీక్ష్యయై మహిషాసుర సంహారంనాటి చండికలాగా కోపగృహం ప్రవేశిస్తూ, మెడలోని ముత్యాల సరాలు, వజ్రాల హారాలు త్రెంచి నలుమూలలా చిమ్మి సిగలోని పువ్వులు తీసి వెదజల్లి, నల్లని చీరగట్టి, కటికనేలపై కావ్ళ

ముడించి పడుకున్నది. ఆ ప్రదేశమంతా, నక్షత్రాలతో నిండిన ఆకాశాన్ని భూదేవి హసిస్తున్నట్లుంది.

## రాజు అభిషేకవార్త తెలుప కైక మందిరానికి పోవుట

వృద్ధరాజు, రామాభిషేకం నిమిత్తమగు కార్యాలు నిర్ణయించి తెలిపి, వశిష్ఠుల ఆజ్ఞగొని, శుభవార్త కైకేయికి తెలుపుటకు హుటాహుటి వచ్చి రాహుచ్ఛాయలో చొచ్చు చంద్రునివలె కైకమందిరంలో కాలుపెట్టి దిగ్భ్రాంతి పొందాడు. చిత్రవిచిత్ర కుసుమ లతాపరివ్యాప్త సుందరమూ, శుకశారికా కేకీకలహంస కారండవ మృదుల స్వానసుఖరితమూ, ఫలవృక్ష సమాకీర్ణ సుశోభితమూ, కృతకవిహార పర్వత సరోవర లసితటాక పరినిష్ఠితమూ, విభాజ్యమానసుస్నిగ్ధ విభిన్నమార్గ విరాజితమూ, నిజ సౌందర్య నిర్జిత నందనమూ, రత్నస్థగిత హేమకుట్టిమ సమలంకృతమూ ఐన ఉద్యాన మధ్యంలో, సమున్నతమైన అంతర్భాగాలతో, చిత్రకార మధురభావ సంజాత లిఖితంపైన నానావిధ చిత్రాకర్షణ సమర్థంబులగు పటాలంకృత కుడ్యంబులతో, రత్నహార పుష్పదామ నిబంధిత ద్వారబంధాగ్ర భాగాలతో, బహువర్ణ విభాసి కంబళ పరివ్యాప్త మధ్యప్రదేశాలతో, యాతాయాత మంత్రి సామంత పౌరజన సమావిష్టసంబంధ బహుసంఖ్యా వేదికలతో, అగురు సాంద్రాణి గుగ్గిలాది పరిమళ ద్రవ్య ధూపంబులతో సౌందర్య శృంగారభాసుంగా వెలిగే కైకేయి మందిరం, నీరసంగా, నిశ్శబ్దంగా, నిర్లక్ష్యంగా, నిస్తేజంగా వుంది. ఆలనా లేదు, పాలనా లేదు. ఆహ్వానం లేదు, విసర్జనా లేదు. రత్నదీపికలతో ధగధగ ప్రకాశించే గదులన్నీ శూన్యంగా తమోవృతమై వున్నవి. పరిచారికల జాడకాని, భార్య జాడకాని కనుపించలేదు. ఈ అనూహ్య సంఘటనకు ముసలిరాజు మతి పోయింది. విసుగుతో బిగ్గరగా "ఎవరక్కడ?" అని పిలిచాడు. పరుగున ఏ మూలనుంచో ఒక దాసి వచ్చి "ప్రభూ! ఏమి సెలవు" అని అడిగింది.

దశ: అమ్మగారెక్కడ?

దాసి: లోపల వున్నారు.

దశ: ఏ లోపల?

దాసి: కోప గృహంలో.

అంత గాంభీర్యం గల రాజుకు గుండెలో బెదర పట్టింది. "కోప గృహంలో ఎందుకు ప్రవేశించింది? కారణం ఏమీ కనబడదే. ఇంత దీర్ఘకాల సంబంధంలో ఎప్పుడూ ఈ వింత ఘటన కలుగలేదే?" అని క్షణం ఆలోచించి, "దాసీ! అమ్మగారివద్దకు దారి చూపు" అన్నాడు. దాసి అమ్మ ఉన్నగది చూపి వెళ్ళిపోయింది. గదంతా చీకటి కొట్టులాగా ఉంది. ఏది ఎక్కడ ఉన్నదో కనుపించుటలేదు. గదిలో ఒకమూల నామమాత్రంగా ఉన్న దీపం పెద్దచేశాడు. అలవాటు చొప్పున ఆ దీపం ఆధారంగా మరికొన్ని వెలిగించాడు. ఆ వెలుగులో మెల్లగా హంస తూలికా తల్పం చేరుకున్నాడు. అక్కడ ఆత్మేశ్వరిలేదు. తల దిమ్ముతో, గుండె బరువుతో ఇష్టంలేనితనాన్ని స్పష్టం నోటితో చేయక, దానికి సంకేతంగా రాణులు ఏర్పాటు చేసుకున్న నామమాత్రపు కోపగృహం సమీపించాడు. గుండె ఆగినంత పనైంది. ఏం అనిష్టం వింటానో, ఏం చేయరాని పని చేయాలో అన్న భయం శరీరమంతా వ్యాపించింది.

"తన ధర్మపాలనకూ, తన దృఢతనుయష్టికీ, తన ఆకార మనోహరతకూ, తన అవక్రవిక్రమ పరాక్రమానికీ మెచ్చి, తల్లిదండ్రులు సంకోచించినా వయోభేదం చూడకుండా వరించి వివాహం చేసుకున్నది. ఆనాటినుంచీ నేటిదాకా, రూపభేదమే కాని, ఆత్మభేదం లేకుండా ఆనంద సాగరంలో విహరింప చేసింది. నా రాక క్షణం అతిక్రమిస్తే నిలదీసి కారణం కనుగొనేదాకా విశ్రమించని కాంత ఈనాడు నిర్నిమిత్తంగా కోపం ఎందుకు తెచ్చుకుంది? ఇందుకు ఏదో బలమైన కారణం వుండి వుండాలి. అది నా పరాకైనా కావాలి. లేదా? అవజ్ఞత అయినా కావాలి. ఏది ఏమైనా ఆమెను సంతోషపరచాలి. ఇప్పటికే కాలం గడిచింది. రామ పట్టాభిషేకం శుభవార్త చెప్పి-ఎందుకో ఎడమకన్ను అదిరింది. మనస్సు సంశయగ్రస్తమవుతూంది. ఇది అంతా నా గ్రహచారం బాగుండని కారణంచేతనే కలుగుతున్నది.

రామ పట్టాభిషేక భావం రాగానే అశుభ సూచకంగా వామనేత్రం స్పందించింది. ఆ శుభవార్త గొనివస్తే కైక కోపగృహంలో చేరింది. ఏం కానున్నదో ఎరుగరాకుండా వుంది. ఇప్పటి నా హృదయం వలె

హాస్యంగా వున్న ఈ గదిలో ఎలా ప్రవేశించను? పోకా, చెప్పకా, రేపు పట్టాభిషేకం ఎలా చేస్తాను? భరత శత్రుఘ్నులూ, జనక యుధాజిత్తులూ లేక, కైకేయి రాక, ఈ కార్యం చేస్తే ఎంత జనఘోష? ఎంత అప్రతిష్ఠ? అంతా ఈశ్వరేచ్ఛ. ఏం జరిగితే అదే అవుతుంది" అని అనుకుంటూ, లోపలికి ప్రవేశించాడు. అంతా అంధకారబంధురం. ఎక్కడ ఉన్నదో, ఎలా వుందో తెలియటం కష్టంగా వుంది. కొంచెం గట్టిగా "దేవీ! దేవీ!" అని పిలిచాడు. సమాధానం రాలేదు. వెనుకకు వచ్చి దీపం తీసుకుని మళ్ళీ వెళ్ళాడు. త్రెంచివేసిన తీగలాగా, నరికివైచిన అరటిలాగా నేలపై నల్లని గుడ్డ కప్పుకొని పడుండినభార్యనుచూచి నిలువునాసీరై ఆతురతతో సమీపించి, వ్యాధవిద్ధ శరావిద్ధమైన హరిణిని తాకినరీతి తాకి, నిట్టూర్పు సెగలతో వేడెక్కిన ముసుగు ప్రక్కకుతీసి, తనతొడపై తలనుంచుకొని-

## రాజు కైకేయి పరితాపానికి కారణం అడుగుట

"దేవీ! ఇన్నివేల యేండ్లుగ నన్ను పరీక్షించవలెనా? అందులో ఇంత తీవ్రంగానూ, దీక్షణంగానూనా? లేక ఎవరైనా నీ యాజ్ఞ తిరస్కరించారా? నిన్ను అవమానం చేశారా? లేకపోతే నా వల్ల లోపమేమైనా వుందా? రాణీ! నిన్నీ స్థితిలో నేను చూడలేను. లే. లేచి ఈ వృద్ధుణ్ణి ఆదరించు. ఆదరించి అనుగ్రహించు. నీకు కలిగిన ఆగ్రహానికి కారణం చెప్పు. అది నేరమైతే శిక్షిస్తాను. కోరిక అయితే తీరుస్తాను. ఎన్నడైనా మాట తప్పానా? నీ మాటకు అన్యథా ప్రవర్తించానా? నా మనస్సు క్షోభిస్తున్నది. నాలుగు రోజులుగా రానందుకైతే క్షమించు.

పనుల తొందరలో రాలేదు. అంతకంటే వేరే కారణం లేదు. నీకై చేయజాలని పనిలేదు. నా సర్వస్వం నీవే కదా? నీవు కోరింది ఎన్నడు కాదన్నాను. నన్నడిగి ఎన్నడు నీవు హతాశవైనావు. పేరుకు కౌసల్య పెద్దరాణి కాని, నిజంగా నీవే మహారాణివిగా వున్నది ఎరుగలేదా? ఎందుకీ ఆగ్రహం? ఎందుకీ పరితాపం? లే రాణీ! లేచి నీ అనురాగపాత్రుని కనికరించు. ముందు చేయవలసిన కార్యం చాలా వుంది. చెప్పవలసిన విషయమూ

[illegible] ఉన్నాయి. ఈ విశ్వం నాట్లు తెగనుగా నీ కోరికను ఎదురునిర్చే శక్తియే లేదు. నా మాట నమ్ము."

అంటూ వృద్ధభూపతి కాటువేయనున్న పామును కౌగిలించుకున్నట్లు ఆగ్రహోదగ్రురాలై, అపకార వాంఛా దూషితయై, అతి కాముకుడై, అంధుడైన భర్తను వంచింపనున్న పడతిని ఆలింగనం చేసుకుని, అలకలు దువ్వుతూ, "అలివేణీ! ఎందుకు ఇంతభీభత్స దృశ్యం సృష్టించావో చెప్పు. చెప్పకుంటే నా మీద ఒట్టు" అన్నాడు. ఆ మాట కొంత సాకుగా తీసుకుని, "తెగించాకా లాగరా" అన్న లోకోక్తి గుర్తుకు తెచ్చుకుని, "మధుతిష్ఠతి వాచి యోషితాం, హృది హాలాహలమేవ కేవలం" అన్న రీతిని, తన కటాక్షవీక్షణ ప్రసారానికి చంద్రోదయానికి జక్కవలాగా ఎదురుచూస్తున్న ముసలిరాజు మొగంలో మొగం చేర్చి,

"నాథా! నీవు తలంచినట్లు నా కెవరూ అవమానం చేయలేదు. నాకు శరీరారోగ్యం చెడలేదు. నాకు లౌకికమైన కోరికయూ లేదు. నీవు నాకు చెప్పకుండా చేస్తున్న రాచకార్యాలన్నీ తెలుసు. ఇప్పుడు ఎందుకు ఇక్కడికి వచ్చావో నెనెరుగుదును. పూర్వం రాజువుగావనీ, ఆ అనురాగం వక్రమార్గం పట్టిందనీ, అది ఆత్మీయులనే వంచించే స్థితికి వచ్చిందనీ, ఈ మెరమెచ్చులన్నీ నీ కార్యసాధనం చేసుకొనుటకేననీ, ఎప్పుడో గుర్తించాను. అమాయకురాలినై అన్నదంతా వినుకున్నాను. వినిపించినదంతా విశ్వసించాను. ఇక ముందేమి జరుగుతుందో యోచించాను. తాళికట్టినవాడవనీ, కలకాలం కాపురం చేశామనీ గౌరవంతో ఈ మాత్రమైనా మాట్లాడకపోతే మర్యాదకాదనీ, మాట్లాడుతున్నాను. కానీ, నిన్ను విశ్వసించి మాట్లాడటం లేదు. నీవు చెప్పటం, నేను వినటం గతకాలం సంగతి. ఇక నీవు చెప్పవద్దు, నే వినవద్దు. నన్నింత వంచించి నీవు నాకోరిక తీరుస్తావా? తీర్చేవాడవైతే ముందే చెప్పేవాడివి. అంతా పూర్తిచేసి, ఆఖరు ఘడియల్లో నాకు చెపితే ఎంతా? చెప్పకుంటే ఎంతా? నీ విక్కడకు వస్తావనీ, అదీ లోకం కోసమేననీ, ఈ తంతు జరుగుతుందనీ ముందే తెలుసు. కనుకనే నా కర్మకు నేను విచారిస్తున్నాను. ఈ స్థితిలో నేను కోరితే నీవు తీరుస్తావనే నమ్మకం పోయింది. అడిగి వ్యర్థవాదాలను కావడమంటే నా ఆత్మాభిమానం

దెబ్బతింటమే. ఇదివరకే హస్తాఘాతమైంది. ఇప్పుడు అడిగి కశాఘాతం పొందమంటావా? నీవు చెప్పదలచుకున్నది రామునిపట్టాభిషేకం అనేగా?"

## రాజు రామచంద్రునిపై ప్రమాణం చేయుట

"దేవీ! ఈ లోకంలో నాకు రెండే ప్రేమస్థానాలు. మొదటిది నీవు. రెండవది రాముడు. ఏ రాముని విడిచిఉండలేక గాథేయుని కఠోర వాక్యాలకు గురి అయినానో, ఏ రాముని చూడక నేను జీవించలేనో, ఏ రాముని గుణాలు సంస్మరించక దైవమందిరం ప్రవేశించలేనో, ఏ రాముని చూడని క్షణం నా నేత్రాలు అంధకార బంధురాలౌతాయో, ఏ రాముని వాక్యాలు అమృతప్రాయంగా ఆప్యాయత పరుస్తాయో, ఆ రాముని సాక్షిగా నీవు కోరిన కోర్కెలు తీరుస్తానని బాసచేస్తున్నాను ఇంక నీ అలకమాని ఆనందంతో ఆడుగు" మంటూ కైకేయిని తన వామహస్తంపైకి వ్రాల్చి, కంటి నీరు తుడుస్తూ, చెక్కిలు పుణుకుతూ, తాంబూల సుందరమైన కొన్ని కన్నీటి బిందువులు వక్షస్థలంపై రాలగా మెల్లగా శయనగృహానికి చేర్చాడు. అలంకరించుకొమ్మని అంగలార్చాడు అతి దీనవాక్కులతో అర్థించాడు. ఎప్పుడైతే రామునిపై ఒట్టు పెట్టుకొని వృద్ధుడు తన్నాశ్వాసించాడో అప్పుడే కైక తన కార్యం గట్టెక్కినట్లు భావించింది. అది కార్యరూపందాల్చి కడముట్టాలంటే ఆయన్ను సత్యవాక్య పంజరంలో బంధించాలి. అక్కడ మధ్యవర్తులెవ్వరులేరు. అందుకని "ఓ రాజా! రామునిపై బాసచేశావు నీవన్న మాటలు భూమీ, సూర్యుడూ, చంద్రుడూ ఆకాశం, రాత్రి,పగలూ, శుమతైన రాక్షసులూ,భూతములూ, దిక్కులూ, నీ ధ్వజంపైనుండే దేవతలూ, సర్వప్రాణులూ, రాత్రించరులూ విందురు గాక. స్వస్థ చిత్తంతో తానై పలికిన ఈ పలుకులు దేవతలు విందురు గాక.

## కైక గతంలో జరిగిన గాథ గుర్తుచేయుట

ప్రభూ! కొంచెం గుర్తు తెచ్చుకో. నన్ను పెండ్లాడిన కొద్ది కాలంలో దేవదానవ యుద్ధం జరిగింది. ఆ యుద్ధానికి దేవతలపక్షం పోరు

ఒకు పోతూ నన్నుకూడా తీసుకొని పోయావు. ఆ మహాయుద్ధం అతి భయంకరంగా సాగింది. జయాపజయాల నిర్ణయం సాధ్యం కాలేదు. అంతకంతకు దానవులశక్తి పెరిగింది. దేవతల శక్తి క్షీణించసాగింది. అప్పుడు నీవు వత్సరకాలం వాళ్ళతో హోరాహోరి పోరి విజయం సాధించబోతుండగా, శంబరుడు మాయోపాయంతో నిన్ను శక్తిని ప్రయోగించి మూర్ఛలో ముంచాడు. ఆ సమయంలో రథసారథి లేనందున నేను రణభూమినుండి రథం తరలించి నీ ప్రాణరక్షణ చేశాను. అప్పుడు నీవు ప్రేమతో రెండు వరాలు ఇచ్చావు. ఆ వరసంపద ఇంతవరకు నీ వద్దనే దాచాను. అది ఇప్పుడు అవసరమైంది. అవి కోరబోతున్నాను. అవగ మందువా?" అన్నది.

ఆ మాటలు వినగానే ఆనాటి తన చేష్టలు జ్ఞప్తికివచ్చి, కాలుడు కాలుపట్టి కాటికి ఈడుస్తుంటే, కాముడు కేలుపట్టి కైక కాలిక్రిందికి ఈడ్చాడు. కాకపోతే ఇంతకాలం అవసరంలేని వరాలు, ఆ రాత్రికి రాత్రే కావలసివచ్చినవా? "అప్పుడుకాదు. ఇప్పుడు మళ్ళీ ఇస్తున్నాను" అని దశరథు డన్నాడు. కైక అందుకొని, "రాజా! నీవు ఇక్ష్వాకు వంశానికి ప్రతిష్ఠ పెంచిన మానవుడవు. అశ్వమేధం, పుత్రకామేష్టిచేసి దేవతలను మెప్పించావు. సంతత దానధర్మాలతో అర్థులనూ, ఆశ్రితులనూ సంతోష పెట్టావు. అరవై వేల సంవత్సరాలు ధర్మం తప్పకుండా ప్రజారంజకంగా పాలించావు. కౌశికుని కోర్కె తీర్చుటకు సంశయించిన దోషానికి, రామునితో లక్ష్మణుని పంపి సత్యవ్రతాన్ని ద్విగుణీకృతం చేశావు. ఇప్పుడు సర్వభూతకోటి వినేట్లుగా, రామునిపై ప్రమాణంచేసి మాట ఇచ్చావు. కాబట్టి అడుగుతున్నాను. ఆలించిన తర్వాత అడుగు వెనక్కు వేయకు. శ్రద్ధగా విను.

ఇంతవరకు నాకు తెలియకుండ రహస్యంగా చేకూర్చిన రామపట్టాభిషేక సంభారంతో భరతపట్టాభిషేకం జరిగించటం, ఇది మొదటి వరం. ఇక రెండోది, నారచీరలుగట్టి, జింకతోలు ధరించి, జడలుముడిచి పద్నాలుగేండ్లు దండకారణ్యంలో దాశరథి సంచారంచేయటం. ఈ వరాలు ఇప్పుడు నిన్ను బలవంతంచేసి కోరుకొన్నవి కావు. నీవు పూర్వం,

ఇప్పుడూ మనఃపూర్వకంగా ఇచ్చినవే. అదిగాక నా పెండ్లినాడు మానాయన సమక్షములో నాకు కొడుకు కలిగితే, వాడు కోరితే, రాజ్యానికి వారసుణ్ణి చేస్తానని మాట ఇచ్చావు. ఈ సమయంలో నా కొడుకు కోరుకుంటాడేమో యని లేకుండానే పట్టాభిషేకం తలపెట్టావు. కాబట్టి ఈ రెండు కోరికలూ వెంటనే నెరవేర్చు. మాట నిల్పుకో."

## కైక వరాలు విని రాజు కలతపడుట

ఆ దారుణమైన పల్కులు విని వృద్ధుని గుండె బద్దలైంది. చెవులకు చెముడు వచ్చింది. కంఠంకు అంధత కలిగింది. బుద్ధి బుగ్గి అయింది. మనస్సు భ్రమానైంది. శరీరం శిలాకారం పొందింది. నోటమాట పడిపోయింది. ఆ అయోమయావస్థలో అలా కొంతకాలం గడిచిన తర్వాత లబ్ధసంజ్ఞుడై, "ఇది కలా? లేక, జాగ్రదవస్థా? అన్నది కైకేయియేనా? నాగ్రహచార ప్రతిబింబమా? నేను విన్నది నిజమా? అబద్ధమా? "అన్యథా చింతితం కార్యం, దైవమన్యత్ర చింతయేత్" అన్నట్లు జరిగినదేమి? ఈ సూర్యవంశంలో రాజపురుషుల సంకల్పానికి వికల్పం ఎన్నడైనా వుందా? ఈనాడు ఈ విధంగా జరగటానికి నాలో లోపాలేమైనా వున్నవా? భరతుడు రాజు గావచ్చుగాక, రామ వనవాసం దేనికి? రాముడు దండకారణ్యంలో వుండే దశరథుడు దండధరుని సమక్షంలో వుండడా? నా చావును చూడగోరి ఈ కోరికలు కైక కోరుకున్నదా? నమ్మలేకుండా వున్నాను. తనకు ముందు చెప్పలేదన్న కోపంతో పరిహాసానికి ఇలా అడిగింది. కాని, నిజంగా రాముణ్ణి అడవికి పొమ్మంటుందా? తల్లిని మరపించిన తల్లియైన కైక నా మనోగతం తెలుసుకుంటానికి అడిగినదేమో కాని, నిజంగా ఇంత క్రూరమైన కోరిక కోరుతుందా? ఇది నా భ్రాంతి. నిజం కాకపోతే, నేనన్న మాటకు "సూర్యచంద్రులూ, భూమ్యాకాశాలూ, సర్వదిక్కులూ, సమస్తదేవతలూ సాక్షులు" అని ఎందుకు అంటుంది? ఊహించరాని, చూడరాని ఇంత భయంకర భీభత్సదృశ్యం ఎందుకు సృష్టిస్తుంది? ఇది నా మరణాన్ని చూడగోరే కోరింది. నవ్వులకే కాక మనోమాత్రంగా నైన పలకరాని, వూహించరాని ఈ దుష్టభావం ఎందుకు కల్గింది? రామవియోగాన్ని భరించలేక నేను పోతాను విధవగా

కొడుకు పాలన చేస్తూంటే కులుకుతూ చూస్తుంటుందా? ఇది దీనికి బుద్ధి పూర్వకంగా పుట్టిందికాదు. రామపట్టాభిషేకం గిట్టనివాళ్ళు చెప్పివుంటారు. ఇదీ నా తెలివి తక్కువ వూహే. మా రామయ్యను ద్వేషించే ప్రాణి ఇప్పటి దుష్టురాలుతప్ప ఈ విశాల విశ్వంలోనేలేదు. పుష్పహారంగా కనిపించిన సర్పాన్ని ధరించాను. ఈనిన పులి వంటిదని తెలియక భరించాను. పైపై పూతలకు మురిసి యోగ్యురాండ్రైన కౌసల్యా సుమిత్రలకు ద్రోహంచేశాను. వయస్సు మీరినా వాంఛ నశింపక సంతానార్థమన్న సాకుతో ఈ మానవాకార మృత్యువును తెచ్చుకున్నాను. ఇప్పుడు ఏది కర్తవ్యం? ఈ మహాజనానికి ఏమని సమాధానం చెప్పను? మహర్షులతో నిండిన మహాసభలో రామునికి పట్టాభిషేకం చేస్తానని పలికాను. కౌసల్య కొండంతయాశతో ఈ సంతోషవార్త విని ఎదురు చూస్తున్నది. ఏ మంచి చేయకపోయినా, ఈ మంచైనా జరుగుతున్నదని పొంగిపోతున్న సుమిత్ర మొగం ఎలా చూడను?

అన్నిటికంటే హృదయ విదారకమైన దృశ్యం మా రామచంద్రుణ్ణి చూడటం. లేని ఆశకల్పించి, ఉత్సాహపరచి, ఆ ఉత్సాహం పరిహసిత చంద్రికామండలంగా మార్చిన దరహసిత వదనం, కాంతివాసి, అతిదీనంగావుండే--అబ్బా! భావించలేను, భరించలేను, బ్రదుకలేను హా! రామా! రామా! ఈ దుష్టకాముకునకు ఎందుకు కలిగావయ్యా? కల్గినా లోకంతోపాటుకాక, సౌందర్యమంతా రూపంగా ధరించి, సద్గుణ సమాహారంగా ఎందుకు వున్నావు? ఏ నోటితో నిన్ను రాజును చేస్తానన్నానో, ఆ నోటితోనే నిన్ను అడవులకు పొమ్మని ఎలా అంటాను? ఓ విధీ! ఈ విషవృక్షానికి అమృతోపమమైన ఈ ఫలం ఎందుకు సృష్టించావు? నాకుగాని ఈ ఫలానుభవం లోకం పాలవుతుంది. ఆ లోకం ఆనందపడుతుంటే చూచి సంతోషపడటానికైనా నేను బ్రతకనుగదా? ఇది నా జీవన్మరణసమస్య. నాకీ నోటి తొందర ఎందుకు? ఆనాడు కౌశికునికి వాగ్దానంచేసి, కాళ్ళమీద పడవలసి వచ్చింది. ఆయన దయతో అనుగ్రహించాడు కాని, ఈ పాపి అంగీకరించదు. ఇదంతా అదుపు తప్పిన ఇంద్రియాల ప్రభావం. మా రాము ప్రభువును వదలి లక్ష్మణుడుండడు. భర్తలేనాసిన ఈ రాష్ట్రం, భర్త చచ్చిన ఆ స్త్రీలు ఎలా సంరక్షిస్తారు?

చివరకు నా గతి ఎంతకు దిగజారింది. లోకం మెచ్చేయజ్ఞం చేసి, లోకోత్తరమూర్తులైన నలుగురు బిడ్డలకని, నే చస్తే తల కొరివిపెట్టే దిక్కులేక, పాచి పీనుగుగా, పౌరులు దహనం చేస్తారు. నేనుండగా ఇంత క్రౌర్యానికి పాల్పడ్డ ఈ మర్కటి, నా అనంతరం, బిడ్డల అండదండలు లేని ఆ పరమ సాధ్వుల, కౌసల్యా సుమిత్రల బ్రతుకనిస్తుందా? అరణ్యంలోనైనా ఆ అన్నదమ్ములు కలసి జీవించనిస్తుందా? తల చెడి, పూర్వమే ఈయరాని వాగ్దానం ఇచ్చాను. అది చాలక ఇప్పుడు ఇస్తానని రామయ్యపై ప్రమాణం చేశాను. అది త్రోసివేసినా ఇది త్రోయలేను. ఈ ప్రమాణానికిఅదృశ్యమూర్తులు ఈ చెడిపె కోరికతో సాక్షులుగా నిల్చారు. ఇంతవరకు అనృత దోషమెరుగని నా వాక్కు, మహాశక్తివంతమైనది. ప్రమాణభంగం చేస్తే నా రామయ్యకు కీడుతప్పదు. నా పాపం నాతోనే ముగుస్తుంది.

ఏమీ ఎరుగని నా నాయన అడవిలోనైనా జీవించితే అదే చాలు. నా తరువాత జరిగే పరిణామం నేను చూడను. బ్రతికినప్పుడే కదా ఈ మమకారం. నా ఈ చేసిన పాపానికి పశ్చాత్తాపం చాలదు. మరణమే శరణం. నేను అనృతదోషానికి పాల్పడ లేను. రామయ్యను రాజ్యం వదలిపెట్టి అడవికి పొమ్మని అనుశాసించనులేను. ఇక నేను బ్రతికినా చచ్చినవాడికింద జమకట్టవలసిందే. కాదు. కాదు. దీనికి మార్గాంతరం వుంది. ఇప్పుడు నేను ఆత్మహత్య చేసుకుంటే అన్ని పనులూ అనుకున్నట్లు సవ్యంగా సాగిపోతవి. నా ముద్దులయ్య పట్టభంగానికి నేనే ప్రబలావరోధం. నేను పోగానే లోకాచారం ప్రకారం పౌరులు, ధర్మవేత్తలు, మంత్రులు, మహర్షులు మా రామయ్యనే రాజు చేస్తారు. అడ్డగించే అధికారం ఈ విషలిప్తఖరాసికి, ఈ మేకవన్నె పెబ్బులికి వుండదు. బిడ్డలంతా సౌజన్యమూర్తులు. అగ్రజుడంటే ఆత్మార్పణం చేస్తారు. ఈ కుటిల ఇచ్చినా భరతుడు పాలించడు. వాడు అన్ని విధాలా అన్నగారి ప్రతిమూర్తి. ఇదే అన్ని విధాలా ఆచరణ యోగ్యంగా వుంది. ఇక మానసికక్షోభం కల్పించుకోవాలి" అని నిర్ణయించి, కుపితసింహంలాగా కైకేయిని ప్రక్కకునెట్టి, ఇతఃపూర్వం మనోవేదనతో కలిగిన అశక్తత

నుంచి శక్తిపుంజుకొని, చివరి యత్నంగా చతురుపాయాలను క్రమంగా ప్రయోగించుటకై — జీవితంలో ఎరుగని పనికి సిద్ధపడి—

## కైకేయిని రాజు కఠినోక్తులు పల్కుట

"ఓసీ! నయవంచకురాలా! ఎంత పని తలపెట్టావు? ఇంత విషాన్ని దాచకుండా ఇప్పటిదాకా ఏ విధంగా కడుపులో దాచావు? ఆనాటి దేవదానవ సంగ్రామంలో చావకుండా కాపాడినందుకు, వరాల రూపంగా ఈనాడు నీ చేతులతో నీవే చంపదలచుకున్నావా? ఏ వంశ గౌరవానికి ప్రలోభపడి మెట్టావో, ఆ వంశగౌరవం మట్టిపాలు చేయాలనే దుర్బుద్ధి నీకు ఎందుకు కల్గింది? నీ వంటి పాపజాతి పుట్టువు అని తలిస్తే, ఆనాడు పాయస భాగం ఇవ్వకయేపోదును. నీ దుష్టచేష్టకు బుద్ధిమాలిన ఈ ముసలి రాజు రాముణ్ణి అడవికి పంపగలడేమో కానీ, నీ కొడుకును రాజుగా చేయలేడు. పౌరులు భరత పట్టాభిషేకం జరుగనీయరు. అది నిజం. అన్న అవమానానికి ఆగ్రహోదగ్రుడైన లక్ష్మణుడు, గాధేయ మహర్షి దత్త సకలాస్త్రవేదరహస్యనిధి, నారీటంకార మాత్ర కంపిత సర్వ దిగ్దిగంతరుడు, రామచంద్ర పాదాశ్రిత మనస్కుడు, ధర్మం తప్పిన నన్ను నిలువరించి, నా దుడుకుతనానికి, నా మందగానికి ప్రతీకారంగా, నీ మాటను పాటించాల్సిన పనిలేదని మనస్సున ధరిస్తే, నీవూ, నీ కొడుకూ ఏమవుతారు? నేనేమవుతాను? రామ వనవాసంతో అయోధ్య అడవిగా-కాటికాపు-శ్మశానంగా మారుతుంది.

నీవు ఒకనాడు నాతో ఏమన్నావు? రాముడు లోకాభిరాముడనీ రామునిలో భరతుణ్ణి చూస్తున్నాననీ, రాముడు వద్ద వుంటే భరతుడు వున్నట్లే వుంటుందనీ, రామభరతులకు తేడాలేదనిగదా? మరి ఇప్పుడు ఈ వింత జాడ్యం ఎందుకు వచ్చింది? ఈ భేదం ఎందుకు వచ్చింది? నీవే నాతో రామయ్య పట్టాభిషేక ప్రస్తావన చేశావు గుర్తుందా? ఆ మమకారం ఏమైంది? అబ్బాయిలో ఏ దోషం చూశావు? ఈ పాపబుద్ధి భరతునకు కలగటానికి వీల్లేదు. ఇది నీకే పుట్టింది. నీ వరాలకు ప్రతిఫలం ఏమిటో తెలుసా? మొదటి బలి నేను. రెండవ బలి కౌసల్యా సుమిత్రలు. ఆ తర్వాత నీవు. నిన్నూ, నీ మందిరాన్ని పౌరులు అగ్నిదేవునికి ఆహుతి

చేస్తుంటే ఆ పొగ యాతనాశరీరంతో యమలోకంలో శిక్షలు పొందేనాకు వార్త చెప్పటానికి వస్తుంది సుమా. తిరిగి ఆలోచించుకో. పండువంటి సంసారం పాడు చేయకు. చేసుకోబోకు. అంధురాలవైన నీకు కరదీపికగా నా మాట మన్నించు. సాధ్వీలోకంలో సాటిలేని దానవన్న కీర్తి సంపాదించు. నీజాతి నీచమైన దావుకోరి తెచ్చుకోకు" అంటూ కఠినంగా పల్కాడు. ఆ మాటలకు దండాహతగాల భుజంగిలాగా లేచి, సీత్కారం చేసి, కన్నుల్లో నిప్పులు కురుస్తూ కైక రాజుతో ఇలా అంది.

## కైకేయి రాజును దూషించుట

"రాజా! ఎంతెంత మాటలంటున్నావు? నేను దుష్టురాలనా? పాపినా? నేను వంశ ప్రతిష్ఠను మట్టిపాలు చేస్తున్నానా? నేను ప్రసవించిన పెద్దపులినా? ఈ మాటలు అంటానికి నీకు నోరెట్లా వచ్చింది? ఆనాడు యుద్ధంలో మరణించకుండా కాపాడింది నా మాంగల్య రక్షణకా? ఈనాడు నిన్ను చంపి త్రెంపివేయుటకా? అది నా దుష్టత్వానికి చిహ్నమా? వయః పరిమాణాన్ని చూడక, తల్లిదండ్రుల మాటవినక, సత్కుల సంజాతనై, సౌందర్య వారాన్నిధినై నిన్నుచేపట్టి, మనోవాక్కాయకర్మల్లో నిన్నారాధించి, తను ధన మనః ప్రాణాలు నీ కర్పించి, సవతి మత్సరం విసర్జించి, యాభయివేల వసంతాలు నీ సేవ కర్పించుట పాపహేతువగునా? కైకేయి చిన్నదైనను, కౌసల్యా సుమిత్రల గుణగణాలను అతిక్రమించి, సాధ్వీలోకంలో సమారాధనార్హ అయిందని ప్రజలచే నివాళులందుకొనటం వంశ ప్రతిష్ఠకు భంగకారి అవుతుందా? కన్నబిడ్డ దూరదేశంలో వుంటే కలత పడకుండ, నీ మమకార కుమారుణ్ణి పూలలో పెట్టి పూజించి, విద్యాబుద్ధులు నేర్పించింది ప్రసవించిన పులి గుణమేనా? నా పెండ్లి సమయంలో "నీ కుమారునకు రాజ్యార్హత కల్పిస్తా"నని సమయం చేయటం నా నిర్బంధంపై నేనా? అప్పటికి నీకు సంతులేదు. నా నుంచి పొందదలిచే కదా ఈ మాట అన్నది. ఆ ఆశతోనేకదా నేను నిన్ను పెండ్లి ఆడింది. ఆడుదానికి సృష్టి సహజంగా సంప్రాప్తమైన గుణం బిడ్డలపై మమకారం, వారి అభివృద్ధి కోరటమేకదా? ఇప్పుడు రాముణ్ణి వనవాసం పంపుతానంటే కౌసల్య సంతోషంతో సమ్మతిస్తుందా?

పరిణయ సమయంలో ప్రమాణం చేశావు. సంగర సమయంలో, పలవు క్రుమ్మరిస్తూ వరాలు కోరుకొమన్నావు. ఇప్పుడు రాముడి మీద ఒట్టు పెట్టుకొని అభిమతం తెలుపుమన్నావు. ఇదంతా, నా వంచనలో నుంచీ, మెరమెచ్చులలో నుంచీ వచ్చిందేయనియంటావా? ఇదంతా నా బల వంతంమీద జరిగిందేనా? రాజా! మైమరచి మాటలు పారేసేటప్పుడు ఫలితం ఏం వస్తుందో పరికించలేదు. ఇంతకూ నేచేసిన దోషం ఏమిటి? నీ విచ్చిన వరాలు ఇమ్మని అడగటమేనా? ఇందుకు అకరాని మాట లంటావా? విషయం వచ్చింది కనుక దాచకుండా అడుగుతాను, చెప్పు. నీవు పూర్వ గౌరవం నిలిపే వాడివైతే, నాకు ఇచ్చిన మాట ప్రకారం భరతునికి రాజ్యం ఈయక, రామునికీయటానికి ఎందుకు సంకల్పించావు? పోనీ, ఇలా చేస్తున్నానని నాతో ఎందుకు చెప్పలేదు? భరత శత్రుఘ్నులు లేకుండా పట్టాభిషేకానికి ఏమంత తొందరవచ్చింది? ఇదంతా నీకు తెలుసు. నాతో చెప్పినా, భరతుడున్నా భంగం వస్తుందని అదరాబాదరాగా తల పెట్టావు. ఈ ముహూర్తం వశిష్ఠులవారు మనః పూర్వకంగా పెట్టారా? నీ మాటకు తల వూపారా? కౌసల్యకు చెప్పావు. రామునికి చెప్పావు. దేశ దేశాంతర వాసులకు చెప్పావు. కట్టుకొని కాపురం చేస్తున్న కైకకు చెప్పటానికి నీకు తీరుబడి లేదా? ఇంత కుటిలత, నయవంచన, ఇంత దుర్బుద్ధి నీలో వుంచుకొని నన్ను "నయవంచకురాలా" అంటావా? ఇప్పుడు నీవు చేసింది నయవంచనకాదా? నన్ను ప్రేరేపించి, "కోరుకో తీరుస్తా" నని రామునిపై ప్రమాణంవేసి, కోరుకుంటే నోటికిరాని కారుకూతలు కూయటాన్ని ఏమంటారు? సత్యవాక్య పరిరక్షణ అంటారా? వంశప్రతిష్ఠ అంటారా? నిజం చెప్పాలంటే ఈ క్రౌర్యం నాలో లేదు. నీవు చేసిన భేదోపాయంవల్ల కలిగింది అయినా, అందుకు ఇది ప్రతీకారం కాదు. ఏ తల్లి అయినా కొడుకు క్షేమానికి, ఏ అల్పావకాశం వచ్చినా విడువదే? అటువంటిది ఇంత మహావకాశం ఈ తల్లి మాత్రం ఎందుకు జారవిడుచు కోవాలి. అలా విడిచిపెట్టను.

నన్ను దూషించడమాని, పట్టాభిషేకం ఆపి, భరతునికి వార్త పంపి, శుభలగ్నంలో పట్టంకట్టు. ఈ రోజే జటావల్కలధారియై రాముడు, దండకారణ్యానికిపోయే ఏర్పాటుచేయి. ఏమేమో ప్రగల్భాలు పలికావు.

భయపెట్టావు. లక్ష్మణుడు ఆగ్రహిస్తే జగత్ప్రళయం వస్తుందా? వాడెంత? వాడి శౌర్యమెంత? నా పాతివ్రత్యశక్తిముందు భస్మమైపోడా? అనసూయా సావిత్రీ చరిత్రలు ఆలకించలేదా? నేను తలచుకుంటే ప్రళయమూ కల్పిస్తాను. పునస్సృష్టినీ చేస్తాను. ధర్మా ధర్మాలతో నాకు పని లేదు. నీవు అడగమన్నావు. నేను అడిగాను. అంతవరకే. ఆ ధర్మాధర్మ వివక్షణ అంతా నీదేకాని నాదికాదు. కాలహరణం జరగటానికి వీల్లేదు. ఇప్పుడే రామునికి కబురుపంపు. రాగానే అడవికి పొమ్మని ఆజ్ఞ ఇవ్వు. నీవు నన్ను మనఃపూర్వకంగానే కఠినంగా తిట్టావు. కాని, నేను అలా తిట్టలేదు. సమాధానం అన్నమాటలకు అందించాను. నా హద్దు నాకు తెలుసు. నా సతీధర్మం నాది. నా బాగోగులు నాకు తెలుసు" అంటూ ఎదురాడింది.

## దశరథుడు న్యాయనిష్ఠురములతో కైకేయిని వేడుకొనుట

"దేవీ! వినరానిమాటలువిన్న బాధలో అనరానిమాటలు అన్నందుకు నన్ను క్షమించు. నీ అనురాగం, శీలం, ఔదార్యం, అభిమానం అన్నీ తెలుసు. నోటిదురుసు వృద్ధతతో వచ్చిందిగా భావించి మన్నించు. నీ వడిగిన ప్రశ్నల్లో కొన్ని సంపూర్ణంగా నిజం. కొన్ని, సంఘటనల ద్వారా అనుమానించటానికి అవకాశంవున్నమాట నిజం. కొన్ని నావల్ల నీవూ అనుమానించి ఆవేశంపొంది అన్నవి కూడా నిజం. దోషం అంతా నాదే. కాని, నీ దోషంకూడా కొంతలేకపోలేదు. అవ్యవధిగా ఈ కార్యం ఎందుకు తలపెట్టానంటే, నా జాతకచక్రంలో మారక గ్రహాలు సన్నిహితరాసుల్లో బలంగాచేరి, సమీపమరణాన్ని సూచిస్తున్నై. రేపు తప్పితే ఇంతమాత్రం మంచిగానైనా సంవత్సరాంతందాకా లగ్నాలు లేవు. అంతకాలం నేను జీవించటం దుర్లభం. నీవు రామపట్టాభిషేకానికి అడ్డంకంకావని నమ్మకం. భరతునకు, జనకరాజుకు వర్తమానం పంపి, వారు చేరటానికి ఈ నాల్గుదినాలు చాలవు. ఈ సంకల్పం కలిగింది అయిదు దినాలకు పూర్వమే. బ్రతికి వుండగానే ఆ శుభకార్యం నెరవేర్చుద్దామని అనుకోవటం. కొన్ని వేల ఏండ్లకు పూర్వం పట్టాభిషేకం

జరిగింది. అదంతా పౌరులు, మంత్రులు మరచిపోయారు. అన్నీ తెలిసిన వాళ్ళం వశిష్ఠవామదేవులూ, నేనూ. ఈ బృహత్కార్యానికిసాధన సామగ్రి సంపాదించటానికి తగినవారిని నిర్ణయించి, ఆదేశాలివ్వాలి. ఇంతకు కొద్ది గడియలకుముందే కౌసల్యకు కబురంపాను. రాముణ్ణి సభకు పిలిపించి చెప్పాను. తొందరగా నీ మందిరానికి వచ్చాను. అంతేకాని, నిన్నూ భరతుణ్ణీ వంచించటానికికాదు. మీరెవరని మోసగిస్తాను? ఏం ఆశించి ఆ పనిచేస్తాను? నీవు అగ్నిసాక్షిగా గ్రహించిన అర్ధాంగివి. పైగా ఆత్మీయురాలివి. వాడు కొడుకు. ఇందులో ఏ కుతంత్రం లేదు. నా మాట నమ్ము. జరిగిన విషయం సమగ్రంగా తెలుసుకోకుండా అకారణంగా ఆగ్రహం తెచ్చుకోవటం, అపార్థం చేసుకోవటం, కోరరాని కోర్కెలు కోరటం వరకు నీ దోషం. ఇది ఒక పీడకలగా భావించి మరచిపోదాం. నీ కింకా ఆగ్రహం తీరకపోతే, పవిత్రతకూ, సత్యవాక్య పరిపాలనకూ, వేదధర్మ పరిరక్షణకు చిహ్నమైన ఈ ఇక్ష్వాకురాజ కిరీటం ధరించిన నా శిరస్సు నీ పాదాలు సోకమొక్కుతాను. ఇకనైనా సంతోషంతో రామాభిషేకానికి సాయపడు. అర్ధాంగివిగా ఇచ్చిన ఆనందంకంటే వేయిరెట్లుగా దీన్ని స్వీకరిస్తా"నని పాదాలపై పడ్డాడు.

## కైక రాజు ప్రార్థన తిరస్కరించి ప్రమాణపాలనకు పట్టుపట్టుట

"విన్నాను రాజా! విన్నాను. నీ మహోపన్యాసం సాంతంగా విన్నాను. అనుకూలంగా వున్నంతవరకు ఆదరించి, అనుభవించి, వ్యతిరేకత రాగానే విశృంఖలంగా నడిచే నీ స్వభావం కన్నాను. నాకు ధర్మాధర్మాలతో పనిలేదు. దయాదాక్షిణ్యాలతో పనిలేదు. కావలసిందల్లా నాకిచ్చిన వరాలు ప్రమాణబుద్ధితో చెల్లించటం. "సూర్యాన్వయులం, సుక్షత్రియులం, సూనృత వాక్య పరిపాలకులం" అంటూ ప్రగల్భాలు పలికే నీవు, నీవన్న మాటలు నీవే కాలదన్నుతావా? ఇది సత్యవాక్య రక్షణకు మొదటి మెట్టా? నీ మాటలు ఎవరూ వినలేదనుకొని, విపరీత మార్గం త్రొక్కుతావా?

జగచ్చక్షువులైన సూర్యచంద్రులు లేరా? అష్టదిక్కులు లేవా? అదృశ్యరూపంగా చరాచర జగత్తును, సృష్టి స్థితి లయాలను పొందింప చేసే అనంత శక్తిలేదా? అన్నిటి యంతరాత్మ లేదా? విన్నా నా యంతరాత్మ లేదా? నీవిలా ప్రవర్తిస్తావని నాకు ముందే తెలుసు. అందుచే ఆ మూర్తులను సాక్షులుగా చేసి, కోరాను, ఇచ్చినా నావాగే. ఈయకున్నా నా వాగే. ఇస్తే నామాట చెల్లించిన సత్యవాది వవుతావు. ఈయకుంటే నన్ను చంపిన వాడవవుతావు. నేను బ్రతికి వుండగా రామాభిషేకం జరగదు. సవతి రాజమాత కాదు. సీత రాణి కాదు. మాండవి రాణి కావాలి. భరతుడు రాజు కావాలి. కైక రాజమాత కావాలి. నా నిర్ణయం తిరుగులేనిది. రామవియోగం నీకెంత దుస్సహమో, ఆత్మాభిమానహాని నాకంత దుస్సహం. రాముని వదలి నీవు జీవించలేకపోతే, అనృత దోష పంకిలుడవైన నీ అర్ధాంగిగా నేనూ జీవించలేను. నన్నిక మాటలతో మభ్యపరచలేవు. చేతలలోనే చిత్తశాంతి కలిగిస్తావో, జీవరహిత కళేబరానికి దహన సంస్కారాలూ చేయిస్తావో, నీవే నిర్ణయించుకో. పాప పుణ్యాలు, స్వర్గనరకాలు నా కేస్థానాన్నిచ్చినా సంతోషంగా స్వీకరిస్తాను. అంతేకాని నా నిశ్చయం మార్చుకోను. నేనెవరినో నాకు తెలుసు, నేనెందుకు వచ్చానో, ఏమి తల పెట్టానో, పర్యవసాన ఫలితం ఏమవుతుందో ఎరుగుదును. నీవలె నేనూ చదువుకున్నాను. ధర్మసూక్ష్మాలు గుర్తించాను. కాని, అవిపొంకలేను. ఇచ్చి మరల పరిగ్రహించలేను, ద్వేషించ కూడదు. ఇన్ని మాటలతో పనిలేదు. ఇప్పుడు నీకు రెండే మార్గాలున్నవి. అవి నా వరాలు తీర్చటం, లేక నా శవాన్ని దర్శించటం. త్వరగా తేల్చుకో" మని అశనిపాత సదృశమైన వాక్యాలు పల్కించి, మొగం ప్రక్కకు త్రిప్పుకొని, పైటచెంగు లాగి, సోగగా మెల్లి త్రిప్పటం మొదలుపెట్టి కండికి కడివెడుగా దుఃఖాశ్రువులు రాల్చసాగింది.

## వృద్ధరాజు ఉద్వేగంలో కైకను విసర్జించి మూర్ఛిల్లుట

మహావాత తీవ్రగమనాహతికి ఊయగు వృక్షంలాగా ఆపాద మస్తకం కంపింపగా "ఓసీ! దుష్టురాలా! ఎంతకు తెగించావు? ఇక

నిన్నన్న చంపేవు. ఇది అంతా స్వయంకృతాపరాధమే. అతికాముకుల కీగతి కాక మంచిగతి ఏంవస్తుంది? నను పుత్రుడు భరతునే కాక, నీవు భర్త ననుకూడా మరచి దుష్టుల ఆశ్రయించావు. నీకు హితం ఉపదేశించటం, పాముకు పాలుపోయటం వంటిది. నీ సాధ్వీత్వంపై నీకెంత విశ్వాసం వుందో, నా సత్య వాక్పరిపాలన మీద నాకంత విశ్వాసముంది. నీవు సృష్టిప్రళయాలు కల్పించే పతివ్రతవైతే, ఒక్క శాపవాక్యంతో నీకు భరతవాక్యం పలికించే సత్యశక్తి నాకూవుంది. నా కామం దారలపైనే కాని పరదారలపైన గాదు. ఇక్ష్వాకులు నిగ్రహానుగ్రహసమర్థులు. ధర్మపరులు. సత్యవ్రతులు.

ఇది ఏమి నిర్దయం? ఇది ఏమి సాధ్వీత్వం! నా ఇచ్చిన చనువునకు ఇంత మచ్చరం పూనటానికి. నా తప్పేమిటి? రాముని తప్పేమిటి? నేను నీపట్ల అన్యథా ప్రవర్తిస్తే ఆ శిక్ష నాకు గాని, అధంపథం తెలియని రాముని కెందుకు? అశేషప్రజానీకం రామాభిషేకం చూడాలని తహతహ పడుతున్నది. నీవు నా సశరీర దహనానికి చితి పేర్చుతున్నావు. ఉభయు కుల గౌరవం కాపాడాలని, ఉభయుల అన్యోన్యత భంగింపరాదని, నీ దౌష్ట్యం ఇంతవరకు సహించాను. ఎంతకాలం కలసి కాపురం చేస్తే యేం? “ఔదుంబరాణి పుష్పాణి, శ్వేతవర్ణంచ వాయసం, మత్స్యపాదం జలం దృష్ట్వా, నారీ హృదయం నపశ్యతి” (మేడిచెట్టుపూలూ, తెల్లని కాకులూ, నీళ్ళలో చేపల అడుగులూ చూడవచ్చునుగాని, ఆడువాని హృదయం చూడలేము) అన్న పెద్దలసూక్తి ప్రకారం ప్రవర్తించావు. నీవు బ్రతికి వుండగా రామాభిషేకం ఎలాజరుగదో, నేబ్రతికినంతవరకూ భరతాభిషేకం జరుగదు. రామయ్య అడవికి బయలుదేరగానే, నా శవం వెంటనే కాటికి బయలుదేరుతుంది. నా మరణం, రామ వియోగంతో, కౌసల్యా సుమిత్రలు సహగమనం చేస్తారు. లక్ష్మణుడు అన్నను అనుసరిస్తాడు. అత్తమామల మరణానికి, ఆత్మేశ్వరుల ఎడబాటుకూ కుమిలి కుమిలి, నవనవోన్మేషంగా ఎదుగుతున్న తీగ మూలచ్ఛేదంకాగానే వాడిపోయినట్లువధువులువాలిపోతారు. ఇటు మగడు, అటు కొడుకులు లేక, ఊషర క్షేత్రంగా మారిన అయోధ్యలో నీవూ నీ కొడుకూ పిశాచాలవలె సంచరించండి. నీవు నా పట్ల

చేసిన సేవా విశేషాలు చెప్పుకున్నావు కాని, నేను నీకు చేసిన మేలుగుర్తె ప్పుడైనా తెచ్చావా? విశ్వాస ఘాతుకురాలా! దీనికి ప్రతిక్రియ నాకు తెలుసు. రఘువంశనాశనీ! నేనసత్యదోషాన్ని పొందకపోతే నిష్ఠురమైనా నా వాక్యాన్ని పాలించు. నేను చచ్చిన మీద మున్ముందు కొడుకుతో నాకు ఉత్తర క్రియలు నిర్వర్తించాలి. నా శవాన్ని నీవుగాని, నీ కొడుకుగాని, తాకరాదు. వాడు కర్మ చేయరాదు. నన్ను చంపటానికి కంఠాన్ని చెంగుతో బిగించుకో పోతున్నట్లు నటిస్తున్నావా? ఉరివేసుకుచచ్చినా, మంటలో దూకిచచ్చినా, కొండచరియమీంచి దూకి వేసుకునకైనా చచ్చినాసరే, నీ కోరిక సిద్ధించదు. ఇంత నిర్లజ్జవు, ఇంత దురాగతవాదవు, ఇంత కులక్షయకారిణివి, ఇంత క్రూరుల పిశాచమవు, ఇంతనైచ్యమార్గానువర్తినవు ఐన నిన్ను తృప్తి పరచి, నా తండ్రిని, నా జీవనజ్యోతిని, నా ముద్దుబిడ్డను, నా ఆనంద ధామాన్ని అడవులకు పంపుతాననుకున్నావా? ఈ ముసలి తనంలో ఇంత శోక కలిగిస్తావా? పాపవర్తినీ! నువ్వెరి నా జీవితానికి మాయని మచ్చ కలిగించి, స్వర్గారోహణ చేయాల్సిన నన్ను నరకకూపంలో త్రోసి, ఏమి బావుకుంటావు? బ్రతికినన్నాళ్ళు, లోకులు ఛీ కొట్టుకుందే ముండవై, ముసుగువేసుకుని భర్తని వెనుక పరిపాలిస్తావా? ఇది నువ్వు కోరినదైన నీకు సంతోష హేతువా? వార్ధక్యంలో నన్ను కోరరాని కోరికలు కోరి కడుపులో చిచ్చుపెడతావా? పట్టాభిషేకం జైతేయు పన్నిసలలో సింహం లాగా చిక్కి అవుతున్నాడని ప్రజలకు చెప్తున్న నా మొగంపై పేడనీళ్ళు కొడుతుంటే, ఇంట్లో పన్నీటిలో స్నానంచేసి, హంసతూలికా తల్పంలో ఆనందబాష్పాలు రాలుస్తూ, ఎడమచేతిపై తల ఆన్చిచూస్తూ, వింటూ పవళిస్తావా? ఇంతకు తెగించిన నీవు ఏమైనా చేస్తావు. ఎంతకైనా సహిస్తావు. కొడుకును అడవులకు పంపమని తల్లి కోరితే, పరవశించి పంపే తండ్రిగా నేను జీవించలేను. కొడుకు వృద్ధికోసం రాజ్యాభిషేకం తల్లిగా కోరటం కొంతవరకు సబబేమో కాని, రాము వనవాసం దారుణాతి దారుణం. పట్టాభిషేకానికీ, వనవాసానికీ ఏమి సంబంధం ఉన్నది? ప్రజలు హర్షించి నంతకాలం ప్రభువులమేనాని, తిరస్కరిస్తే పరిపాలకులంకూడా కాము. అయోధ్యా వాసులు అంత వివేక హీనులుకారుసుమా. నా పని అయి పోయింది. నా బ్రతుకు ముగిసింది. నాకీలోకంతో పనిలేదు. హా రామా!

రామా!" అంటూ, వజ్రఘాతపు రెక్కలు తెగిన పర్వతంలాగా ప్రభువు నేలకూలాడు. కైక కఠోర స్వరంతో "ఏమి రాజా! ఇందాక నా దంతా నటన అన్నావు. ఇప్పుడు నీవు చేసిందంతా నటనకాక మరేమిటి? నీ ప్రేమ పాత్రుని ఎడబాటు నిన్నంతవేస్తే, నా కన్నకొడుకుమీద ప్రేమ నన్నెంత చేయాలి? ఇన్ని దుర్భాషలు దేనికి? నీ వరాలు చెల్లించననరాదా? నా అడ్డంకి తీరిపోతుంది. నీవూ, నీభార్యలూ, కొడుకులూ, కోడళ్ళూ సుఖంగా ఉండవచ్చుగా. "సత్యపాలనకు మా వంశమే ముఖ్యం, అందులోకల్లా నేనే ముఖ్యం" అని మీసం దువ్వుకోవచ్చుగా. ఈ చచ్చుమాటలు దేనికి? ఇస్తావా నే కోరినట్లు వరాలు ఇవ్వు. లేదా? ఇవ్వనని చెప్పు. కాయవలచుకుంటే రాముణ్ణి ఇప్పుడే అడవికి పంపు. భరతుని పట్టాభిషేకానికీ, రామ వనవాసానికీ రాజకీయంగా అవినాభావసంబంధముంది. నేనుకోరింది పద్నాలుగేండ్లు.

అయోధ్యలో అన్న ఉండగా తమ్ముడు సింహాసనం ఎక్కడు. రాముడు పద్నాలుగేండ్లు అడవుల్లో ఉండే రాజ్యాధికారానికి హక్కు వస్తుంది. అరాజకాన్ని ప్రజలు మన్నించరు. రామయ్య లేని లక్ష్మయ్య పూచికపుల్ల కూడా కదలించలేడు. ఇప్పుడు అన్ని విధాలా యోగ్యుడైన నా కొడుకునే ప్రజలు ప్రభువుగా కోరతారు. తెలిసిందా సంబంధం? ఇప్పుడే కబురుపెట్టు. నీ కిప్పుడు వచ్చిన ప్రమాదం, ఏమీలేదు. నీవు జాగు చేసినా నేను జాగు చేయను. నే చస్తే సూతకంతోనైనా పట్టభంగం జరిగి తీరుతుంది. అది నిగ్రహించటం నీ తరం కాదు. పూర్వం ఆడిన మాట తప్పకుండా డేగకు శిబి చక్రవర్తి శరీరం కోసి మాంసం ఇవ్వలేదా? అలర్కుడు బ్రాహ్మణునకు తన రెండు కళ్ళూ దానం చేయలేదా? వారలా చేసి ఉత్తమ లోకాలను పొందారు. నీవు చివరి గడియల్లో అబద్ధం ఆడి అధమ లోకానికి ఎందుకు పోతావు?

సత్యం బ్రహ్మ స్వరూపం. సత్యాన్ని ఆధారం చేసుకునే రవి చంద్రులూ, ధర్మమూ, భూమి ప్రవర్తిస్తున్నై. సత్యవ్రతానికి పాలించే పద్నాలుగు లోకాల్లో లేదు. లే లే. లేచి నా వరాలు చెల్లించు" అంటూ సత్యస్వరూపం బోధించింది. సర్వనాశనానికి దారి తీస్తుందని శుక్రాచార్యులు చెప్పినా వినక సత్య వాక్యబద్ధుడైన బలి చక్రవర్తి లాగా.

సత్య వాక్య పరిరక్షణకై నిశ్చయించి, బింకం వదలి, మది వెగ్గిరి,"ఛీఛీ! నీవు భార్యవు కావు. నేను భర్తను కాను. ఈనాటితో నీ నా బంధం తెగి పోయింది. నిన్నూ, నీ గర్భవాసాన పుట్టినందుకు భరతుణ్ణీ సర్వ దేవతలు సాక్షిగా పరిత్యజిస్తున్నాను. నీవూ, నీ కొడుకూ, నాకు పిండోదకాలు ఇవ్వవద్దు ఇచ్చినా ముట్టను. రాత్రి నాల్గవజాము గడిచిపోతున్నది. గురు దేవులూ, మంత్రులూ, ముఖ్యులూ వచ్చి అభిషేక కార్యం నిమిత్తం నన్ను తొందరపెడతారు. వారే నా మృతదేహం చూచి పట్టాభిషేక సంభారంతో రాముని చేత ఔర్ధ్వ దైహిక క్రియలు చేయిస్తారు. నేను సత్యవాదినైతే రాముడే ప్రభువౌతాడు. భరతుడు రామభక్తుడై నిన్ను ద్వేషించి దూషిస్తాడు. నీవు సృష్టి వున్నంతకాలం దుర్మార్గురాలవుగా నిలిచిపోతావు" అని అంటుండగానే, కోళ్ళు తెల్లవారుతున్నట్లు కూయసాగినై. ఉద్యానాల్లో పులుగులు మెలమెల్లగా కదులుతున్న చప్పుళ్ళు వినవస్తున్నై.

"ఘనసౌధాంతర దీపమాలికలతో దైగూర్చి బుద్ధిః కాం
తిని బాసెన్ భరతేశు జీవితము రీతిన్, దైక మోసుట్లు వే
గను. నిద్రా ప్రమదాంధకార ఘనమూర్చ భూతలోకంబు వే
గను, చైతన్య సమృద్ధి ప్రాభవతి సాగెన్ స్వీయకర్మ స్థితిన్"

తెల్లవారితే తనకార్యం విఘ్నమవుతుందన్న భయంతో కైకేయి, భూపతిని తొందరపెట్టసాగింది. జీవన్మరణ స్థితిలో వున్న రాజు, సూతిలో వున్న వాని మాటలవలె అస్పష్టంగా, "కైకా! ప్రాణాలు కడ ముట్టుతున్నై. రాముణ్ణి పిలువు. ప్రాణం ఉందేమో చూస్తాను. లేదా-" అంటూ సొమ్మసిల్లాడు. అక్కడ పరిస్థం వాడు-

## రామాభిషేక సంభారాలతో వసిష్ఠుడు వచ్చుట

నిర్ణీత వేళకు ఆహ్నికాలు ముగించుకొని వలసిన వస్తువులు పరిచారకులు కొనిరాగా, ఆశ్రమం వదలి రథంపై అయోధ్యా నగరం సమీపించాడు. చక్కగా నీళ్ళుచల్లి ముగ్గులతో అలంకరించిన ముంగిళ్ళూ, పూవులతోనూ, మామిడాకులతోనూ తోరణాలుకట్టి, అరటిచెట్లస్తంభాలకు చేర్చి, రంగురంగుల గుడ్డలతో పై కప్పు నమర్చినట్టి పందిళ్ళూ, రాజ

లాంఛనమైన జెండాను పోలిన జెండాలు ఇండ్ల చివరి భాగాన ఎగురుతుండగా, సున్నంతోనూ, రంగులతోనూ శోభాయమానంగా వెలిగే గోడలపై రామ కథలు వ్రాసిన చిత్రాలూ, అడుగడుగునా నిరోధిస్తూ కన్నులకు పండుగ చేస్తుండే, చూస్తూ, విపణి వీథులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర మార్గాలు దాటి, హయహేషలూ, గజబృంహితాలూ, రథకింకిణీ నినాదాలు కర్ణ తర్పణం కావించగా రాజనగరంలో ప్రవేశించి, మందిరం చుట్టూ మూగిన ప్రేక్షకులను తప్పించుకొని, సుమంత్రునితో తనరాక రాజునకు చెప్పమని కోరాడు. పోతున్న సుమంత్రుణ్ణి ఆపి ఇలా అన్నాడు. "ఇవి గంగా జలఘటాలు. ఇవి సింధునదీ జలహేమ కలశాలు. అభిషేక సమయంలో యువరాజు కూర్చుండటానికి ఔదుంబర పీఠం (మేడికొయ్యతో చేసిన గద్దె) ఇదిగో. ఇవిగో సప్తధాన్యాలు. అవి క్షౌద్రమూ, మణులూ, గంధమూ, పెరుగూ, నెయ్యి, పేలాలు, దర్భలు. వీరు అష్ట కన్యకలు. అదిగో ఖడ్గం, మదపుటేనుగు, హయచతుష్కం (నాల్గుగుర్రాలు), పూలూ, పాలూ, తేనూ, ధనువూ, తెల్లగొడుగూ, తెల్ల వింజామరలూ, బంగారు చెంబూ ఇవిగో. ఇక ఇటు చూడు.

బంగారు రేకులు కొమ్ముల కమర్చబడి, వున్నతమైన మూపురం గల్గిన తెల్లని ఆబోతు ఇది. నాల్గుకోరలతో ప్రకాశించే సింహం అది. ఇంద్రుని ఉచ్చైశ్శ్రవాన్ని పోలినగుర్రం ఇది. సింహాసనం, పులితోలూ, అగ్నిహోత్రం. నటనటీగాయక మార్దంగిక సంతానం అటుప్రక్కగా నున్నై. వేశ్యలూ, భూసురులూ, ఆచార్యులూ, ఆవులూ, పుణ్యమృగములూ, పక్షులూ, వైశ్యక్షత్రియులూ ఇక్కడ వున్నారు. కొలువు కూటం రాజుకోసం ఎదురుతెన్నులు చూస్తున్నది. సూర్యుడు ఉదయించాడు. ముహూర్తం సమీపిస్తున్నది. నీవు పోయి ప్రభువును తొందరగా తీసుకునిరా" అంటూ చెప్పాడు.

రాజాంతఃపురంలో అనుమతిలేకుండా పోతుటీగైనా ప్రవేశించలేదు. మహామాత్యుడైన సుమంత్రుని రాకచూచి ద్వారపాలకుడు నమస్కరించి దారి ఇచ్చాడు.

మర్మమంత్రాలు తెలియని మంత్రి లోనికిపోయి, పూర్వవిధంగా

మంగళాశాసన పురస్కృతమైన వాక్యాలతో వృద్ధరాజును ఈ విధంగా మేలుకొలిపాడు.

"అనఘాయు ప్రభూ! రఘుకుల వంశభూషణా! రంజితమధురభాషణా! అజమహారాజ గర్భశుక్తిముక్తాఫలమా! అరివీర తూలప్రళయానిలమా! చంద్రునిరాకతో పొంగుసముద్రంలాగా ఉప్పొంగుము. ఇంద్రుణ్ణి మాతలి మేలుకొలుపురీతిని మిమ్ముల మేల్కొల్పుతున్నాను! సాంగవేదవిద్య బ్రహ్మను బోధించునట్లు మిమ్ము ప్రబోధిస్తున్నాను. సూర్యచంద్రులు భూదేవతను ప్రబోధించినట్లు మిమ్ము ప్రబోధిస్తున్నాను. లేచి, వివిధ మంగళాలంకృతులవై, స్వర్ణభూధరం వదలివచ్చే సూర్యునిలాగా వచ్చి లోకానికి దర్శనం ఇప్పించు. సోముడు, సూర్యుడు, ఇంద్రుడు, కుబేరుడు, మహేశ్వరుడు, వరుణుడు అగ్ని విజయం చేకూర్చి మిమ్ముల రక్షించుగాక. భగవతియైన రాత్రి తీరింది. ప్రభాతం మీరింది. చేయవలసిన కార్యాలు సిద్ధంగా వున్నై. పౌరజన పరివృతుడైన వశిష్ఠ గురుదేవులు సర్వ సంభారాలతో విజయం చేసి మీ రాకకై నిరీక్షిస్తూ కొలువుకూటంలో వున్నారు. రామాభిషేకానికి ఆజ్ఞ ఇవ్వండి.

కాపరిలేని పశువుల్లాగా, సేనాపతిలేని చతురంగ బలంలాగా, చంద్రుడులేని రాత్రిలాగా, ఆబోతులేని ఆవుల్లాగా, రాజులేని రాష్ట్రం శోభించదు." అని సార్థవాక్యాలతో రాజును సంబోధించగా, విని, నయనాలు కొలిమిగుంటలవలె నుండగా, గ్రహణచంద్రుడులాగా వదనం కనబడగా, వ్యక్తావ్యక్తస్వరంతో, "మంత్రీ! మర్మభేదనమైన మాటలతో ఎందుకు కష్టపెడతావు?" అని పొంగుకుపోయిన గొంతుకలో వచ్చు గురగురధ్వనితో అన్నాడు రాజు. అస్ఫుటంగా వినబడని మాటలలో కరుణరసం కట్టలుత్రెంచుకుని ప్రవహించసాగింది. సూక్ష్మగ్రాహియైన సుమంత్రుడు కూడా జరిగిన సన్నివేశాన్ని గుర్తించలేక వెలవెలపోతూ, నమస్కార పూర్వకంగా కొంచెం వెనుకకు మరలి రాజుయొక్క, కైక యొక్క వునికిని పరిశీలిస్తూ నిల్చున్నాడు. కుపితయైన కైక, వచ్చిన అవకాశాన్ని సార్థకం చేసే విధంగా, మహామాత్య గౌరవం మట్టిపాలు కాగా, ధర్మాధర్మ సత్యాసత్యాలను మధ్యేమార్గంగా చెప్పసాగింది.

# రాముణ్ణి కొనిరమ్మని కైక సుమంత్రునకు సూచించుట

"సూతా! రామార్థమైన విచారణతో రాత్రి పొద్దుపోయేవరకూ మేల్కొని ఇంతకు ముందే కన్నుమూశాడు. అందుచే బడలియున్నాడు. ఆ కారణంచేత నీకు సరియైన సమాధానం ఇయ్యలేడు. ఆయన ధోరణిని చూస్తే రాముణ్ణి తీసుకరమ్మని చెప్పినట్టుంది. నీవు పోయి వెంటనే రామచంద్రుణ్ణి తీసుకురా." ఆ మర్యాదా రహితంగా పల్కిన పలుకులకు మంత్రి విస్తుపోయాడు. రాజుగారి స్థితికీ, రాణి చెప్పిన మాటలకూ పొందిక లేదే అని సంశయించాడు. ఏమోయని సరిపెట్టుకొని సెలవు తీసుకుని అంతఃపురం దాటి సభా ప్రదేశానికి వచ్చాడు. రాగానే ఆకొలువు కూటంలో నిరీక్షిస్తున్న వారిలో ప్రముఖులు మంత్రి వద్దకు త్వరత్వరగావచ్చి, "అమాత్యవర్యా! ఆలస్యం ఏమిటి? ప్రభువేల రాలేదు. రామచంద్రులవారు ఎప్పుడు వస్తారు? సూర్యోదయమైంది. పునర్వసు గతించి పుష్యయోగం ప్రాప్తించింది. ఎన్నడూ రాజవంశంలో లేని లగ్నవేళాతిక్రమణం ఎందుకు జరుగుతున్నది? మమ్మేలనెందుకు రమ్మన్నారు? ఎంతసేపని ఎదురు చూస్తుంటాము? రాజు వచ్చినా సరే. రాకున్నాసరే. మేం రామభద్రుని తెచ్చి అభిషేకం చేస్తాము. గడియకాలం అవకాశమిస్తున్నాం. ప్రభువుతో మా మాటలన్నీ చెప్పి వెంటనే తిరిగిరా. చెప్పినట్లు చేస్తామని మరిమరీ చెప్పు" అంటూ ఉద్రేకంతో అన్నారు. మతిపోయింది మంత్రికి. ఎడమకన్ను అదిరింది. కారణం తెలియక కలత పడుతున్న మనస్సు చిక్కపట్టుకుని, మృదుమధురంగానూ, శాంతగంభీరంగానూ వారిని ఉద్దేశించి ఇలా పలికాడు.

"పూజ్యులారా! తొందరపడకండి. కుశాగ్ర బుద్ధిమైన ప్రభువు కాలాతిక్రమణం కలిగించడు. గురువులుచెప్పినట్లు,సంభారాలన్నీ సిద్ధంగా ఉన్నట్లూ, రావలసిన వారంతావచ్చినట్లు చెప్పటానికి చిన్నరాణి మందిరానికి వెళ్ళాను. ఆమె ప్రభువు కోర్కెగా యువరాజుల వారిని కొని తెమ్మన్నది. అందుకే వెళుతున్నాను. అయినా మీ మాటలు ముందుగా వినిపించి మరీ పోతాను" అన్నాడు. ఆ వాక్యాలు విని ప్రజాకలకలం సద్దుమణిగింది. సుమంత్రుడు అక్కడినుండి మరల రాజదర్శనార్థం వెళ్ళాడు. [illegible]

దైన ఘాసుకులాగా ఉండి, తలగడ నానుకుని వేడి నిట్టూర్పులు విడుస్తూ, భారంతో వ్రాలిన అరమోడ్పు కన్నుల్లో నుంచి ఒకటి రెండు దుఃఖాశ్రు బిందువులు నిల్వగా, కునికిపాట్లు పడుతున్న భూపతిని కనుగొన్నాడు. పౌరుల మాటలు వచించాడు. ఏమి సెలవన్నాడు. ఇవేమీ ఆయన తల కెక్కలేదు. రామచంద్ర రహితంగా తిరిగి వచ్చిన మంత్రిని మాత్రం చూడగలిగాడు. గొంతు సవ్వడి గుర్తుపట్టి "సుమంత్రా! నేను నిద్రావస్థ లోనూ, జాగ్రదవస్థలోనూ లేను. రామునికొనిరాక ఎందుకు తిరిగివచ్చావు" అని మాత్రం ప్రశ్నించాడు. "ఇప్పుడైనా వెంటనే వెళ్ళి తీసుకుని రా. జాగు చేయవద్దు" అని అనగలిగాడు.

ఆ ఆజ్ఞనందుకొని మనోవేగంతో నిష్క్రమిస్తూ, అయోధ్యా నగరా లంకారాలను దర్శిస్తూ, ప్రజావాణికి హర్షిస్తూ, గోడలకాంతి వెండికొండను హసించగా, నడుమనున్న బహువిధములైన హర్మ్యాలు దేవేంద్రుని నగ రాన్ని ధిక్కరింపగా, ఉన్నతసౌధశిఖరాగ్ర భాగాలు రామ పట్టాభిషేక వార్తను కేతన స్పందన రూపంగా ఊర్ధ్వ లోకాలకు తెల్పుతుండగా, తీర్చి దిద్దిన అరుగులతో, శిల్పకళ వుట్టిపడేలా చెక్కి ఎత్తయిన దిమ్మలపై నిల్పిన రాజమూర్తులతో, అందమైన బంగారు బొమ్మలతో, వింత వింత పక్షులతో, నలువైపుల ఎత్తుగా పెరిగిన వృక్షాలకు అల్లుకొని, చక్కగా వికసించిన పూలతో చూడముచ్చటగా నున్న వన మధ్యంలో భూత శరీరంలో ప్రేలాడేవసుకదండల్లాగాతచ్చి ఉన్న గుబ్బలతో బలిష్ఠంగాఉన్న తలుపులుగలిగి, అంబారీతో ఏనుగు ప్రవేశించగలిగినంత ఉన్నతమూ, విస్తీర్ణము గలిగి, ముక్తాహార, పుష్పహార, పత్రహారాలతో అలంకరింప బడిన ద్వార ప్రదేశాన్ని దాటి, విచ్చుకత్తులతో పహరా ఇచ్చేభటవర్గ సముదాయాన్ని గమించి, రామ దర్శనార్థం వచ్చిన జన సమ్మర్దాన్ని తప్పుకొని, మిత్రులు ఆసీనులైన శాల గడిచి, కాన్కలతో ఎదురుచూస్తూ ఉన్నత పీఠాలపై కూర్చున్న రాజవంశాన్ని అభినందిస్తూ, అంజలి గ్రహిస్తూ కక్ష్యాంతరాలు దాటుకొంటూ, రామ ప్రాసాదం చేరుకున్నాడు. ఖడ్గ పట్టిస ప్రాస తోమర భిండివాలాలు ధరించి, అప్రమత్తులై పోతు టీగను లోనికి పోనీక కాచుకొని ఉన్న దృఢకాయులైన భటులనుస్కా

రాలు అందుకుని, వృద్ధ వేత్రహస్తునితో తన రాక తెల్పుమని చెప్పాడు. ఆతడు పరుగునపోయి "సుమంత్రులు తమ దర్శనార్థం వచ్చా"రని మనవి చేసుకుని, ప్రవేశానుమతి పొంది, సగౌరవంగా లోపలికి ఆహ్వానించాడు.

వినయ సంతోషాలు ముప్పిరి గొనగా, అంజలి బంధంగా లోనికి పోయి, కస్తూరికా చందనాది పరిమళ ద్రవ్యములు అలదుకొనటం వల్ల ఘ్రాణతర్పణం కావిస్తున్న శరీరం కలవానినీ, కరకంకణ ఝణత్కార మేదురంగా, వింజామర వేస్తున్న జానకీదేవి వెనుకగా నున్నవానినీ, జానకి పక్క ఉండటంచేత, చిత్రానక్షత్రయుక్త చంద్రుణ్ణి హసించు తున్నట్లు శోభించుచున్నవానినీ, నైజప్రభతో సర్వసాక్షిని పోలిన వానినీ, సర్వసౌభాగ్యాలకు కుబేరుణ్ణి ధిక్కరించే వానినీ, సర్వదేవతా నమస్కారార్హుడైన వానినీ, కాబోవు యువరాజునూ కని "కౌసల్యా సుప్రజా! రామా! నీ పినతల్లి మందిరంలోవుండి జనకుడు నీ రాక వాంఛించినాడు" అని విన్నవించాడు. వచ్చిన మంత్రి ముఖ్యునికి అభ్యుత్థానంచేసి, ఆదరించి, కుశల ప్రశ్నచేసి, కూర్చుండ నియమించిన శ్రీరామప్రభువు, సుమంత్రుని మాటలు విని, సహధర్మచారిణి, నారీలోకమణి, జనకదుహిత సీతనుచూచి, కైతకశిఖా లీలాయితస్మిత మనోజ్ఞమైన వదనంతో, "జానకీ సుమంత్రుల వారి మాటలు విన్నావుకదా. తల్లిదండ్రులు నా యోగక్షేమ విచారణలో, యౌవరాజ్యాభిషేక విషయాన్ని మిక్కిలిగా భావించి ఉంటారు. నాపినతల్లి ఆ విషయ లో నా తండ్రిని తీవరించి ఉంటుంది. సమయం ఆసన్నమవుతూంది. అందుకనే త్వరగా, ఆత్మస్వరూపంగా భావించే అమాత్యుణ్ని పంపించారు. నేనిప్పుడే పోయి వారి దర్శనం చేసుకొని త్వరలోనే వస్తాను. అంతవరకు నీవు అంతఃపురంలో చెలికత్తెలతో ప్రొద్దుపుచ్చు" అని పలికి, గుహలో నుంచి వెలికివచ్చే సింహకిశోరంలాగా ముందుకు రెండడుగులు వేశాడు రాముడు. ద్వారం వరకూ వెనుకగా వచ్చి సీత, హృదయేశ్వరుని కన్నార చూచి "ప్రాణేశ్వరా! నూరు యజ్ఞములు ముగించిన శచీపతికి ఇంద్రపదవి చేకూర్చే సమయంలో విధాత చేసినట్లు, వశిష్ఠ వామదేవాది మహర్షులు ఆశీర్వదిస్తుండగా, మామగారు మిమ్మభిషిక్తుణ్ని చేయుగాక! దివ్యతేజంతో, దీక్షతో, వ్రతసంపన్న

తతో, శుచులై, అజినధరులై, హరిణశృంగం హస్తంలో ధరించి సింహాసనస్థులైన మిమ్ము సేవించుటకు వామపార్శ్వాన్ని గ్రహిస్తాను. సర్వ శుభములు సర్వదేవతలు మీకు సమకూర్తురు గాక! ఇంద్రుడు తూర్పు, యముడు దక్షిణం, పడమర వరుణుడూ, ఉత్తరం కుబేరుడూ, మిమ్ము రక్షించుచుందురుగాక!!!" అని మంగళాశాసనం చేసింది. ఆమెకు లోపలికి పోవుటకు అనుజ్ఞ ఇచ్చి రాముడు బయలుదేరాడు.

## రాముడు కైకేయి మందిరానికి పోవుట

పరిచారకులు దారి చూపగా, మహామాత్యు లనుసరించగా, సీతాదేవి ద్వార ప్రదేశంలో నిల్చి కటాక్ష ప్రసూనాలు వర్షించగా, వందిమాగధులు కైవారాలు చేయగా, ప్రథమ కక్ష్యాంతర ద్వార ప్రదేశంలో ధనుర్బాణ ధారియై నిల్చి వున్న లక్ష్మణుని సమీపించి, అంజలి అందుకొని, తన్ననుసరించి రాగా, మధ్యలో కాచుకుని ఉన్న హితైషిబృందు ఆదరించి, సన్నద్ధమై ద్వారం ముందు ఉన్న రథాన్ని చేరుకున్నాడు. అనంతరం, సుకుమార సుందరంగా అలంకరించబడిన, నడుమనున్న, వ్యాఘ్రాజినాబద్ధపీఠంపై, సౌమిత్రి చేయూతగా, ఉదయపర్వతం పైకి చంద్రుడు అధిరోహించినట్లుగా అధివసించాడు. సుందరీమణులు ఇరువైపుల వీచోపులు వీవగా, వెనుక సౌమిత్రి అనిమిషుడై రక్షించుచుండగా, చూడవచ్చిన పౌరసామంతజనము "జయజయ, రఘుకులాభరణా! జయజయ సూర్యాన్వయ పయః పారావార రాకా సుధాకరా! జయీభవ. విజయీభవ" అంటూ స్తోత్రపాఠాలు చేస్తూవుండగా, తురగారూఢులై, ఇరుపార్శ్వాలా సేనాపతులు నడుస్తూండగా, మంగళ వాద్య స్వనాలు బోరుకొనంగా తేరు వీథులవెంట సాగిపోతూంది. గవాక్షాలనుంచి అయోధ్యాపుర మహిళామణుల అక్షతలు, పూలుజల్లుతూ, "శ్రీరామచంద్రా! కౌసల్యా దశరథులు పూర్వజన్మలో ఎంత సుకృతం చేశారో నీవంటి సద్గుణాభిరాముని కొడుకుగా పడయుటానికి? సీతామహాలక్ష్మి వూహకందని ఎన్నినోములు వెనక నోచి మన్మథమన్మథుడవైన నిన్ను భర్తగా వరించిందో? అయోధ్యావాసులు తరతరాలుగా ఎంత వాంఛాతపస్సు చేశారో నీ యట్టి చల్లని

ప్రభుపాలనలో వుండటానికి!" అంటూ క్రిందికిదిగి కర్పూరహారతులు పడుతున్నారు. పండు ముత్తైదువులు, వృద్ధులు రామచంద్రుని అనేక రీతుల ఆశీర్వదిస్తున్నారు. తన్ననుసరించి వస్తున్న ప్రజాసమూహాన్ని ఆపి, చేయెత్తి నమస్కారం చేస్తూ, రాముడు ఇలా అన్నాడు.

"పూజ్యులారా! నాపై మీరు చూపిస్తున్న ఆదరాభిమాన గౌరవాలకు ఎంతో సంతోషిస్తున్నాను. మా పెద్దలు మిమ్ముల ఏ విధంగా చూసుకున్నారో నేనూ ఆవిధంగానే చూసుకుంటాను. దైవప్రసాదితమైన నా సర్వస్వం మీ సుఖసంతోషాలకే వినియోగిస్తాను. తండ్రిగారి పిలుపుపై పోతున్నాను, మీరు దయతో ఇక్కడే నిలవండి. తిరిగి మళ్ళీ మిమ్ముల కలుసుకుంటాను" అన్నాడు. ఆ మాటలకు ప్రజలు వుబ్బితబ్బిబ్బులైనారు. రథం రాజప్రాసాదం చేరింది. సుభటరక్షితమైన మూడు కక్ష్యలు దాటి, ముఖ్యుల నెల్లర అక్కడ నిలవరించి, మిగిలిన రెండు కక్ష్యలు కాలినడకతో చని అంతఃపురం ప్రవేశించాడు. ప్రజలు వర్షానికి వాసకోయిలలలాగా వేచివున్నారు.

## తండ్రి దయనీయస్థితికి రాముడు వగచుట

రాముడు ప్రవేశించునప్పటికి రాజు కన్నులవెంట అశ్రువులు రాలుస్తూ, వాడుబారినవదనంతో, ఆసనంపై పెదమొగంతో కూర్చొని వున్నాడు. కైక రాముని రాకకు ఆత్రంగా చూస్తూ ప్రక్కగా నిలబడి వున్నది. వచ్చిన రాముడు ముందుగా తండ్రికీ, తర్వాత పినతల్లికి నమస్కారాలు చేశాడు. రాజు "రామా!" అని మాత్రం అనగలిగాడు. ఆపై కంఠం రుద్ధమైంది. మాట ఆగిపోయింది. స్మృతి తప్పింది. ఆసనంపై వాలిపోయాడు. ఈ దుర్భరస్థితి చూచిన రాముడు నిర్విణ్ణుడైనాడు. కారణం తెలియక కలతలో మునిగాడు. దుఃఖవేగంలో కల్మితుడైనవాని, రాహుగ్రస్తుడైన సూర్యునివలె వున్నవాని, పెనుగాలి విసురున క్షుభితమవుతున్న సముద్రాన్ని పోలినవాని, అబద్ధమాడిన సన్న్యాసివలె వున్నవాని, లోనిబాధ వెలిపుచ్చలేక దీర్ఘనిశ్వాసాలు వదులుతున్నవాని ప్రాణంకంటే ప్రాణంగా పెంచినవాని, తన ఎడబాటు సహించలేక అనృతదోషానికి

కూడ పొంప్పడపోయినవాని, అతివృద్ధతలో యజ్ఞఫలంతో సంతానాన్ని సాధించిన వాని, ఎన్ని కార్యాలల్లో నిమగ్నుడైనా తన రక్షణలో విస్మృతి ఎఱుంగనివాని, తండ్రిని తాను మున్నెన్నడు చూడని ఈ దుస్థితిలో చూడ వలసి వచ్చినందుకు పామును తొక్కినవాని వలె భయంతో వణికిపోయాడు. "నారాక విన్నమాత్రాననే ఒడలు కన్నులుగా చేసి చూసేతండ్రి, ఎదుట ఉన్నా మాటాడించడేమి? కన్నెత్తి చూడదేమి? నన్ను మొదట చూచిన చూపులో అంత దైన్యం గూడు కట్టుకున్న దెందులకు? నా వల్ల ఏమి లోపం వచ్చింది? హఠాత్తుగా శరీరారోగ్యం చెడిందా? ఆ లక్షణాలేవీ గోచరించటంలేదు. ఏదో నిగూఢమైన బాధ మనస్సులో ఉన్నది. అది నా కనిష్టకారణం కాగూడదేమో. అది చెప్పటకు ఇష్టం లేదేమో" అని పలు విధాల రామచంద్రుడు విచారించాడు. చివరకు తప్పుతాను చక్కపరచుకుని కైకతో—

## రాముడు తండ్రి దీనస్థితికి కైకని కారణం అడుగుట

మహాఫలాన్ని కోలుపోయిన వ్యక్తిలాగా దీనాతిదీనవదనుండై, "అమ్మా! నా తండ్రి ఈ స్థితికి కారణం ఏమిటి? మనోవాక్కాయకర్మల్లో తండ్రిగారికి ఎపుడు తప్పుచేయలేదు. నన్ను రమ్మని కబురుపంపి, వచ్చిన నన్ను చూడదేమి? అప్రసన్నుడుగా వుండవలసిన అవసరం ఏమి వచ్చింది? ఎంతో వుల్లాసంగా అంతఃపురానికి వెళ్లాడని వేగరులు చెప్పారు. శరీరారోగ్యం చెడిందా? "క్షణం చిత్తం, క్షణం విత్తం, క్షణం జీవితమావయోః" అన్నట్టు. లేక తమ్ముల విషయంలో ఏమైనా అశుభవార్త అందిందా? అమ్మగారిపట్ల ఆగ్రహం వచ్చిందా? ఒకవేళమాట వరుసలో మాట నెగ్గించుకునే తలంపుతో పరుషోక్తం నీవు పలుకలేదుకదా? నా తండ్రి దైన్యస్థితి నేను చూడలేకున్నాను. దయతో సత్యం దాచకుండా చెప్పు. ఎంత అనిష్టమైన విషయం కాకపోతే, మేరునగంవలె గంభీరుడైన తండ్రి వాడిన తామరపూవువలె అవుతాడు. ఇంతను మూంమాసుము" అని వేడుకొనగా, రామునితో కైకేయి—

## కైకేయి జరిగిన సంగతి రామునకు చెప్పుట

"రామా! ఈయనకు నీపై కోపములేదు. నీ వాయనపట్ల లోప మేమీ చేయలేదు. శరీరంలో అనారోగ్యం అంతకంటే లేదు. ఈయన ఎప్పుడూ నీ క్షేమం, నీ పురోభివృద్ధీ కోరుతునే వున్నాడు. అయితే ఇప్పటి ఈ స్థితికి అవి ఏవీ కారణాలుకావు. మా ఇద్దరిమధ్య జరిగిన సంఘర్షణలో ఒక నియమానికి బద్ధుడైనాడు. అది నీ కప్రియం కలిగించేది. ప్రేమ పాత్రుడవైన నీకు ఆ సంగతి చెప్పుటకు నోరాడుట లేదు. చెపితే నీవు అందుకు ఏమంటావో అని తికమక పడుతున్నాడు. పెండ్లి అయిన కొద్ది కాలానికి, మేం దేవదానవ యుద్ధంలో ఇంద్రునిపక్షం యుద్ధం చేయటానికి వెళ్లాం. ఆ సమయంలో శత్రువు ప్రయోగించిన దివ్యాస్త్రం తాకి మూర్ఛ పోయినాడు. ఆ వైరి సమీపించులోపల నేను రథం దూరంగా తీసుకుని పోయి ఈయన ప్రాణాలు కాపాడాను. అందుకు సంతోషించి నాకు రెండు వరాలు ఇచ్చాడు. అవి ఇప్పుడు కోరుకుంటే, ఎగుడుదిగుడుగా మాట్లాడి ఇట్లయినాడు. ముందు ఆ వరాలు ఇస్తానని నీపై ప్రమాణంకూడా చేశాడు. ఇప్పుడు ఓడిచెరువుకు కట్టసరమ్మత్తు చేసినట్లు ప్రవర్తిస్తున్నాడు. నీ వాయన కోరిక చెల్లిస్తానంటే నేనే చెపుతాను.

శరీరా లెన్నడూ శాశ్వతం కావు. అందులో మనం మానవులం. సత్యధర్మాలు ఎప్పుడూ నిల్చి వుండేవి. వాటిని ఆచరించినవారికి తమ వలె స్థిరత్వం ప్రసాదిస్తాయి. ఈ విషయం ఇక్ష్వాకువంశ ప్రభువులకు వివరించి చెప్పపనిలేదు. హరిశ్చంద్రుడు సత్యవాక్య పాలనకు, భార్యా పుత్రుల విక్రయించాడు. తానే కాటికాపరి వృత్తిలో చేరాడు. సగర సుతులు తండ్రియాజ్ఞమేరకు ప్రాణహింసచేసి కపిలకోపానలానికి భస్మమై పోయారు. అందరు ప్రభువులూ ఆదర్శకంగా జీవించినవారే. ఇంత వరకు నీ తండ్రికూడ అటువంటి ప్రతిష్ఠనే గడించాడు. కృతయుగ ధర్మాన్ని త్రేతలో ప్రవర్తింపచేయటానికి ప్రయత్నించాడు. ఇప్పుడు ఆ మనస్థైర్యంలేదో, అన్నమాటను తప్ప తలిచాడో అర్థంకావటం లేదు.

ఈయన చివర నాతో అన్నమాట వినిపిస్తాను. నిన్ను పిలిపించమని. ఆ మాటలో అర్థం నీకు చెప్పాలనే భావం ఇమిడివుంది. నీవు తండ్రి మాటా, వంశగౌరవం నిలబెట్టుతానంటే నేను ఆయన నాకు ఇచ్చిన వరాలేమిటో వివరిస్తాను" అంటూ, మానవత్వాన్ని కోలుపోయి, నిర్దాక్షిణ్యంగా, నర్మగర్భంగా, స్వకార్య సాధనకు పనికివచ్చేటట్లుచెప్పి ఊరుకుంది. ఆ అనటంలో, "తండ్రిమీద నీకు గౌరవంవుంటే, నీవు గుణవంతుడవూ, పూర్వులవలె సత్యాన్ని పాలించేవాడవూ అయితే నే చెప్పినట్లుచేయి" అనే అధికారికదర్పం ఇమిడ్చింది. సాక్షాత్తు పరమేశ్వర స్వరూపుడూ, మాయామానుషధారీ, మానవధర్మ ప్రవర్తకుడూ అయిన రామచంద్రుడు, కైక పల్కిన పరుషవాక్యాలకు విస్మితుడై, తనకు రానున్న అనర్థానికి విచారపడక, పినతల్లి పైశాచిక వాక్యాలకు బాధపడక, నిశ్చలసముద్రంలాగా, శరత్కాల నిర్మలజలపూరిత సరోవరంలాగా, కార్తికపూర్ణిమనాటి వెన్నెలలాగా, కోకిల కలకూజితంలాగా, గంభీరంగా, స్వచ్ఛంగా, స్పష్టంగా, మధురంగా ఇలా అన్నాడు.

## తండ్రిమాట తలదాల్తునని రాముడు ప్రతిజ్ఞ చేయుట

"అమ్మా! నీవేల అనృత దోషానికి పాల్పడతావు? నేనెరుంగనా? జనకుడు వేరూ, జనని వేరూ అవుతుందా? ఈ ఇద్దరూ వాగర్థాలవంటివారు. చంద్రుడూ, చంద్రికవంటివారు. పూవూ, తావీవంటివారు. విద్యుత్తంత్రీ యుగళం వంటివారు. ఈ ఇరువురి ఆత్మస్వరూపమేకదా సంతానం? ఈ నా జన్మకు కారణభూతులైన పితృదేవుని మాటనే నీవు చెప్పుతున్నప్పుడు, కాదని బిడ్డలంటారా? తండ్రి ఆనందం కోరని తనయులుంటారా? లోకం అంతా పరిపాటిగా మన్నించే తండ్రి ఆజ్ఞ, రఘువంశ్యుడు, అందులో దాశరథి తిరస్కరిస్తాడా? ఈ ఊహ నీకు రావచ్చునా అమ్మా? అది ఎట్టిదైనా తప్పక ఆచరిస్తాను. నాకు కావలసింది నా తండ్రి ఆలింగనం. కుశలం. అంతేకాని, ఈ క్షుద్ర దేహముకాదు. నీ మాటల్లో నేను చేస్తానో చేయనో అనే సంశయం ఉన్నట్లు స్ఫురిస్తున్నది. ఇదిగో తల్లి నా ప్రతిజ్ఞ విను.

నా తండ్రి "రామా! ఇది నా ఆజ్ఞ. నీవు చెల్లించు" అంటే,

దవానలజ్వాలల్లో దూకుతాను. పర్వతాగ్రంనుంచి పాతం అవుతాను. కాలకూట విషాన్ని గడగడ తాగుతాను. ఉత్తుంగతరంగ సంక్షుభితంబైన సముద్రంలో మునుగుతాను. కన్నతండ్రికికాని శరీరం కాల్చనా? ఆయన ఆనందానికి నా అర్ధాంగినైనా విసర్జిస్తాను. ఆత్మీయుల నందర్నీ పరిహరిస్తాను. అమ్మా! రాముడు, నీచేత పెంచబడి ధర్మసూత్రాలు తెలుసుకుని ప్రవర్తించే రాముడు తండ్రిమాట జవదాటడు. అన్నమాట చెల్లించక తీరడు. ఈ నా మాటకు సూర్యచంద్రులు సాక్షి, నా కన్న తల్లి సాక్షి, తండ్రి సాక్షి, నీవు సాక్షి. సందేహించక చెప్పమ్మా చెప్పు. ఇప్పుడే ఆ పనిచేసి తండ్రినీ, నిన్నూ సంతోషపరుస్తాను" అన్నాడు. శ్రీరాముని ప్రతివాక్యం వృద్ధరాజును శస్త్రంచేయసాగింది. బుద్ధిలేక ఇచ్చిన వరాలూ, చేసినబాసా, ప్రాణసమానుడైన పుత్రుని ఎడబాటూ జీవచ్ఛవంగా చేసినై. చెవులు విన్నవి. కనులు చూస్తున్నవి. కాని, నోరు మాత్రం మూగదై పోయింది. తనపై బిడ్డకుగల భక్తి ప్రేమానురాగాలు భావించుటకైనా, మనస్సు తన అధికారంలోలేదు ఘోరాతిఘోరమైన ప్రతిజ్ఞ చేశాడు. ఇక తానుకూడ నిరోధించలేడు. ఇంత విపత్తుకు మూలమైన తానింకా ఎందుకు బ్రతికివున్నాడు? తన ప్రక్కనున్నది పూర్వపు కేకయరాజు కూతురేనా? ఆ రూపంతోవున్న తన దుర్గ్రహచారమా? కనలేక, వినలేక, పొమ్మనలేక, ప్రవాహంలోబడి పోతున్న ప్రాణి ఒక్కసారి సుడిగుండంలోబడి మునిగినట్లు "రామా! రామా! రామా!" అని మనోవ్యథతో మంచంపై తూలిపడ్డాడు. శ్రీరాముడు ఆ పాటుచూచి భయవిహ్వలుడయ్యాడు. కాని, కైక మాత్రం కదలలేదు, మెదలలేదు. కన్నుల్లో కాఠిన్యం పెరుగుతున్నదేకాని తరగడంలేదు. రాజుపాటును చూడకుండా రామునివంక చూస్తూ, "చిన్నవాడవైనా లోకం మెచ్చేమాట మాట్లాడావు. ఇప్పుడు అనుమానం లేకుండా చెపుతాను. ఆనాడిచ్చిన రెండువరాలూ తీరుస్తానని నాకు ముందుగా నీమీద ప్రమాణంచేసి చెప్పాడు అందుమీదట మొదటిది భరతపట్టాభిషేకం, రెండోది పద్నాలుగేండ్లు నీ వనవాసం కోరుకున్నాను. ఇప్పుడు భరతుడు లేడు కనుక, నీవు వెంటనే అయోధ్యవిడిచి అడవికి

చెప్పు. ఇదే నీ తండ్రి చెప్పలేక పెడమొగం పెట్టుకుని దుఃఖిస్తున్నాడు" అన్నది.

ఆ మాటలకు ప్రత్యుత్తరంగా రాముడు ఇలా అన్నాడు. "తల్లీ! దీనికింత కావలెనా? నన్ను పిల్చి తండ్రి "నేను భరతునికి పట్టం కడతా నని ఒక్కమాట అంటే సరిపోదా? నా శరీరంమీద వారికి సర్వాధికారం ఉన్నదికదా? నేనుకూడా సంతోషంతో దగ్గరవుండి ఆ వేడుక పూర్తిచేసి పోనా? ఇప్పుడైనా మించిపోయింది ఏమున్నది? తమ్ముని పిలిపించి అభిషేకం చేయిస్తాను. తర్వాత నీ ఆజ్ఞానుసారం అడవికి పోతాను." అందుకు కైక "అలా కాదు. నా సంగతి నేను చూచుకుంటాను. నీ విప్పుడే వెళ్ళిపోవాలి. నీవు ఉన్నంతవరకు ఈయన నాతో మాట్లాడడు. పైపెచ్చు ఇంకా బాధ పడతాడు. నీ తండ్రి క్షేమాభిలాషివైతే, నీ మాట నీకు ప్రమాణమైతే, జాగు సేయకుండా తత్క్షణం తరలిపో" అని తిరిగి చెప్పింది. ఆ మాటలు విన్న ముసలిరాజు "ఛీ! ఛీ! ఇది ఆడుదా? హద్దు విడిచిన మసరమా?" అనుకుంటూ లేవపోయి పూర్తిగా స్పృహ కోల్పోయాడు. తండ్రిపాటు చూచి రామచంద్రుడు, బలిష్ఠంగా ఉన్న తన రెండు బాహువులతో శయ్యపై పడుండబెట్టి, చబుకుదెబ్బకు చలించిన ఉత్తమాశ్వంలాగా, వెంటనే పోవుటకు నిశ్చయించుకుని, నిర్లిప్తుడై, "అమ్మా! ధన సంపాదనకై పరమార్థంగా భావించను. ఒక్క క్షణం కూడా ఇక ఇక్కడ ఉండను. సత్యధర్మాలకంటే నాకు ప్రియమైనవి ఈ లోకంలో ఏవీ లేవు. ఈ అల్పమైన పనిచేయటం అనగా ఎంత? తండ్రికి ప్రియమైన పనికోసం నా ప్రాణాన్ని కూడా లెక్కచేయను. స్వయంగా జనకుడు చెప్పకున్నా, నీ మాటనుబట్టి ఇప్పుడే పోతున్నాను. ఇంతవంత పెట్టి, మా భర్తను, భర్తను బాధించక, ఇదే నాతో అంటే అప్పుడే నీ మనోరథం చెల్లించేవాడిని. ఇప్పుడేపోయి మాతృదేవి అనుజ్ఞ కొని, ఆత్మేశ్వరిని ఓదార్చి, నీకు సంతోషకరంగా అరణ్యానికిపోతాను. ఈమాత్ర కాలం ఉన్నందుకు క్షమించు. అమ్మా! నేనంటే దైవంగా చూచుకునే తమ్ముడితో నా మాటలుగా ఇలా చెప్పు. "సోదరా! ఉద్రేకివి కాకుండా, తల్లిదండ్రుల రక్షిస్తూ, ప్రజల కన్నబిడ్డల్లాగా పాలించు" అని. ఒకవేళ లోపమైనా చిన్నతనంచేత వస్తే నీవు సద్దుబాటుచేసి, సనాతన ధర్మం

సంరక్షించు. ఇక నాకు సెలవు" అని అంటూ, తండ్రి పాదాలను వంగి స్పృశించి, కన్నుల కద్దుకొని, పినతల్లికి నమస్కారం చేసి వాకిలివైపు మళ్ళాడు. మంచంపై తెలివితప్పి పడినరాజు, "హా రామా రామా రామా" అని పెడబొబ్బ పెట్టాడు. ఆ ఆర్తస్వరం చెవులకు సోకకుండా గబగబ మెట్లు దిగి క్రిందికి వచ్చాడు.

రాముని నిర్గమనంతో శుద్ధాంత కాంతలు, దశరథ దేవేరులు గొలుగొలున ఏడుస్తూ, "అరచేతిలో నున్న మధురఫలాన్ని అనుభవించక నేలపాలుచేసిన ఈ రాజు ఇక కైక మాటపై ఎంతకైనా తెగిస్తాడు. ఎన్ని ప్రాణాలైనా బలిగొంటాడు. కన్నకొడుకునే కానలపాలు చేసిన ఈ వృద్ధరాజు, పరమసాధ్వి, పట్టపురాణి, కౌసల్యాదేవిని మాత్రం కనికరిస్తాడా? ఈ చిన్నరాణి సవతి మత్సరంతో ఆమెను సాధించదా? అయిపోయింది ఈనాటితో అయోధ్యానగర శోభ. ఎన్ని జన్మాలెత్తినా, రామయ్యవంటి బిడ్డడు ఏ తల్లికి కలుగుతాడు? ఇక మన గతి చెప్పనక్కరలేదు" అని అంటున్న మాటలు వినికూడా రాజు ఏమీ అనలేక అక్కడనే పడివున్నాడు. శ్రీరాముడు ఆ మాతృమూర్తుల ఆక్రందనం విని, వస్తున్న వికారాన్ని త్రోసిపుచ్చి, క్రోధంతో కంపించిపోతున్న సౌమిత్రిని వెంటబెట్టుకొని, తన పట్టాభిషేకానికై అమర్చిన సంభారాలకు ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించి, వాటిపై చూపులు నిలుపక, రాజోచితాలైన ఛత్రచామరాదులూ, రథం, సేవకవర్గం విసర్జించి, చుట్టూ మూగిన ప్రజలకు సమయోచితంగా సమాధానాలు చెప్పి, పాదచారియై మాతృదేవి మందిరాభిముఖంగా పోతున్నాడు.

ఏమి రాముడు? ఏమి ఆకృతి? ఇంత విషాద ఘట్టంలోకూడా ఆ సుందర వదనారవిందం శోభ కోల్పడలేదు. ఆ నడకలో తొట్రుపాటు లేదు. ఆ గంభీరతలో వెలితిలేదు. ఆ మాటలలో ఆప్యాయత పోలేదు. ఆ మందహాసంలో ఆకర్షణ తగ్గలేదు. లక్ష్మణుని క్రోధాగ్నిలో ఆ శాంత వారాశి తప్తం కాలేదు. కరిణీ సహస్రంతో స్వేచ్ఛగా అడవిలో పోతున్న మదమాతంగంలాగా విలాసంతో పోతున్న రాముణ్ణి సమావేశమైన జనులు కన్నార్పకుండా చూడసాగారు. వద్దన్నా వెంట వస్తున్న పౌరులను మంచిమాటలతో నిలువరించి, ప్రథమ ద్వితీయ కక్ష్యలుదాటి,

వృద్ధ కంచుకిని పిలిచి తన రాకను తల్లితో చెప్పమన్నాడు.

పుత్రుని అభివృద్ధి కోరి శ్రీరంగనాథుని మనసారా పూజించిన పుణ్యశీల, ధవళవస్త్రధారిణియై, విధివిహితంగా వ్రతపరిసమాప్తి కావించిన ధన్యజీవి, మంత్ర సహితంగా, మంగళాకరమైన అగ్నిహోత్ర కార్యం ఆచరించిన అమలచరిత, నిష్ఠురనిష్ఠలో జీవితశేషాన్ని భగవంతుని పాదాల కర్పించిన భవ్యమూర్తి, పట్టపుదేవేరిననిగాని, సకలజన నయనానందకరుడైన రాముని తల్లిననిగాని గర్వపడని సౌజన్యవతి, సపత్నుల ద్వేషించుటగాని, భర్త సేవలో విముఖతగాని కలలోనైన ఊహించుటకు వీలులేని అప్రతిమాన పతివ్రతామతల్లి రాముని రాక విని ఆనందంతో వాకిలిదాకా వచ్చి ఎదురుచూస్తున్న కౌసల్యాసాధ్విని చేరవచ్చాడు. చేతులు చాచి ప్రేమపూర్వకంగా ఆలింగనంచేసుకుని, తల నిమిరి, "వృద్ధుల యొక్క, మహాత్ములయొక్క, ధర్మవిదులయొక్క, రాజర్షులయొక్క దీర్ఘాయుష్షు, కీర్తీ నీకు కలుగుగాక! దయాసత్యశౌచ ధర్మాదులు నీయందు నిల్చుగాక. సోదరులు నిన్ననుసరించి రాజకార్య పరంపర చక్కబెట్టగా, పూజ్యులూ, కడుయోగ్యులూ, పెద్దలూ, సమయజ్ఞులూ అయిన మంత్రివరులు మంత్రాంగం జరిపించగా, వామదేవ వశిష్ఠాది కుల గురువులు రక్ష కవచంగా ఆశీర్వాదం చేస్తుండగా యౌవరాజ్యాభిషిక్తుండవై, సత్యప్రతిజ్ఞ గల తండ్రిని సేవిస్తూ పూర్వులవలె బహు కాలం ప్రజాపాలనం చేయుదువుగాక. లగ్నవేళ సమీపించనున్నది. ఫలాహారం తీసుకొని కొలువుకూటానికి వెళ్ళు" అని బంగారుపీట వాల్చింది. వేసిన పీటను చేతితో తాకి, సిగ్గుతో మొగం క్రిందికి దించి, రెండు పాదాలు పట్టుకొని నమస్కరించి ఇలా చెప్పసాగాడు.

## రాముడు తల్లితో తన అరణ్యవాసప్రయాణం చెప్పుట

"అమ్మా! ఇంత దయార్ద్రహృదయవైన నీకేమని చెప్పను? చెప్పకపోవుటెట్లు? ఈ వార్త తమ్ముడు లక్ష్మణునకు, నీ కోడలికి తీరని వ్యధ కలిగిస్తుందని తెలిసికూడ చెప్పక తీరదు. తండ్రి సుమంత్రునిచే పినతల్లి యింటికి పిలిపించి, భరతునకు పట్టాభిషేకం, నాకు పద్నాల్గేండ్లు దండకారణ్య వాసం విధించాడు. ఇప్పుడే పోవాలి. అందుకే నీవు కూర్చిన

సుఖాసనం స్పృశించాను. నాకు సెలవిస్తే పోయివస్తాను" అన్నాడు. ఆమాట విన్నదో లేదో, దివ్యలోకంనుంచి పడిన దేవతవలె, మొదలు నరికిన అరటిచెట్టువలె ఢామ్మని ఏడుస్తూ క్రిందపడిపోయింది. రాజోచిత మర్యాదలతో, సుఖించిన ఆమె శరీరం ధూళిధూసరమైంది. వికారం ఎరుగని రాముడు విహ్వలుడై లేవనెత్తి దుమ్ము దులిపి, ఆధారంగా ఆని కూర్చున్నాడు. కొడుకును చూస్తూ, సౌమిత్రి వినగా, కంటికి కడివెడు నీళ్ళుగా ఏడుస్తూ-

"నాయనా! ఎంత అదృష్టహీనురాలిని. ఇంత దీర్ఘకాలం బ్రతికినీ, ఇంత దేవతార్చనచేసినీ, నవనఫలంగా నిన్ను కన్నదీ పిడుగు వంటి ఈ మాట వినుటకేనా? వినికూడా జీవించుటకేనా? క్షణం కింద ఎంత సంతోషంతో తలమునకలైనానో, ఇప్పుడంత దుఃఖంతో తప్తమవుతున్నాను. నా తండ్రీ! నీవు నా కడుపున పుట్టక ఇంకొక భాగ్యశాలికి పుట్టినచో, తల్లిగా నాకూ, కొడుకుగా నీకూ, ఈ తీరని శోకం కలిగి ఉండేదికాదు. లేకలేక కలిగిన బిడ్డను కన్నారా చూచుకుని, మనసారా భుజింపపెట్టి, అచ్చట ముచ్చట తీర్చుకునే భాగ్యం అల్పకాలంలోనే చెల్లి పోతుందని అనుకోలేదురా.

నీ నామకరణంనాడు కులగురువులైన మహర్షులు వసిష్ఠులవారు "నీ జననంకోసమే ఎన్నో మన్వంతరాలుగా ఇక్ష్వాకువంశ పురోహితుడుగా వుంటున్నాను. ఈనాటికి నా కోర్కె సిద్ధించింది. నా తపస్సు ఫలించింది" అని నీ శరీరమంతా నిమిరి వజ్రకాయుడవు, సత్య పరాక్రముడవు కమ్మని దీవించారు. అంతటి మహర్షులవారిచే అభినందన పాత్రుడవైన నిన్ను విడిచి ఏ విధంగా బ్రతికేది? ఈ సంతాప సముద్రం ఎలా దాటేది? ఇంతకాలం లోకంలో కౌసల్య గొడ్రాలని పేరు వచ్చింది. అదే ఇప్పుడు మంచిదనిపిస్తున్నది. పుత్రవతినై నీ ముద్దు ముచ్చట్లు ఏం తీర్చాను? చెమటముడుముగా తప్ప ఎప్పుడూ ఈ క్రూరకార్యం తలపెట్టిన ఆమె ఇంట్లోనే గడిపేవుకాని పట్టుమని పదిరోజులైనా వున్నావా?

పేరుకు మాత్రం పెద్దరాణినేకాని, మీ నాయనగారి ఆదరాభిమాన గౌరవాలందుకున్నానా? అన్నీ ఆ కైకమ్మకే దక్కినవి. ఆ వ్యామోహంలోనే మీ అయ్య ఈ కఠినకర్మకు పాల్పడ్డాడు. చావు తరువాత లావు దుఃఖం అన్నట్లు ముసలితనంలో కూడ ఈ వెర్రివ్యామోహమేమిటి?

ఒకరి ననవంసిన పని ఏముంది? ఇదంతా నా కర్మఫలం. రాజలోకంలో రత్నంలాగా ప్రకాశించిన భర్తనుపొంది ఏం సుఖం అనుభవించాను? ఇప్పుడు అతిలోక గుణవంతుడైన ఆత్మజుని పొంది, అడవుల పాల్జేసి అంతే సుఖం అనుభవిస్తున్నాను. సంతోష సమయంలో భార్యలకు భర్తలు చనవు ఇస్తే, కోరవలసిన కోర్కెలు ఇవేనా? తన కొడుక్కు రాజ్యం కోరితే కోరవచ్చునుకాని, అసూయతో నా కొడుకును అడవులకు పంప ఆమెకు నేనేమి చేయరాని అపకారం చేశాను?

సత్యవాక్య ప్రమాణ బద్ధుడైన నీ తండ్రిని బలవంతాన ఒప్పించింది కాని, ఆయన మనస్ఫూర్తిగా నిన్ను పొమ్మనడు. అనలేడుకూడ. నీ వియోగతాపంతో వాడు బ్రతికి బట్టకడతారని నాకు నమ్మకంలేదు. నీ పట్టాభిషేకం సంగతి చెపుతూ, గ్రహబలం బాగాలేదనీ, మారక లక్షణాలు గోచరిస్తున్నవనీ, దుస్స్వప్నాలు వస్తున్నవనీ, అందుకే త్వరగా ఈ కార్యం తలపెట్టానని చెప్పారు. ఇక, అమంగళం అనరాదు కాని, నీవూలేక,వారూ లేక నా సంగతి ఏమికాను? ఇంత నిర్లజ్జగా ప్రవర్తించిన కైకేయి నాకెట్టి పాటు కలిగిస్తుందో ఫూహించలేను.

ఇంతకాలం చూసీచూడనట్లుండిన మీ తండ్రి ఇకమీద ఆమె చెప్పు చేతల్లో పూర్తిగా ఉండిపోతాడు. పైగా ఆమె రాజసూత. ఆమె కొడుకు రాజూ. వారి కనుసన్నల్లో మెలగవలసిన పరివారజనం, నాపట్ల ఎంత విముఖంగా ప్రవర్తిస్తుందో చెప్పలేను. ఆవిడ దృష్టిలో ఇక తొత్తునే కాదు, తొత్తుకింద తొత్తును. ఈ బాధలన్నీ ఎలా భరించమంటావో నాయనా! నీవే చెప్పు. ఇప్పటివరకు ఏదో నోటి మంచితనాన, నీ తండ్రి ఉదాసీనుడైనా, దుష్టుడు కానందున, నలుగురిలో, నేనూ ఒక మనిషినిగా తలెత్తుక తిరగాను. ఇప్పుడదికూడా పోయింది. లేచింది మొదలు పడుకునేదాకా అన్నింటికిఆమె నాశ్రయించవలసిందేకదా? చిటచిట మటమటలాడే ఆ మొగం, ఆ మాటలూ ఆ ప్రతీకారపు చేతలూ, భరించటానికి ఎంత దుస్సహమో పసివాడవు నీకెట్లు తెలుస్తుంది? పదిహేడేండ్లుగా, అన్నిబాధలూ సహించుకుని ఎదురు చూస్తూ ఉన్న ఈ అవకాశం ఈ విధంగా పరిణమించింది. ఏదో సాకుతో ఎత్తిపొడుపు మాటలు కైకా, పరిచారికలూ అంటుంటే ఎలా వినిసహించ

టం? ఈ దుఃఖానికి అంతం ఎప్పటికి? ఎన్నో నోములు, ఎన్నో వ్రతాలు, ఎన్నో తీర్థయాత్రలు, ఎన్నో దానధర్మాలుచేసి, ఫలితంగా నిన్నుకని, నీ వృద్ధికి పడరానివాట్లు పడినందుకు పండువంటి నిన్ను భయంకరాటవులకు పంపటమేనా తల్లినైన నేను చేయవలసింది?

రక్తంలో రక్తమైపుట్టినబిడ్డ అడవులపాలవుతున్నాడని విని, ఇంకా జీవించిన నా గుండె ఇనుమో, వజ్రమో, కాకపోతే ప్రవాహవేగానికి ఒడ్డులాగ కూలిపోకపోయిందా? నాకు చావులేదు. యముని మందిరంలో చేర్చుకోటానికి అక్కడ చోటులేదు. వుంటే నీ ప్రవాసవార్త విన్నతర్వాత యమధర్మరాజు లేడిని నోట కరచికొనిపోయే సింహంలాగా పాశబద్ధురాలనుచేసి ఎందుకు కొనిపోడు? నా హృదయం ఉక్కుతో నిర్మాణం అయివుంటుంది. ఇంత మహావిపత్తులోకూడా భిన్నాభిన్న మయి... నా ఆవేదన అనంతంగా వెళ్ళబోస్తుందా? భర్త అనురాగానికి దూరురాలనై కొంతకాలం కుమిలికుమిలి ఏడ్చాను. సవతి చూపవలసిన మర్యాదలు చూపక ఉదాసీనగా ఉన్నందుకు మరికొంతకాలం మరగిమరగి పోయాను. చేతికెక్కివచ్చిన బిడ్డను చేచేతులా అడవులకంపి కడుపుచిచ్చుతో కుమిలిపోతాను. నా ఇన్నివేల జీవితకాలంలో పట్టుమని పదిహేడేళ్లు మాత్రమే ఆడుదానిగా, వీరమాతగా, మాతృదేవిగా బ్రతికాను.

కొడుకులో, కొడుకులో అంటూ కుయ్యిడిన ఈ నోటికి విధి విరామంలేకుండాపోయింది. చివరకు భగవత్కృపవల్ల కొడుకునుకన్నాను. కని కానలపాలు చేస్తున్నాను. ఇంత పాపిష్ఠురాలైన అడుది ఇంతకు పూర్వం పుట్టలేదు. ఇకముందు పుట్టదు. లోకంలో పుట్టలేదని ఏడ్చే ఆడవాళ్ళున్నారు. పుట్టిపోయినారని ఏడ్చేవాళ్ళు ఉన్నారు. పుట్టి, పెరిగి, పెద్దవాడై, అక్కరకువచ్చి, అన్యాయంగా ఇతరుల బలవంతంతో, అడవులలోనికి నెట్టబడి సజీవుడై, ధర్మాచరుణుడై, ఏకాకియైన కొడుకును గూర్చి ఏడ్చినవాళ్ళున్నారా? ఈదుఃస్థితి నాతలనే మొలిచింది. ఈఅనూహ్య పరిణామం విధిచేత నా మొగాన వ్రాయబడింది. ఎంతో అనుభవించవలసిన, అనుకూలవతి అయిన, అనురాగవతి అయిన కోడలు ఆకుచాటు పిందెవలె నున్నదికదా? ఏమి చెప్పి ఓదారుస్తాను? ఆడుదాననై, సంసా

రిజినయి, పసిబిడ్డకు భర్తృవియోగం భరించుమని ఎలాచెప్పను? ఆ బిడ్డకు ఏమిప్రత్యామ్నాయం చూపించి ఓర్పు వహించుమని బోధిస్తాను? ఆ కనికందుపడే ఆవేదనచూచి ఎలా సహిస్తాను? నా ఆశలన్నీ మరుభూమిలోని నీళ్ళయినవి. నా చేసిన పూజలన్నీ చవిటినేలలో నాటిన విత్తనాలైనవి. ఆయుర్దాయం ఉన్నంతవరకు, సుఖములుచూరో, దుఃఖితూనో ప్రాణులు జీవించేటట్లు సృష్టి జరిగింది. అందులో దుఃఖహతాత్ములూ, పాపకర్ములూ చిరకాలం జీవిస్తారు.

"పాపీచిరాయుః సుకృతీగతాయుః" అని అందుకే పెద్దలన్నారు. అన్నివిధాలా వ్యర్థురాలైన నీ తల్లిపై నీవైనా కనికరం చూపించు. కోడలూ, నేను నీతో వస్తాం. ఈ శేషజీవితం నిన్ను చూచుకుంటూ గడుపుతాను. అప్పుడు నాకు ఈ బాధలన్నీ వుండవు" అంటూ, ప్రళయ సమయంలో ఘూర్ణిల్లుతూ, చెలియలికట్ట నతిక్రమించి వాసరక్షేత్రాలు ముంచుకొని వస్తున్న సముద్రంవలె శోకావేశంలో రాముని చేతుల్లో సోలిపోయింది.

## సౌమిత్రి రామువనవాసం నిరోధింప చూచుట

ఆ పాటును చూచిన లక్ష్మణుడు కటకటపడి కౌసల్యాదేవితో ఇలా అన్నాడు. "అమ్మా! అన్నగారు అసంబద్ధమైనట్టీ, వంశాచారవిరుద్ధమైనట్టీ, రాజధర్మ వ్యతిరేకమైనట్టి పనికి పాల్పడటం ప్రజలుకూడా సమ్మతింపరు. భార్యాభర్తల నడుమ ఎన్నివాగ్దానాలైనా జరగవచ్చు. అవి భంగం కానూవచ్చు. వాటిని మన్నించవలసినపని ఇతరులకు లేదు. సభాసమక్షంలో పట్టాభిషేకం చేస్తానని ప్రకటించి, సర్వసంభారాలూ సమకూర్చి, దేశదేశాలవారిని ఆహ్వానించిన తండ్రిగారు అన్నగారిని అడవికి పొమ్మని ఆజ్ఞాపించడు. ఆయన అస్వస్థత నెపంగా ఆవిడయే ఈ మాటలు చెప్పి ఉంటుంది. ఆ మాటలు పాటించవలసిన పనిలేదు. అన్నగారు అడవికి పోవటం నాకు అసలే ఇష్టంలేదు. ఒకవేళ తండ్రిగారి అభిమతం ఇదే అయినా అగ్రజుడు అడవికి పోనక్కరలేదు. ఎందుకంటే, పట్టంకట్టుకోవలసినవాడు పరదేశంలో వున్నాడు. అతడు ఈ పనికి అంగీకరిస్తాడో లేదో తెలియదు. 'కడుదాని సంపాదనపై అన్యాయంగా వచ్చిన రాజ్యం

పౌరుషవంతుడైన భరతుడెప్పుడూ పరిగ్రహించడు. ఒకవేళ అట్టిది జరిగితే అవకాశంలేక నిరుపయోగంగావున్న నా అస్త్రవిద్యకు ఆగ్రహం వస్తుంది. అప్పుడు కుతంత్రం పన్నిన కూళలగతి యేమవుతుందో నీవే చూస్తావు. న్యాయధర్మాలు మనపక్షపున్నై. పౌరుషశక్తులు మాలోవున్నై. ఆ వరాలేమిటో, ఈయన ఇవ్వటమేమిటో, ఆమె పుచ్చుకుని దిక్కులేని వానిగా అగ్రజుని భావించి అడవికి పొమ్మని ఆజ్ఞాపించటం ఏమిటో నేను తేలుస్తాను. ఎవరేమి చెపుతారో నేను చూస్తాను.

కిడెంచి మేలెంచమన్నారు పెద్దలు. మన వంశంలో లేకపోయినా, అక్కడక్కడ జ్యేష్ఠుని వదలి కనిష్ఠుడు రాజైనట్లు వింటున్నాం. ఏ పరిస్థితుల్లో అలా జరుగవలసిన వచ్చిందోకూడ తెలుసుకున్నాం. పెద్దవాడు దురాచారుడో, క్రూరుడో, అవయవలోపం గలవాడో, తండ్రి ఆగ్రహానికీ, ప్రజాగ్రహానికీ పాత్రుడైనవాడో అయితే తప్ప, కనిష్ఠుడు రాజుకాలేడు. పై లక్షణాలల్లో ఏవీ మా అన్నగారికి లేవే. పైగా వాటన్నిటికీ విరుద్ధంగా ఉన్నవే. అటువంటప్పుడు నిష్కారణంగా, ముదితావ్యామోహంలో పడి ముసలితనంలో తెలివితప్పి చేసిన ప్రమాణం, ఇచ్చిన మాటా ఎంతవరకు చెల్లుబడి అవుతవి? సర్వదష్టుడైనవాడూ, తాగినవాడూ, వెర్రివాడూ, కామమోహితుడూ, మతిభ్రష్టుడూ అనే మాటలకు ఏం విలువ వుందో, సంస్కృతి సభ్యత గలవారిని అడిగితే తెలుస్తుంది. ఈ స్వల్ప విషయానికి ఇంత రాద్ధాంతం సిద్ధాంతం ఎందులకు జరుగుతున్నదో తెలుసుకోలేకుండా వున్నాను.

తల్లీ! నన్నపార్థం చేసుకోకు. అగ్రజునకు అపకారం జరిగితే ఎన్నడూ బ్రతికివున్న లక్ష్మణుడు చూచి సహించడు. రామానుజుడంటే లక్ష్మణుడు మాత్రమే అన్న లోకరూఢి ఎవరికి వర్తిస్తున్నదో వాడు, తమ్ముడే కాదు——సేవకుడు, భటుడు, అంగరక్షకుడు, ఆత్మద్వితీయుడని ఎరుంగుము. సత్యంమీదా, ధర్మంమీదా, అగ్రజునిమీదా, అస్త్రాలమీదా శపథంచేసి చెపుతున్నాను. రాముడు లేని లక్ష్మణుడు లోకంలో వుండడు. నీవు శోకం వదలిపెట్టు. ఇది శోకానికి సమయం కాదు. పురుషకారానికే సమయం" అంటూ సమయోచిత వాక్యాలతో అనునయించాడు.

ఆ విధంగా భ్రాతృభక్తితో ఆడిన సౌమిత్రి మాటలువిని కౌసల్యాదేవి రాముణ్ణి చూచి, "నాయనా! రామా! నీ తమ్ముడు అన్న మాటలు విన్నావు గదా? గంధుపిల్లికి చిలుకను అప్పగించినట్లు, నీకింత అపకారం చేసి నాకు కడుపుశోకం కల్పించిన కైకకు అప్పచెప్పి నీవు అడవికి పోవటం ఏం ధర్మం? పూర్వం కాశ్యపుడనే ముని తల్లికి సేవలు చేసి ఆమె దీవనలతో స్వర్గసుఖం చూరగొనలేదా? తండ్రికంటే తల్లి తక్కువా? శ్రుతిమాత ఏమి చెప్పింది? "మాతృదేవోభవ, పితృదేవోభవ" అని కదా. ప్రథమంగా తల్లిని పేర్కొన్నదంటే తల్లికే అగ్రస్థానం ఇచ్చినట్లే. కాబట్టి నేను నీకు కానలపాలు కమ్మని అనుమతి నీయను. అటు తమ్ముని నిర్ణయం, ఇటు నా నిశ్చయంకూడా విన్నావు కనుక, నీకు ఎలా తోస్తే అలా చేయి. నీవు నా మాటను కాదని ఆ కైక తృప్తికే కానకు పోతానంటే నేను అన్నం నీరూ మాని ప్రాయోపవేశం చేస్తాను దానికి నీ మనస్సు మారకపోతే, సముద్రానికి బ్రహ్మహత్యాపాపం వచ్చినట్లు, అధర్మ ప్రవర్తకుడవైన నీకు మాతృహత్యా పాపంతోపాటు ఘోరాతిఘోర నిరయం (నరకం) వస్తుంది. ఏది నీ కిష్టమైనదో ఎన్నుకో"మంటూ రాముణ్ణి కౌగలించుకుని ఏడ్వసాగింది.

## తల్లినీ, తమ్ముణ్ణీ రాముడు ఊరార్చుట

"అమ్మా! అన్ని ధర్మాలు తెలిసి కూడ ఎంత వెర్రిదానవైతివి? బిడ్డలపై తల్లి మమకారం అనుభవైక వేద్యమేకాని అక్షరాల కూర్పుతో అందించలేము. బిడ్డసేవలో ఆమె ఉచ్చనీచా లెంచదు, పాప పుణ్యాలను పాటించదు, కష్టనిష్ఠురముల కనుల చూడదు. తల్లిదండ్రులుగాని, అత్తమామలగాని, తుదకు భర్తను గాని మన్నించదు. అందుకే వేదమాత ముందుగా, "మాతృ దేవోభవ" అన్నది. నీ రక్తాన్ని పంచుకొని పుట్టి, నీ స్తన్యం త్రావిన నేను, నీ బాధను గుర్తింపలేదనుకోకు. ఇటువంటి దుస్సంఘటనలు వచ్చినప్పుడే మానవుల వ్యక్తిత్వం బయటపడేది. అనుకూలించినంత కాలం అందరూ సత్యవాదులే. అందరూ ధర్మ పరాయణులే. స్వార్థానికి భంగం వస్తే, అంతకు ముందున్న సత్య ధర్మాలకు అపార్థన కల్పన చేస్తారు. ఆడి పోసుకుంటారు. తాము పట్టిన కుందేటికి మూడే

కాళ్ళని వాడిస్తారు అవకాశం వుంటే అదేమంచిదని ప్రచారం చేస్తారు. ఇది కేవలం అజ్ఞాన లక్షణం, దేహధర్మం.

తల్లీ! నీ వెరుగని విషయాలేమీ నే చెప్పదలచుకోలేదు. ఆ మేరకు నీతో వాదులాడి బాధింపబోవటం లేదు. ఈ మాటలు చెప్పుతున్నందుకు నన్ను అపార్థం చేసుకోక క్షమించు. ఆర్షధర్మం రెండు విధాలుగా లోకం కొరకు ప్రవహిస్తూంది. ఒకటి లౌకికం. రెండోది అలౌకికం. ఈ రెండూ విడిగా భావించినపుడు ఏ విధమైన బాధావుండదు. ఒక దాన్ని ఒకటి గట్టిగా ఘర్షించినపుడు పెద్దలు అలౌకిక ధర్మానికే ప్రాధాన్యం, ప్రముఖ స్థానాన్నీ ఇచ్చారు. లోకధర్మాన్ని అనుసరిస్తే, కొడుకు తండ్రి మాట, భార్య భర్త మాట పాటించాలి. అంటే తల్లీ కొడుకు లిద్దరూ తండ్రియైన వానినే అనుసరించాలి కదా? కాబట్టి సర్వాధికారం తండ్రికే వుంది. అట్టి తండ్రి మాట తిరస్కరించటం ధర్మ దూరం అవుతుంది. ఇక అలౌకిక ధర్మాన్ని అనుసరిస్తే, వ్యక్తికే స్థానం గాని బాంధవ్యానికి స్థానం లేదు. ఎవరి కర్మ ఫలం వానిది. వాడేది వుత్తమంగా భావిస్తాడో అదే చేస్తాడు.

తండ్రి ఆనతి నంది మృత్యువు వాత ఆవును కండుముని పడునట్లు చేయలేదా? అతడు ధర్మ సూక్ష్మం తెలియక చేశాడా? ఇతరుల మాట ఎందుకు? మన వంశంలో తమ నాశనాన్ని కూడా లెక్కచేయక తండ్రి ఆజ్ఞానువర్తులై సాగరులు భూత కోటిని చంపలేదా? తండ్రి మాటపై కన్న తల్లినే పరశురాముడు కరకు గండ్ర గొడ్డలితో తల ఖండించలేదా? ఎందరో ఇంకా మహానుభావులు తండ్రి ఆజ్ఞ తలదాల్చి చెప్పినట్లు చేయలేదా? వారందరూ కీర్తిశేషులుగా నిల్చి పోలేదా? నేనేదో కొత్త దారిలో బడి నీ మాటకు ప్రతికూలుడనైనానని దుఃఖపడకమ్మా! ఇది పెద్దలు పోయిన దారే కాని కొత్తదేమీ కాదు. జనక వాక్య పరిపాలనం అవశ్య కర్తవ్యం. వినకపోతే నరకం త్రికరణ శుద్ధిగా చెపుతున్నాను. నేను తండ్రి మాట పాలించటానికే నిశ్చయించుకున్నాను. కరుణారస దృష్టిం వర్షించి అడవుల కేగుటకు అనుజ్ఞనియి

సోదరా! నాయంతవాడవే కాక, నా అంతరాత్మ స్వరూపుడవు. నీకు

నా పట్ల సాటిలేని అనురాగ గౌరవాలున్న సంగతి నాకు తెలుసు. అమాయకురాలైన అమ్మవలె నీవు కూడా ఈ విధంగా పలికితే నేను ఏమని సమాధానమియను? కొండ వంటి గుండెగల నీవే సామాన్యుని వలె శోకిస్తుంటే ఇంక తల్లిని ఎవరు ఓదారుస్తారు? నీవున్నావనే ధైర్యం తోనే కదా సత్య పాలనానికి సిద్ధపడింది? సత్యానికి ధర్మమేకదా స్థానం. ఆ ధర్మం తండ్రి వాక్యరూపంలో ఇమిడింది. నేను తెలియని వాడనని నీ వెన్నడూ భావించవు. విశేషించి నీకు చెప్పవలసిన పని లేదు. నాకు మారుగా అమ్మను కనిపెట్టివుండు. నీవుంటే నేను లేని లోటు రానీయవు. అమ్మకూడా నిన్ను చూచుకుని దుఃఖోపశమనం పొందుతుంది" అని సహేతుకంగా, సధర్మంగా, సాపునయంగా, రాముడు జననీ సోదరుల ఊరార్చాడు. కాని తల్లి విన లేదు.

"ఎన్ని మాటలు చెప్పినా, "తండ్రి ఆజ్ఞ, తండ్రి ఆజ్ఞ" అంటు న్నావు. ఇంక తల్లిఅనుమతి ఎందుకురా, తండ్రీ? ఇంత విరాగివి అక్కడ నుంచే పోక ఇక్కడి కెందుకు వచ్చావు? నీవు చదివిన ధర్మశాస్త్రాల్లో కన్న తల్లికి విలువలేదని ఉన్నదేమో? పిన తల్లి మాట వేదవాక్కని ఉన్నదేమో? రాజును చేస్తానని చెప్పి మాట తప్పిన తండ్రి సత్యవ్రత శీలుడేమో నాకు తెలియదు. ఇప్పుడు తెలుసుకుని మాత్రం ప్రయోజనం ఏముంది? బ్రతుకుపైన ఆశ కలిగిన దానికి అవసరం కావచ్చునేమో.కాటికి కాళ్ళు చాచుకున్న నాకెందుకు? నీకు తోచినట్లే చేయి. కాదంటానికి నేనెవ తెను" అని కౌసల్య తల క్రిందికి వంచుకుంది. కాలాతి క్రమణం జరుగు తూంది. తల్లి అనుమతి నీయటం లేదు. సోదరుడు విషం మ్రింగిన ఈశ్వ రుడవు తున్నాడు. లౌకికా లౌకిక ధర్మాలు రెండూ బలంగా వాళ్ళవైపే మొగ్గుతున్నై. ధర్మ నిర్ణయంలో బుద్ధి ఇతి కర్తవ్యతా మూఢమైంది. తల్లి అనుమతి పొందక తప్పదు. తమ్ముడు శాంతించక పోతే జగత్ప్రళ యమే సంభవిస్తుంది. తన నడక తన తరువాతి వారికి ఆదర్శం కావాలి. అంత రాముడు ధర్మ సంకటంలో పడ్డాడు. క్షణం ఆలోచించాడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. శాంతంగా, సౌమ్యంగా-

# రాముడు తమ్మునకు ధర్మోపదేశం చేయుట

"అమ్మా! తలయెత్తి నన్ను చూడు. నీ బిడ్డపై నీకు ఎంత మమకారం వుందో, ఆ బిడ్డకు నీపై అంత మమకారం వుంది. నిన్ను దుఃఖ పెట్టి, నేనేదో ఘనకార్యం చేశానని ప్రగల్భాలు పలకటానికికానీ, లోకులచే పొగడ్తం పొందటానికి కానీ నేసీనిర్ణయం తీసుకోలేదు. నేను అడవికి పోకపోతే వచ్చే కీడుకూ, పోతే వచ్చే మేలుకూ తేడా తెలుసుకోలేక పోతున్నావు. నిదానంగా విను. నిష్పక్షపాతంగా ఆలోచించు. నేనుపోతే, అటు తండ్రి మాటదక్కి సత్యవ్రత పాలకుడనే కీర్తి చిరస్థాయిగా నిలుస్తుంది. కోరినకోర్కె నెరవేరిందని పినతల్లి సంతోషిస్తుంది. లేక లేక కల్గిన ఒక్కగా నొక్క కొడుకును పతివ్రత, పరమసాధ్వి, భర్త మాటకై పరిత్యజించిందనీ, ఎంత త్యాగమూర్తి అనీ, ఇది స్త్రీ జాతి సహజంకాదనీ, మానవులే కాక దేవతలు కూడ నిన్ను కొనియాడుతారు. నాకు మీ కీర్తి దక్కించిన ఫలం వస్తుంది. ఇన్నివేల వత్సరాలు గడిపిన నీవు పధ్నాలుగేండ్లు గడప లేవా? నేను తిరిగి రానా? నీ శుశ్రూష చేసి జన్మం సార్థం చేసుకోనా?

తమ్ముడూ! సౌమిత్రీ! అమ్మకు ధైర్యం చెప్పవలసిన నీవింత పేలవైనావేమి? నిన్నుగూర్చి నేను క్రొత్తగా తెలుసుకోవలెనా? నన్ను గురించి నీకు మాత్రం తెలియదా? ఎవడు ధర్మమార్గంలో ప్రవర్తిస్తాడో వానికి ఆ ధర్మమే అర్థకామాలను కూరుస్తుంది. అందుకే పెద్దలు "ధర్మో రక్షతి రక్షితః" అన్నారు. ఎలా అంటావా? యోగ్యురాలైన భార్య, భర్త సర్వకార్యాలలో సహచారిణియై ఫలప్రాప్తి కలిగిస్తుంది. లోక సహజంగా భౌతికానందం ఇస్తుంది. సంతాన రూపంగా అర్థం ప్రసాదిస్తుంది. ఎవడు అర్థకామాలకు దాసుడై, ధర్మాన్ని త్రోసి రాజంటాడో ఆ అర్థకామాతే అతని నాశనానికి దారితీస్తై. అతి కాముకుడు ఆడుదాని చేతిలో కీలుబొమ్మ అవుతాడు. ఆ లుబ్ధుడు అర్థాన్ని ప్రేమించినంతగా ఆత్మేశ్వరుణ్ణి ప్రేమించలేడు. ఆ అర్థసంపాదనార్థమై అనేక దుష్కర్మలు చేస్తాడు. ఆ కర్మల ఫలితం ఇహపరాలు రెండూ పాడుచేస్తుంది. కేవలం అర్థకామాసక్తులు సంఘగౌరవం పొందలేరు, స్వర్గానికి పోలేరు. నీ వాలో

చించవలసింది తండ్రి ఎట్టివాడనికాదు, ఏమి ఆజ్ఞ ఇచ్చాడనికాదు, అందులో ఉన్న మంచిచెడ్డలూకాదు. తండ్రి చెప్పినట్లు కొడుకుచేయాలి. ఇది వేద ధర్మం. పూర్వుల ధర్మం. ఇక్కడ ఒక ధర్మసూక్ష్మం చెపుతావిను.

ఎవడు రాజో వాడు ఆ రాజ్యానికి సర్వాధికారి. అతడేమి చేసినా చేయవచ్చు. కొడుకులకేకాదు. ఇతరులకిచ్చినా ఈయవచ్చు. ఇది రాజుకు గల హక్కు. ఆ హక్కును రాజు వినియోగించుకుంటే ఆక్షేపణ ఎవరు చేస్తారు? కొడుకులా? ప్రజలా? చేస్తే ఏమని చేస్తారు? ఏమి ఆధారంతో చేస్తారు? రాజు తర్వాత ఆ రాజ్యం పెద్దవానికి చెందాలి అన్న ధర్మాన్ని ఆశ్రయించేకదా స్ఫురించాలి. ఇక్కడ ఈ ధర్మం అవసరమైంది. మరి ఆ ధర్మం అక్కడ అతనికి అవసరమైంది. అంటే: ఇద్దరూ ధర్మాతిక్రమణంచేసి స్వార్థంకోసం ప్రయత్నించినవారేకదా. మొదటిహక్కు రెండో హక్కును బంపరిస్తేనే ధర్మం, ధర్మం అవుతుంది. కాబట్టి తండ్రి చేతలు కాక మాటలే మనకు ప్రధానం. ఇంకో విషయం వివరించుతా, విను.

"తండ్రి చెప్పలేడు. పినతల్లి చెప్పింది. తండ్రియాజ్ఞ ఇందులో ఎక్కడవుంది?" అనే సందేహం వస్తుంది. ఆమె ఒంటరిగా చెప్పలేదు. భర్త సమక్షంలోనే చెప్పింది. భర్త స్మృతి హీనుడుగాలేడు. ఆమె చెప్పినది విని, అది తనకిష్టంలేకపోతే "రామా! ఇది నామాటకాదు, ఆమె మాట వినవద్దు" అని చెప్పేవాడేగా? విని ఊరకుండుటలోనే అంగీకరించినట్లూ, అదే ఆయన అభిప్రాయం అన్నట్లూ స్ఫుటంగా తెలియటంలేదా? ఆమె తన వాంఛా సిద్ధికి పైకి చెప్పింది. ఆయన తన అన్నమాటకు విఘాతం రావటం ఇష్టంలేదు కనుక పైకి చెప్పలేదు. ఇక తండ్రి చెప్పలేదనే మాటకు తావెక్కడ? కోపం తెచ్చుకోకు. దుఃఖించకు. ధైర్యశాలివి కమ్ము. ఇది నాకవమానమని భావించకు. తండ్రిచేసిన పని ధర్మదూరంకాదు. కనుకనే నేనంగీకరించాను. తల్లికి మాట ఇచ్చాను. అభిషేక సంభారాలు జాగ్రత్తపరచు. భరతుడు రాగానే యథావిధిగా కార్యం జరిపించు. "రాముడు ఇంకాపోలేదు మాటతప్పుతా

దేమో" అని పినతల్లి తత్తరపడుతుంటుంది. ఆమెకు ఆ శంకరాకముందే నా ప్రయాణానికి మీరు అంగీకరించండి" అని చెప్పాడు. ఆ మాటలకు, తల్లి, సోదరులు సమాధానపడక నిరుత్తరులైనారు.

## మేలుకీళ్ళకు దైవమే కారణం అని రాముడు బోధించుట

శ్రీరాముడు వారి అపార ప్రేమానురాగాలకు స్తబ్ధుడైనాడు. "సోదరా! నీవు అన్నీ తెలిసి అజ్ఞానంలో పడుతున్నావు. మన జన్మలకు మన కర్మలు కారణం. ఆ కర్మఫలాన్ని అనుసరించే బుద్ధినడుస్తుంది. "బుద్ధిః కర్మానుసారిణీ" అని చెప్పగా వినలేదా? అందుకు మన కుటుంబ గాథే ప్రత్యక్ష ప్రమాణం. కాకపోతే, పుత్రకామేష్టి చేసిన దెందుకు? పుత్రులకోసంగదా! యజ్ఞపాయసం అర్ధాంశం పెద్దభార్యకు ఇచ్చిందెందుకు? జ్యేష్ఠుడు రాజ్యానికి వచ్చి తన వంశగౌరవం నిలబెట్టుతాడనేకదా. ఈ నాడు ఇంత ప్రయత్నంచేసింది అందుకేకదా. ఈ అవాంతర సంఘటనం జరుగుతుందని ఆయన అనుకున్నాడా? అనుకుంటే ఎందుకు ఇంతయత్నం చేస్తాడు? ఇక ఆమె సంగతి చూద్దాం. ఆమె రక్షణలో భరతుడు ఎక్కువ కాలం ఉన్నాడా? నేనా? నా విద్యాబుద్ధుల్లో శ్రద్ధ తీసుకుంది తండ్రియా? ఆమెయా? ఇంతకాలం కొడుకును మరచి నన్నే కొడుకుగా చూచుకున్న ఆమె ఇప్పుడు పట్టభంగానికి పట్టుపట్టడానికి కారణం ఈ రెండుజాముల కాలంలో నేను చేసిన తప్పేమిటి? ఏ నోటితో నన్ను లాలించిందో, ఆ నోటితోనే కఠిన వాక్యాలు పల్కడం ఆమెకు సహజంగా సాధ్యమవుతుందా? ఆ మాటవిని తండ్రి అవును కాదనక వుదాసీనుడవుతాడా?

ఇదంతా ఉన్నత బుద్ధితో వూహించితే మన యత్నం ఏమాత్రం లేదని స్పష్టంగా తెలుస్తూంది. ఇందులో ఎవరిదోషంలేదు. అప్రతిహతం, అచింత్యం అయిన దైవ మహిమ నాపట్ల ఇప్పుడు విపర్యయమైంది. కల కాలం ఇలాగే ఉంటుందని ఊహించటం తప్పు. "ఆ దైవం ఎక్కడ ఉంది?" అని అంటావేమో. కార్యంయొక్క ఫలితా ఫలితాలలో ఉన్నది. నీవు నిర్ణయం చేసుకున్న పనికి విచ్ఛిత్తి వచ్చిందంటే, నీ నిర్ణయ దోషంకాదు. నీకు తెలియకయే ఆ నిర్ణయంలో దైవశక్తి దాగి వుంది.

ఆ శక్తి నీకు తాడును పాముగానూ, పామును తాడుగానూ భ్రాంతి రూపంగా మార్చి విఘ్నం కలిగిస్తుంది. ఆ తెలియరాని శక్తితో వైరం జీవకోటికి సాధ్యంకాదు. జరామరణ రుజాదుల జయించటానికి అమృతాన్ని సాధించినవారు అది త్రావి ముసలితనం, చావూ, రోగం లేకుండా వున్నారా? శాపం రూపంగా కొందరు, ఇష్టానుసారం కొందరు దేహాంతరాలు పొందినట్లు మనం విన్నాం. దాని అర్థమేమిటి? జీవకోటి ఎంత ప్రయత్నించినా, దైవోపహతం కాక తప్పదు. అందుకే మహర్షులు "సర్వంఖల్విదంబ్రహ్మ" అని చెప్పారు. అనుకూలించిననాడు నీ ప్రజ్ఞా? అనుకూలించనినాడు దైవం చేతా? ఈ రెండు ఫలాలూ దైవానివే. మన గురువులైన విశ్వామిత్ర మహర్షులవారు మహా తపస్సంపన్నులై కూడా, ఇంద్రియాలకు వశుడైనాడంటే దీనికి హేతువు ఏం చెపుతావు? ఆయన చేసిన పని ఇంద్రియ నిగ్రహానికి. పొందిన ఫలితం ఇంద్రియ దాస్యం. ఇవన్నీ సమీక్షించే నేనీ కార్యానికి పూనుకొన్నాను. ఇప్పుడు నా భావనలో ఈ అభిషేక సంభారాలూ, ఉత్సవాలూ, రాగద్వేషాలూ లేవు. నిర్మలమతులై, నిత్య కర్మానుష్ఠానపరాయణులై, ఇంద్రియ వాసనాదూరులై, లోక క్షేమంకోసం తపోరూపంగా, లౌకికమైన తనువును త్యాగంచేస్తున్న ఋషులు మెదులుతున్నారు. పంజరం బంగారం అయినా చిలుకకు, దాని స్వేచ్ఛకు బంధమే కదా.

తలపై ధరించేది రత్నకిరీటమే. అందులోని మణులన్నీ బలుసు ముళ్ళు. కాదా పల్లేరుకాయలు. ఆ కాననసీమ ఎంత ప్రశాంత వాతావరణం కంది! ఆ మునులు ఎంత శాంత స్వచ్ఛహృదయులు! ఆ మృగాలు ఎంత స్వేచ్ఛాజీవులు! ఈ మహావకాశం, ఈ అతినూత్న విలక్షణానుభవం ఈ చిన్నవయస్సులో పొందుటకు, మీరు ద్వేషిస్తున్న పినతల్లి కైకమ్మయేకదా కారణం. నా మాటలువిని, వచ్చిన ఈ సదవకాశాన్ని వృథాకాకుండా మీరు చూడండి. అసహాయుడనై, అశక్తుడనై, అర్భకుడనై అంటున్నానని రామానుజుడుగానీ, రామమాతగానీ ఎప్పుడూ భావించరు. రాజులైనవారు ఇహపరాలైన రెండు ధర్మాలూ పాటించాలి. మనోవేదనవదలి, మనసారా నన్ను ఆశీర్వదించి పంపండి" అని తాను రాతిపై సిడిబొట్టులాగా, నిర్వికారుడుగా, నిశ్చలుడుగా, స్వకార్య

నిర్వహణ నిష్ఠుడుగా పల్కాడం దివినుండి దేవతలు విని ఆనందనృత్యం చేశారు. "ఆహో! రామా! ఈ నిగ్రహం నీకే చెల్లింది. నీ అవతార నిర్వహణదీక్ష అజరామరమైంది. అఖిల లోకాలకూ ఆదర్శమైంది" అంటూ శ్లాఘించారు. మానస పుష్పాలు వర్షించారు. స్తుతిరూప వాద్య శ్రేణి ప్రమోగించారు.

## దైవ పౌరుషములలో పౌరుషమే ముఖ్యమని సౌమిత్రి వాదించుట

ఆ మాటలు విన్న లక్ష్మణుడు సంతోష విషాదాలకు మధ్యస్థుడుగా కొంతసేపు నిల్చి, భక్తితో అన్నకు ప్రణమిల్లి, కర్రతో కొట్టబడిన భయంకర సర్పంలాగా రొజుతూ, నిటలతటంలో భ్రుకుటిముడిపడంగా క్రుద్ధమైన సింహం మొగమువలె, మొగం దుర్నిరీక్ష్యంకాగా, ఏనుగు తొండంవలె కండలు తిరిగిన కుడిచేయి విదిలించి, నేలపై చూపులు అటుఇటూ త్రిప్పి, ఓరగా అన్నగారి వదనంచూస్తూ, అధరం అదరగా, కన్నులు కొలిమివలె కాగా, అలిగి ఆవేశంతో ఇలా అన్నాడు.

"అన్నా! నీవు నాకు దైవసమానుడవు. నీతో ఎదిరించి వాదించడం నాకు ఇష్టంలేదు. అయినా తప్పలేదు. క్షమించు. నీ వేదో దైవ పౌరుషాలను గూర్చి కొంత చెప్పావు. ధర్మాధర్మాలనూ, అందులోని సూక్ష్మాలనూ తెలిపావు. బాగున్నది. మరి నా ధర్మాన్నికూడా కోపగించక దయతో ఆలించు. కర్మతోనే జీవిపుట్టి, మరలకర్మచేసి నశించి, ఆ కర్మ ఫలం, బలంతోనే పుట్టుతుందని చెప్పావు. ఇక దైవానికి తావెక్కడ? కర్మ నడిపిస్తూంది. జీవి నడుస్తూంది. నీ కర్మ నిన్నిట్లా నడిపిస్తే, నా కర్మ ఎలా నడిపిస్తూందో చెపుతా. విను.

ఇది వృద్ధుడైన తండ్రి ఆడిన నాటకం. వ్యసన లంపటుడై, తనలో వున్న భరత పట్టాభిషేక వాంఛకు ప్రకాశాంగీకారం లభించదని వరాల సాకుతో సాధింపచూశాడు. కాకపోతే ఏనాటి వరాలు? ఇంతకాలం వాటిని తీర్చే అవకాశం, తీర్చుకునేబుద్ధీ వారికి గలుగక, హఠాత్తుగా ఇప్పటి కిప్పుడే అవసరం వచ్చిందా? ఈ వరాల సంగతి వారిద్దరి మధ్యనే జరిగింది.

బహిరంగంగా నీ పట్టాభిషేకం చేస్తానని ప్రజల మధ్యలో అన్నాడు. ఇది కాదని అప్రత్యక్షంగా జరిగినదానికి అంత విలువ ఇచ్చిన తండ్రి ఎంత సత్య సంకల్పుడు? సత్యవ్రతపాలకుడు? ఆ తండ్రిమాట పాలించవలసిన అవసరమేమున్నది? కన్నతల్లిని కాదనీ, కాళ్ళబడిన నన్ను కాదనీ కైకమ్మ కంత గౌరవం దైవం పేరుతో కట్టబెట్టావు ఇంతవరకు మా సోదనే వెళ్ళబోసుకున్నాం. తల్లి యంతటి వదినగారి సంగతి ఏమిటి? ఆమె విషయంలో భావించటానికి నా కర్హతలేదు. తల్లులు వృద్ధురాండ్రు. ఇక-

ఇందులో దురాలోచన లేదన్నావు. స్వార్థంకోసము ఆమె, వ్యామోహంలో ముసలాయనా భరతునికి రాజ్యం అంటగట్టితే కట్టవచ్చు. మరి నీకీ అరణ్యవాసం దేనికి? కనీసం నీవు తినటానికీ, వుండటానికి కూడా అర్హత లేనివాడవా? అందులో పద్నాలుగేండ్ల నియమం ఎందుకు? ఈ కోరికలోనే దుష్టాలోచన వుంది. పద్నాలుగేండ్లు అనుభవం లేకపోతే ఆ ఆస్తిపై హక్కు పోతుంది. నీతోపాటు సంతానానికీ పోతుంది. కలకాలం కైకమ్మ కొడుకూ, మనుమడూ, మునిమనుమడూ-ఈ విధంగా వారసత్వం దఖలు పడుతుంది. సపత్ని మాత్సర్యం ఎంత దూరం పోయిందో చూచావా! ముసలాయన వంశాచారమర్యాద ఎటుపంపిందో తెలిసిందికదా. శిష్టాచార సంపద కలిగీ, రాజ్యాధికారం కలిగీ ఇంత నీచాతినీచమైన కార్యం పెద్దను కున్నవాడే చేస్తే, సామాన్యుల చక్కదిద్దటం సాధ్యమవుతుందా? ఇందుకు నా కర్మ ప్రతీకారానికి ప్రేరేపిస్తోంది.

నీకు మారుగా ఆ కుటిల స్వభావులనే అడవికి పంపుతాను. అడ్డం వచ్చిన వారిని తమామస్తాను. నీకే ధర్మం రుచి అయిందో ఆదే ధర్మం నాకు అరుచిగా వుంది. దైవబలం ఎక్కువో, పురుష బలం ఎక్కువో చూచిన లోకమే నిర్ణయిస్తుంది. ఏ దైవం చేత నీ పట్టభంగం జరిగిందో ఆ దైవం చేతనే నీకు అభిషేకం చేయిస్తాను. మదించిన ఏనుగు శృంఖలం త్రెంచుకుని ప్రజాహాని చేస్తుండే మావటివాడు అంకుశంతో పొగరు దించి కట్టు కొయ్యకు చేర్చినట్లు నా పౌరుషంతో దైవాన్ని నీ పాదాశ్రయుక్తిగా చేస్తాను. దైవ వ్యతిరేకినని దేవతలు వచ్చినా, పద్నాలుగు లోకాలు వచ్చినా, నీ తమ్ముని మార్గాన్ని నిలుపటం సాధ్యం కాని పని. భరతుడు

71,162

రాజెట్లవుతాడో, కైకమ్మ రాజమాత ఎట్లవుతుందో, వృద్ధుడు సింహాసనం ఎలా సంక్రమింపచేస్తాడో నేనూ చూస్తాను. నేను బ్రదికి వుండగా ఇది జరుగనీయను. కౌశిక మహర్షి దత్త సకలాస్త్ర సమూహానికి కావలసినంత పని కల్పిస్తాను. రథ గజ తురగ పదాతులతో ధరణి సంచారయోగ్యంగాని విధంగా చేస్తాను. లక్ష్మణుడు రామకింకరుడని నిరూపిస్తాను. ఆజ్ఞ ఇస్తావా?" అన్నాడు.

## రాముని నిశ్చయం విని కౌసల్య ఏడ్పుట

కౌగిలించుకొని ఏకధారగా ఏడుస్తున్న లక్ష్మణుని మొగం పైకెత్తి చేతితో కన్నీళ్ళు తుడుస్తూ, "తమ్ముడా! శాంతించు. నా కోసం ఇంత జగత్సంక్షోభం ఎందుకు చేయ తలచావు? రాజ్యం కోసమా? అది నేనే వదలుకున్నాను కదా. నీవు సాధించి ఇస్తే మాత్రం నేను గ్రహిస్తానా? నాకా కోరిక వుంటే పినతల్లికి మాట ఎందుకు ఇస్తాను? గుణవంతులైన వారిని పూజించే కొడుకులు ఏపాపివారు? నీ దృష్టిలో గుణహీనులైన వారినే నేను పూజిస్తాను. వారికి ఉత్తమగతులు కల్పిస్తాను. సూర్యచంద్రాదులు గతులు తప్పినా, నా నిర్ణయం మారదు. రామునకు ఒకటే భార్య, ఒకటే బాణం, ఒకటే మాట. ఇక కాల విలంబం చేయక నా నిర్ణయాన్ని సార్థకం చేయి" అని సాత్వికంగా బోధించాడు. గుడ్లనీళ్ళు గుడ్లలోనే కుక్కుకుంటూ, కౌసల్యాదేవి, "నాయనా! ఇదే నీ నిర్ణయమైతే, నీ వెంట నేనూ వస్తాను. తీసుకునిపో. కన్నందుకు తల్లి కడసారి కోరికైనా చెల్లించు. నీ పట్టభంగవార్త అనే అగ్ని నా హృదయంలో పుట్టింది. అది నీ వియోగం అనే గాలితో రాజింది. మమకారభావం అనే కట్టెలతో మండింది. అశ్రువులనే తిత్తులతో ప్రవృద్ధమైంది. చింత అనే పొగ గ్రమ్మింది. నిట్టూర్పులనే దాహకశక్తితో నన్ను బూడిద చేస్తున్నది. నేను ఇక్కడ నీవు లేకుండా బ్రతుకను. అక్కడ నీ చేతులమీదిగానైన దాటిపోతాను. ఆ మాత్రమైనా అదృష్టహీనురాలైన తల్లికి సాయంచేసి పుణ్యం కట్టుకో" అని కొడుకును బ్రతిమాలుకొన్నది. రాముడు ప్రేమతో తల్లిని లాలిస్తూ,

"అమ్మా! నీవు నాకు బరువుకావు. నీ సేవకు వెరిచేవాడిని నేను కాను. భర్త సజీవుడై ఉండగా భార్య విడిచి రారాదు. సతీమణివైన నీకీ మాట నేను చెప్పటం ధర్మంకూడా కాదు. నన్ను వదలి నాయన శాంతితో వుండడు. కైకమ్మ నిరాదరిస్తుంది. ఇక నీవూ లేక, నేనూ లేక ఆయన, ఏమౌతాడు? ఎరిగి ఎరిగి ఆ దుర్యోగానికి మనం కారకులం కారాదు. పద్నాలుగేండ్ల అనంతరం నన్ను మరల చూడగలవు; కాని ఆయనను నీ వీ జన్మలో చూడలేవు. సతికి పతికంటే దైవం లేదు. సర్వశక్తులూ, సర్వపుణ్యాలూ సతి పతి సేవలో సాధిస్తుంది. సావిత్రీ, అనసూయా, సుమతీ మొదలైనవారి పుణ్యకథలు వినలేదా? నే నెందుకు ఇంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్నానో అర్థం చేసుకో. నీమీద ప్రేమలేక కాదు. లోకంలో ప్రేమించదగిన పదార్థాలలో ప్రధానమైంది తల్లి అనేదే. ఆ సంగతి నాకు తెలుసు. నన్నర్థం చేసుకుంటే మీకే విచారం వుండదు. రాజ్యంమీద నాకెన్నడూ మోహం లేదు. నే నంగీకరించటానికి తండ్రి మాటా, సంప్రదాయం కారణం. తెలియనివాళ్ళు అధికారం ఉంటే ప్రజా సేవ ఎక్కువగా చేయవచ్చని ప్రచారం చేస్తారు. అది దుస్స్వార్థంతో కూడింది. ఐశ్వర్యవంతులైతే పేదసాదలకు సాకవచ్చు. బలవంతులైతే బలహీనులకు అండదండగా నిల్చి కాపాడవచ్చు. విద్యావంతులైతే, జడ మతులను జ్ఞానవంతులుగా చక్కదిద్దవచ్చు. తపస్వులు అయితే లోక కళ్యాణం కోసం పాటుపడవచ్చు సామాన్యులైతే సంఘంలో సాధు వర్తనతో సంచరించి సంస్కరించవచ్చు. ఈ పనులకు అధికారం, పదవులూ అక్కరలేదు. నేను ఎక్కడ ఉన్నా నీ బిడ్డడుగానే ప్రవర్తిస్తాను. మన వంశానికి అప్రతిష్ఠ రానీయను. సత్యధర్మాలను వదలను. అన్నిటి కన్నా ముఖ్యమైంది ఈ శరీరం అశాశ్వతమైందని తెలిసి నడుచుకోవటం. "క్షణం చిత్తం, క్షణం విత్తం, క్షణం జీవిత మావయోః, యమస్య కరుణా నాస్తి, కర్తవ్యం ధర్మ సంగ్రహమ్" అని ప్రబోధించి, ఆశీర్వదించి అనుజ్ఞ ఈయుమని కోరాడు.

## రామవనవాసానికి కౌసల్య అంగీకరించి ఆశీర్వదించుట

ఆ మాటలు విన్న తల్లి దుఃఖం అపనయించుకొని, ఆదరంతో

దగ్గరకు తీసుకొని, చుబుకం పుణికి, జుట్టు సవరించి "నా తండ్రీ! ఇంత చిన్న వయస్సులో ఎంత నేర్చావయ్యా, ఇక నీ మనస్సుకు బాధ కలిగించను. తల్లి కోరుకునేది బిడ్డల క్షేమమేకదా. నీకీ మార్గంలో సుఖమని తోస్తే, ఆ మార్గంలోనే ప్రయాణించు. నేనభ్యంతరం పెట్టను. శుభంగా పోయి, లాభంగా రా. నీవు వచ్చేవరకూ, నేను అరణ్యాలలో నీకు ఏకీడూ రాకుండా భగవదర్చనా, భర్తృసేవాపరాయణనై కాలం గడుపుతాను. నీవు నిశ్చయించుకున్నట్లే అడవికిపోయి, తండ్రి ఋణం, నీ వ్రత దీక్ష తీర్చుకుని ప్రతిజ్ఞాపాలకుడవు కమ్ము" అని పలికి పరిశుద్ధ జలంతో వార్చి మంగళా శాసనం ఇలా చేసింది.

"రఘువంశమణీ! నిర్జితరవిప్రభా! రామా! మన్మనోభిరామా! శ్రీరస్తు, శుభమస్తు. ఏ ధర్మం నిన్నింత ధైర్య స్థైర్యుడిగా చేసిందో, ఆ ధర్మమే సదా నిన్ను రక్షించుగాక. దేవతాయతనాలు, చైత్యాలు, దేవతలు, ఋషులు, ఒంటరివై వనాల్లో తిరుగు నిన్ను కాపాడుదురుగాక! నీ సేవకు మెచ్చి కౌశిక మహర్షి ఇచ్చిన సర్వాస్త్ర శస్త్రాలు సన్నద్ధమై నిన్ను వెన్నాడుగాక. జననీ జనకుల సేవించిన ఫలమూ, సత్యఫలమూ, వనవాసాయాసం పరిహరించుగాక. అల్ప జంతువులుకానీ, క్రూర మృగాలు కానీ ప్రమాదం కల్పించక ప్రదక్షిణించుగాక! సమిధలు, దర్భలు, కొండలు, గుట్టలు, చెట్లు, పశుపక్ష్యాదులు, నీటి మడుగులు నీ అవసరాలకు తోడ్పడుగాక!

సిద్ధసాధ్యమరుద్గణం, విశ్వే దేవతలు, పితరులు, దిశాధినాయకులు, సూర్యచంద్రులు, దిన పక్ష మాస ఋతు వత్సరాలు, రేలు, పగళ్ళు, నీ శరీర రక్షణకు సర్వథా స్వస్తి భజించుగాక! శ్రుతి, స్మృతి, ధృతి ధర్మం, సత్యం, సప్త ఋషులు నీకెల్లప్పుడు సౌఖ్యం ప్రసాదింత్రుగాక! నా మ్రొక్కులందుకుని, దిక్కులు, దిక్పతులు నీకు దిక్కు అగుదురుగాక! తారలు, నదీనదాలు, కాష్ఠలు, కళలు, భూత ప్రేత పిశాచాలు నీ కనుకూలించుగాక! తేళ్ళు, పాములు, పురుగులు, ఈగలు, దోమలు, నీ శరీరాన్ని తాకకుండుగాక! త్రిమూర్తులు నీలో నివసింత్రుగాక!" అని.

రాముడు తల్లిలోని ఔన్నత్యానికి ఆనందించాడు. కౌసల్య కొడుకు వృద్ధికోసం బ్రాహ్మణులకూ, బీదలకూ, అంగవికలులకూ, విరివిగా దానధర్మాలుచేసి, ఒడలికి గంధంరాసి, అక్షతలూ, పూలూ తలపై నుంచి, తాకినమాత్రంచేతనే తలచిన పని సిద్ధింపజేసే మూలికలతో విశల్యకరణి చేర్చి బంగరు తాయెత్తులో బిగించి, కుడిదండకు కట్టి, దుఃఖసంతోష మిశ్రణమైన వాక్కులతో ఈ విధంగా పలికి సాగనంపింది. "అమృతం తెచ్చుటకు పోతున్న గరుత్మంతునికి ఏ మంగళం కూర్చిందో తల్లి, ఆ మంగళమే ఈ తల్లి నీకు కూర్చుతున్నది. వృత్రాసుర వధ సమయంలో ఇంద్రునకు ఏ మంగళ దేవతలు ప్రసన్నులైనారో ఆ మంగళ దేవతలే, జనకాజ్ఞాపాలనకై పోవు నీకు ప్రసన్నులవుదురుగాక. వామనుడు త్రివిక్రముడై వృద్ధిపొందువేళ అదితి ఏ మంగళం వాంఛించిందో ఆ మంగళమే నీకు అగునుగాక. నేను ఎల్లప్పుడు పతిసేవలో ప్రమత్తనుకాక సేవించిన ఫలం నీకు ధారపోస్తున్నాను. ఆ ఫలం పద్నాలుగేండ్లు క్షణకాలం క్రింద మార్చి తిరిగి నిన్ను అయోధ్య చేర్చి రాజ్యాభిషిక్తునిగా చేయుగాక. నా కోడలు నీ వామాంకపీఠంపై వశించుగాక.'

తల్లి ఇచ్చిన ఆశీస్సులకు రాముడు పరమానందభరితుడైనాడు. ప్రణమిల్లి ఆనందాశ్రులతో పాదాలు కడిగాడు. తల్లిని సెలవడిగి సౌమిత్రితో నిజ మందిరానికి జానకికి తెల్పుటకోసం అంజనాద్రి ఆకారంతో నడిచినట్లు నడిచివెళ్ళాడు. అక్కడ జనకజాత బయట జరిగిన సంగతులు తెలియనిది కావటంచేత, యథావిధి దేవతారాధనచేసి గంధపుష్పాక్షతలూ, ప్రసాదం బంగారు పళ్ళెరంలో పెట్టి, మల్లెల రాశిలో గులాబి వలె చెలికత్తెల నడుమనిల్చి భర్తరాకను నిరీక్షిస్తున్నది. అనేకవిధాలుగా అలంకరింపబడి శోభాయమానంగా వెలుగుతున్న ఆత్మమందిరం ప్రవేశించిన భర్తను చూచి సీత సపర్య నిమిత్తం సమీపించింది. దాచిన దాగని లజ్జతో భార్యను చూడలేక రాముడు అవాఙ్ముఖుడైనాడు.

# రాముడు సీతతో వనవాస వార్త చెప్పుట

వడిసెల రాతిదెబ్బకు పక్షివలె భర్త పెడమొగం పెట్టుటకు గిలగిల కొట్టుకున్నది. భార్య స్థితికి రాముడు నిలువరించుకోలేక వాపురు మని శోకించాడు. వెలవెలపోతున్న వదనం, స్వేదసిక్తమైన దేహం, భరించరాని దుఃఖం వైదేహిని రాతిబొమ్మనుచేసినై. మిన్ను విరిగి మీదపడినా చలించని ప్రాణేశ్వరుడు, శివధనుర్భంగంచేసిన జగజెట్టి, కౌశికయాగం రక్షించిన రణకేళి పండితుడు, తాటకను సంహరించిన పరాక్రమశాలి శోకించటం ఏమిటి? అత్తమామలు క్షేమంగా వున్నారు కదా. ఈ అకాల, అకారణ శోకం పొందటానికి హేతువేమిటో బోధ పడక, భీతచిత్తయై "నాథా! నాథా! ఇది ఏమిటి? మీరేనా దుఃఖిస్తున్నది? నేను భ్రాంతురాలను కాలేదుకదా? ఈ శుభసమయంలో ఒంటరిగా వచ్చుటకు కారణం ఏమికల్గింది? పెద్దలు నిర్ణయించిన పుష్యయోగం ఈనాడే కదా? ఏదీ? లలిత విశాలమై, నూరంచులుకలదై, మున్నీటి నురుగువలె స్వచ్ఛంగా వెలిగే గొడుగునీడలో ఎందుకు రాలేదు? శరత్కాల జ్యోత్స్న వలె ఒప్పుతున్న వింజామరలు ఎందుకు వీచుటలేదు? మధురవాక్కులతో మీవంశ ప్రతిష్ఠ, మీ విక్రమాతిశయం వందిమాగధులు ఎందుకు ప్రశంసించుటలేదు? విప్రుల వేదఘోష ఎందుకు లేదు? మీ శిరస్సుపై అభిషేక సమయంలో వుంచిన పెరుగూ, తేనె ఎందుకులేదు? రాజ లాంఛనాలైన రథంగానీ, ఏనుగుకానీ, గుర్రంకానీ లేక పాదచారులై ఎందుకు వచ్చారు? మీ ముందర మంత్రిజనం, ప్రక్కల సేనాపతులూ, వెనుక సామంత పౌరజనం కొలిచి ఎందుకురారు? మీరు ఆసీనులు కావటంకోసం రత్నఖచిత సింహపీఠం ముందు ఎందుకు కొనిపోరు? క్షణం ఎడబాటును సహించలేని మీ మిత్రులు ఎందుకు సన్నిధిలో కనుపించరు? పున్నమి చంద్రుణ్ణి హసించే మీ వదనం ఎందుకు వెలవెల పోతూంది? ఏమి చెప్పరాని అమంగళం చేరువైంది? చెప్పరా? ప్రాణేశ్వరా! చెప్పరా?" అంటూ శుక్తి విచ్చగా ముత్యాలు రాలునట్లు కంటినుంచి నీరు కాల్వకట్టగా పాదాలపై పడింది. చెప్పలేక చెప్పలేక రాముడు గద్గద కంఠంతో ఇలా చెప్పాడు.

"మైథిలీ! నీకు ఏమని చెప్పేది? చెప్పక ఎలాదాచేది? నీవు అమాయికవు కనుక తెలుసుకోలేకపోయినావు. నీవడిగిన లక్షణాలన్నీ రాజులకు కదా? రాజుగాని రామునికెందుకు ఉంటై? నన్ను తండ్రిగారు పద్నాలుగేండ్లు దండకారణ్యంలో మునివలె సంచరించుమని ఆదేశించారు. జ్ఞానులకు జ్ఞానబోధచేసిన జనకరాజునకు జన్మించావు. అయోనిజవు. మచ్చలేని ఇక్ష్వాకువంశం మెట్టావు. వీర్య శుల్కం చెల్లించిన వానిని భర్తగా పడశావు. జరిగిన సంగతి జరిగినట్లు చెపుతాను. విను. విని కలత పడబోకు. సత్యవాది అయిన నా తండ్రి పూర్వం సమరకాలంలో రెండు వరాలు సంతోషంతో పినతల్లికి ఇచ్చాడు. అవి ఇంతవరకు పదిలపరచుకున్న పినతల్లి కైకమ్మ ధర్మమార్గంగా తీర్చమని కోరింది. ఆ కోరినవి, నేను పద్నాలుగేండ్లు వనవాసం చేయటం, భరతునకు పట్టాభిషేకం చేయటం. భరతుడు వచ్చిన తర్వాత పట్టాభిషేకం జరుగుతుంది. నేను ఈనాడే, ఇప్పుడే అడవికి వెళ్ళాలి. ఈ విషయం అమ్మగారికి చెప్పి అనుమతి తీసుకుని, సోదరునికి చెప్పి శాంతింపచేసి, నీకుకూడా చెప్పి నీ అంగీకారం పొందుదామని వచ్చా. "అన్యథా చింతితం కార్యం, దైవమన్యత్రచింతయేత్" అన్నట్లు, దైవ పౌరుషాలలో దైవం ప్రతికూలమైంది నీవు అనుకోని ఈ సంఘటనకు ఆరాటపడవద్దు.

## రాముడు సీతకు నీతులు చెప్పుట

ఈ సమయంలో నీకు కొన్ని మాటలు చెప్పవలసియున్నది. అవి కూడ విశేషించి చెప్పవలసిన పనిలేదు. నీ జన్మ మట్టిది. నీ జనకు డట్టివాడు. నీ అత్తమామలు అట్టివారు. నీ భర్త నీ వెరింగినవాడు. ఇక అయోధ్యకు రాజు భరతుడు. నీకు మరది అయినను సమ్మానార్హుడు. మిక్కిలి గుణవంతుడు. తల్లివంటి నిను దర్శింప వచ్చినప్పుడు స్త్రీ సహజములైన ఎత్తిపొడుపు మాటలుగానీ, నన్నుగూర్చి పొగడుటకాని చేయకు. రాజులెప్పుడూ స్తుతిప్రియులు. వారే ఆత్మీయులు. దూషింప కున్నా, ఉదాసీనంగా ఉండేకూడ సహించలేరు. మితంగా, హితంగా మాట్లాడు. కైకమ్మ అత్తేకాక రాజమాత. రాజగౌరవంకంటే మాత గౌరవం ఎక్కువది. ఆమెపై అసూయాద్వేషాలు పెంచుకోకు. నాకు

ముగ్గురమ్మలు సమానులే. నీవు అలాగే భావించు. గతస్మృతులు వదలి పెట్టి, లోకంతోపాటిగా పదుగురిలో నేనొకతెనని భావించు. నే తిరిగి వచ్చే వరకూ ఉదయంవేళ అవసరాలు తీర్చుకుని స్నాతవై వేల్పుల పూజించు. అత్తమామలకు సపర్యలు సలుపు. నన్ను బాసిన దుఃఖంతో తపించే నా తల్లిని కనిపెట్టి ఉండు. నా సోదరులు నీకు పుత్రసదృశులుకాన ఆదరంతో వారిని చూడు. వీరపత్నివి కావున ఇంకా వివరించ పనిలేదు. రాజులు ధర్మప్రవర్తకులైనా మేకవన్నె పులులు. ప్రజా పరిపాలనలో నిష్కర్ష కలవారైనా గృహ సంబంధంలో కొంత భిన్నంగా ప్రవర్తిస్తారు. కనుక భరతునిపట్ల బంధుభావం కాక ప్రభుభావం పాటించు. నీకు సర్వథా శుభం కలుగుతుంది. ఇక పోయివస్తాను. నేను ఎక్కడున్నా సీతాపతినే. నీవు రామపత్నివే. ఏమంటావు? పోయి రానా?"

## తాను వస్తానని సీత రామునితో చెప్పుట

"విన్నాను నాథా! విన్నాను. విని నవ్వుఆపుకోలేకుండావున్నాను. ఈ నీతులు ఏ సీతనుగురించి చెపుతున్నారో తెలియటంలేదు మీసహచారిణి అయిన సీతతోనైతే ఇంక చెప్పవలసిన అవసరమేలేదు. ఎందుకంటే ఆమె మీ నీడ కనుక. బింబావున్నచోటనే నీడ వుంటుంది. బింబ ప్రతిబింబాలకు అవినాభావ సంబంధమేకదా. అటువంటి స్థితిలో భర్త అడవిలోనూ, భార్య అయోధ్యలోనూ ఉండటం సంభవమేనా? ఎవరుచేసిన కర్మానుభవం వారు అనుభవిస్తూ, తమ తమ పనులు నెరవేర్చుకుంటారు, అన్న తమ్ములూ, తల్లిదండ్రులూ, కొడుకులూ, కోడళ్లూ. భర్త సుఖదుఃఖాలు భార్యఒక్కతే పంచుకుంటుంది. మీ తండ్రి మిమ్మల్ని అడవికి పొమ్మంటే నన్నుకూడా పొమ్మన్నట్టే. నేను అత్తగారివలె, మరదివలె దుఃఖపడవలసిన పనిలేదు. అనుకూలవతికాని భార్యా, అనుకూలుడు కాని భర్తా వేరుగా జీవించవచ్చు. ఆ పోలిక మనకెలా చెల్లుతుందీ? ఆడుదానికి కని పెంచునంత వరకే తల్లి దండ్రులు. గౌరవించి పోషించునంతవరకే కన్న సుతుడు. కఠినుడైనా, కష్టుడైనా, ఏలినా, ఏలకున్నా భార్యకు భర్త ఒక్కడేగతి. "నేను తండ్రి మాట నెరవేర్చటానికి పోతున్నాను. నా వెంట నీవురా" అంటే సరిపోయే

పాటి విషయానికి ఇంతకాల హరణం ఎందుకు స్వామీ! వెంటనే నేనూ వస్తున్నాను. వివాహానికి పూర్వమే ఆడుదాని కర్తవ్యం అమ్మా, నాన్నా బోధించి మీతో పంపారు. ఇప్పుడు నేర్చుకునేదేమీలేదు. కంటితో చూడక చెవులతోవిని, మనసులో ప్రేమించిన భర్తకొఱకై ఇంద్రాది దేవతలను తిరస్కరించిందే దమయంతి? తల్లిదండ్రులనుగూడా లెక్క సేయలేదే సావిత్రి? భర్తగా గ్రహించి, సతీధర్మం నెరవేరుస్తున్న సీత ఒంటరిగా ఉంటుందని మీరెలా ఊహించారు? మీకింకా ఏదో చెప్పదలిచారు. అది నాకు తెలుసు.

"అడవులంటే అంతఃపురాలు కావు, మృగాలంటే చెలికత్తెలు కారు, రాక్షసులంటే పరిచారకులూ, కంచుకులూకారు. కందమూలఫలాదులంటే షడ్రసోపేత పరమాన్నంకాదు, కంటకశిలావృతమైన దారులంటే మణిమయ సోపానపంక్తులు కావు, ఎద్దటి నీటిస్నానం పన్నీటి స్నానం కాదు, ముండ్లపొదలు లతాగృహాలు కావు; అంటూ చెపుతారు. ఇవన్నీ నాకేనా కష్టకారణం? మీకు కావంటారా? "నేను పురుషుణ్ణి, నీవు స్త్రీవి" అనికూడా అంటారు మీరు? అంతటి పురుషత్వం మీలోవుంటే స్త్రీకి ఇంక విచారమెందుకూ? ఆత్మరహస్యం తెలిసిన ఆడుది ఏ పరిస్థితిలోనూ భర్త ఎడబాటు సహించదు. అట్లే పురుషుడుకూడ భార్యనువిడిచి వుండలేడు. సూక్ష్మంగా పరిశీలిస్తే బాహ్యబంధుత్వం విసర్జించినా, స్త్రీ పురుషుల చేరిక ఇంకో రూపంలో జరిగితీరాలి. ఆ రెండు శక్తులూ ఆధారాధేయాలు. ఇది సృష్టిరహస్యం. విచక్షణా రహితంగా కలియటం పాశవ కర్మ. మానవులకూ, పశుపక్షిమృగసరీసృపాలకూవున్న భేదం ఇక్కడే. ఈ ధర్మం అతిక్రమిస్తే, వాటికీ మనకూ తేడా ఎక్కడవుంది? "ఆహార నిద్రాభయమైథునంచ, పశుభిర్నరాణాం త్రిషుభిస్సమానః" అనిగదా మహర్షులు చెప్పారు. పురుషుడు ఎన్నో కష్టాలను భరిస్తూ ఉన్నతస్థానం సంపాదిస్తే, ఆడుది ఇంట్లోవుండి ఏ కర్మచేయకుండానే పతిసేవలోనే సాధిస్తుంది. ప్రకృతి పరమార్థం తెలియని పడతులు ఉభయభ్రష్టతా పతన మవుతారు. మీ ఉచ్చనీచస్థితులగూర్చి నేను యోచించను. మీరు ఏ స్థితిలో వున్నా నాకు దైవసమానులైన హృదయేశ్వరులు. మీ సంకల్ప సిద్ధికి నేను చేదోడువాదోడుగా ఉంటాను. నన్ను గూర్చి మీరు విచారించకండి"

అని గంగాపాత సదృశంగా చెపుతుంటే రాముడు ఆశ్చర్యానందాలు పొందాడుకాని, తనవెంట తీసుకుని వెళ్ళటానికి ఏ మాత్రం ఇష్టపడలేదు. ఆమెను అయోధ్యలో వుంచే నిమిత్తం ఇంకొకసారి ప్రయత్నిస్తూ-

## అడవికి రావద్దని రాముడు సీతను నిరోధించుట

"దేవీ! తండ్రికి తగ్గ కూతురవనిపించుకున్నావు. నిన్ను గురించీ నీ జాతిని గురించీ నీవు చెప్పిన మాటలు నూటికి నూరుపాళ్ళు నిజం. నేను అంగీకరించాను. నేను నీ రాకను ఎందుకు నిరోధిస్తున్నానో నీవు ఆలోచించకుండా సతీ ధర్మాన్ని ఏకరువు పెట్టవు. స్త్రీ సంరక్షణలో పురుషునికున్న సాధక బాధకాలు చూడలేదు. భర్తకు ఛాయ వంటిది భార్య అని చెప్పావు. నేను దాన్ని కాదనను. కాని విశ్లేషించి చూస్తే ఆనీడకు వృద్ధిక్షయాలున్నై. హ్రస్వంగానూ, నాతి దీర్ఘంగానూ, అతి దీర్ఘంగానూ, ప్రకాశానుగుణంగానూ మారుతూ ఒక సమయంలో అసలే కనిపించకుండా పోతుంది. ఇన్ని అవస్థల్లోనూ బింబం మారక యథాస్థితిలోనే వుంటుంది. ఆ విధంగానే విషయానుగుణంగా శరీరధారులు ప్రవర్తించాలి. అందుకే నేను ఎక్కడ ఉన్నా, ఏ స్థితిలో ఉన్నా సీతాపతినేయనీ, నీవు రామపత్నివనీ చెప్పాను. నీకూ నాకూ ఆంతరంగిక ధర్మాచరణంలో భిన్నత్వం లేదు. బాహ్యాచరణలో మాత్రమే ఉంది. అదే నీకు చెప్పదలచాను. మనం పోయేది నామమాత్రమైన అడవికి కాదు. దండకారణ్యానికి.

ఆ అడవి పేరు చెపితేనే మానవులు భయభ్రాంతులవుతారు. భయంకర మృగాలూ, కంటకాకీర్ణ తరువృక్ష గుల్మలతాదులూ కాక, కామరూపులైన రాక్షసులు కూడా సంచరిస్తారు. మనుష్య ధర్మం తెలియని వనేచరులుంటారు. మహా తపశ్శక్తి సంపన్నులైన మునీశ్వరులే వారిచే పడరాని బాధలు పడుతున్నారు ఒక్క మగవాడైతే శీతవాతాతపాలకు ప్రకృతి సిద్ధంగా ఉన్న ప్రదేశాలను ఆశ్రయించి బ్రతుకుతాడు. ఆడుదాని చేరికలో ఆ విధంగా కాలం వెళ్ళబుచ్చలేము. ఆలుంటే ఇల్లుండాలి. "గృహిణీ గృహ ముచ్యతే" అన్నారు కదా. గృహం అంటే

భార్య అనీ, భార్య అంటే గృహమనేకదా అర్థం. చెట్టు తొర్రల్లోనో, కొండగుహల్లోనో రాత్రి తలదాచుకొని, పగలంతా ఎక్కడైనా మగవాడు తిరుగుతాడు. ఆకో అలమో తింటాడు. దూరతీరాలకు పోయి దప్పి తీర్చుకుంటాడు. ఏదో ఒక విధంగా భార్యాభర్తలిద్దరూ సర్దుబాటు చేసుకున్నా ఆహార విహార వ్యవహారాల్లో అధిగమించలేని చిక్కులు వస్తాయి.

అన్నపానాదులలో మార్పు మగవానివలె ఆడుది సహించలేదు. ఇది శరీరాల నిర్మాణంలో ఉన్నలోపం. అడవిజాతులవారికి ధర్మం కొంత వరకు వర్తించదు; కాని, అక్కడా ఈ తేడా కనబడుతుంది. స్త్రీలో మార్దవం, పురుషునిలో కాఠిన్యం సృష్టి సహజంగా వచ్చింది. అందువల్ల ప్రధానమైన శరీరం పాడైతే చేసేదేమీలేదు. ఏ ధర్మం సాధించాలన్నా ముందు శరీరం కాపాడుకోవాలి. అందుకే "జీవన్ భద్రాణి పశ్యతి" అని శ్రుతి, "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని శాస్త్రమూ చెపుతున్నై. నే నున్నంతవరకు నిన్ను సృష్టిలోని ఏ అణువూ స్పృశించి అపకారం చేయలేదు. నేను లేని సమయంలో నీ రక్షణకు నీవు చాలవు. త్రిమూర్తులనే మోసగించగల మాయోపాయ చతురులు రాక్షసులు. రాక్షసులకు మానవులు ఆహారం. "నాకు పాతివ్రత్యం లేదా" అని నీ వనవచ్చు. లేదని నేను ఎన్నడూ అనను. ఆ శక్తి అన్నివేళలా పనిచేయదు. మానరక్షణకూ, మాంగల్య రక్షణకూ పనికివస్తుంది. తన భ్రాంతిని తానేమి చేస్తుంది? ముందుగా కీడును శంకిస్తే సతీత్వంతో ఎదుర్కోగలదు. జలంధరుని భార్య బృంద ఏమైనది? విష్ణుమాయ గుర్తింప గలిగిందా? తన భర్తయేనని త్రికరణశుద్ధిగా స్పర్శించింది. అక్కడ భర్త శివుని త్రిశూలధార కెర అయినాడు. దేవీ! అర్థంచేసుకో. నీవు లేని నా జీవితం అడవికాచిన వెన్నెల వలె వ్యర్థం అవుతుందని నాకు తెలుసు. పధ్నాలుగేండ్లూ పధ్నాల్గు క్షణాలుగా గడపివస్తాను. నేను కఠోరంగా అనుశాసించే స్థితికి నీవు సిద్ధపడవద్దు. ఆ విధంగానే జరిగితే మన అనుబంధం"—

## సీత రామునితో అడవికి వచ్చుటకు కారణం చెప్పుట

అని అంటుండగానే సీత భర్త వదనాన్ని చేత్తో మూస్తూ, హృదయం కరిగేలాగా, ప్రణయం ఉట్టిపడేలాగా తన భావం ఈ విధంగా చెప్పింది.

"స్వామీ! మీరు చెప్పిన కష్టాలు పురుషునకు భార్యతో ప్రాప్తమయ్యే మాట నిజం. సతీధర్మాన్ని గూర్చి వివరించిందికూడా నిజం. కాదని నే ననలేను. నారగుడ్డలతో మునివలె మీరు అడవికి పోతే చీని చీనాంబరాలు సీత ధరిస్తుందా? భర్త దూరదేశగతుడైతే, భార్య ముత్తయిదువ లక్షణాలు మాత్రమే కలదిగా కాలం గడుపుతుందే? ఘోరకాంతారవాస భిన్నుడుగా పతి కన్నులలో మెదలుతుంటే సతి బ్రతుకుతుందా? అది కాక నా జాతకం చూచిన సిద్ధాంతులు కొంతకాలం వనవాసయోగం వుందని చెప్పారు. సాముద్రిక శాస్త్రజ్ఞులు నా హస్తంచూచి ఈమెకు వనవాసం తప్పదన్నారు. నన్ను చూడవచ్చిన తపస్వినికూడా భర్తవెంట అరణ్యానికి పోవటానికి ఆశపడుతుందని చెప్పింది. పెద్దల సుద్దులు ఎప్పుడూ వృధకావు. నాకా యోగం ఉన్నందుననే మీ పట్టభంగం, అరణ్యవాస శిక్ష కలిగింది. నేను తోడులేక మీ సత్యవ్రత పాలనం ఎలా చేస్తారు? కర్మలు చేయటానికేకదా గార్హస్థ్యం? మనసులేని దైవపూజవలె సతిలేని పతి కర్మ వ్యర్థం. స్త్రీ పురుషుల ఒక పద్ధతిలో కూర్చే విధిని "వివాహం" అని కదా అంటారు. ఆ మాటకు విశేషమైన భారం అని కదా అర్థం. ఉభయులూ తన బరువు కాక ఇంకొక బరువు మోయాలి. కనుక మనకు తప్పదు." అని అంత చెప్పినా రాముడు ఆమె రాకకు ఇష్టపడలేదు. పతి సమాధాన వాక్యాలు అగ్నిలో ఆజ్యంలాగా హృదయాన్ని మండబెట్టగా, వేదలుకతో రాముని మొగం ఎగాదిగజూచి, అసహనంతో సీత—

## సీత రాముని నిష్ఠురము లాడుట

ఒక వంక కన్నులవెంట అశ్రువులు కారగా, పెదలు కంపించగా, డగ్గుత్తికతో, ఆపినా ఆగని క్రోధ శోకాలు మూర్తివాల్చిన విధంగా, నర్మగర్భాలైన మాటలు పలికింది.

"నాథా! సత్యవ్రతుడైన జనకుని మాటకు సత్యవ్రతుడైన పుత్రుడు సంసిద్ధపడితే ఆలి అడ్డం వచ్చిందనే అపవాదు నా కెందుకు? మీ ఆజ్ఞానుసారం భౌతికంగా సీత మీతోరాదు. అభౌతికంగావచ్చే సీతను మీరు అడ్డుకొనలేరుగా. శివధనుర్భంగంచేసిన మీచేవచూసి, పురుష సింహం అల్లుడని కాళ్ళు కడిగి కన్యాదానం చేశాడు. అట్టి నాతండ్రి, ఈ నాటి మీ నడవడిక చూచి పురుషాకారం పొందిన స్త్రీ అనుకుందే లోకం నిజమని నమ్మదా? ఆ వాదువిని ఆత్మసతి జీవించగలదా? ఎంతవరకు "ఆడుదీ, అబలా, సంరక్షించటం కష్టం" అని చెపుతారెందుకు? అన్ని అవకాశాలూ ఆలికి ఉన్నప్పుడు భర్త భరించేదేమిటి? వివాహానంతరం సంవత్సరమే ఆయు వున్నదని తెలిసికూడ సావిత్రి ఎందుకు అతనినే వరించింది? ఆమె అబల త్వానికి కాలుడెందుకు గడగడవణికాడు? మీ సమక్షంలో ఉన్నంతవరకు ఏ ప్రమాదం రాదని మీకూ తెలుసు. మీ పరోక్షంలో ఒంటరి దానిని ఏమైపోతానో అని మీ భయం. నాకాభయం లేదు. నా సతీత్వం నాచుట్టూ అగ్నివలె ప్రకాశిస్తూ వుంటుంది. నా అనుమతిలేక ఏ శక్తి నా వద్దకు రాలేదు. ఒంటరిగా విపిన భూముల్లో తిరుగుతున్నప్పుడు మీకు రక్షా కవచంగానూ ఉంటుంది. తండ్రి యాజ్ఞను మీరెలా నిరోధించలేరో సతినైన నామృత్యువును అలాగే నిరోధించలేరు. నా ఆత్మ మిమ్మనుసరించునే కాని అయోధ్యలో జీవాత్మగ సీతారూపంతో నిల్చిపోదు. మీ ఇష్టానుసారం చేయండి. నేనభ్యంతరపెట్టను" అన్నది.

## సీత రాకకు రాముడంగీకరించుట

సీత మాటలకు రాముడు దరహసితముఖుడైనాడు. ప్రేమతో దగ్గరకు తీసుకున్నాడు. కంటినీరు తుడిచాడు. అక్షరాలలో అమృతం ఒలికిస్తూ ఇలా అన్నాడు. "దేవీ! ఉభయవంశ క్షేమం కరముతైన పలుకులు పలికావు. నివంటి కోడలిని పొందిన మా అమ్మ ఎంత అదృష్ట వంతురాలు! బ్రహ్మమునకువలె నాకెందునూ భయంలేదు. నీ విధిని నిషేధరూపంగా చెప్పాను. తండ్రి ఆజ్ఞ ఉభయులం పాలించుదాము. జీవాత్మ పరమాత్మవలె మనం రూపనామభేదాలతో అభిన్నంగా ప్రవర్తించుదాము. నా నిత్యకర్మానుష్ఠానాలు నీవు లేకుండా ఎలా సాగుతవి?

నా అరణ్యవాస దీక్షలో నేను చేయ సంకల్పించిన కార్యములు నీతో కలిసి సాధించుతాను. నేను నీ యెడల విముఖుడనై కాదు వద్దన్నది. నీయందలి ప్రేమచేతనే. నా సుఖం నీవు కోరినట్లే నీ సుఖం నేను కోరుట ధర్మం కదా. నీవు అరణ్యంలోనే రాణిస్తావు అంతఃపురంలోకన్నా. నీకు భర్త ఎలాగో, నాకు జననీజనకులు, గురుదేవులు అట్టివారు. వారి ఆజ్ఞాపాలనం, వారి సంతృప్తి నాకు ఇహపరసాధనం. నీవు వచ్చుటకు సంతోషంతో అంగీకరిస్తున్నాను. నీవు విచారం దక్కి నా సర్వస్వం దానంచేయి. అశక్తులకూ, అంగహీనులకూ, భైక్షుకులకూ, అన్నవస్త్ర దానాలు చేయి. బ్రాహ్మణులకు వాంఛితార్థాలు సమకూర్తు. పరలోక సౌఖ్యానందాలకన్నా వారల ఆత్మతృప్తియే నాకు పరమానందం. నీ పరివారికలకు పారితోషికాలు పంచిపెట్టు."

తన రాకకు భర్త అంగీకరించటంతో పరవశించిన జానకి పతి ఐశ్వర్యంతోపాటు పరిణయ సమయంలో తండ్రి ఇచ్చిన అమూల్యాలంకారాలుకూడా పరమేశ్వర ప్రీతిగా భర్త సత్యవాక్య పరిరక్షణ యాత్రా ఫలసిద్ధికి దానం చేసింది. రాహుముక్త చంద్రబింబంవలె ప్రకాశింప సాగింది. ఆమె దానవృష్టికి పర్జన్యుడు సిగ్గుపడ్డాడు అశేషప్రజానీకం ఆనందకోలాహలంలో మునిగిపోయింది. కోడలుచేసిన దానధర్మాలు విని కౌసల్యాదేవి పొంగిపోయింది దూరంగా వుండి గమనిస్తున్న లక్ష్మణుడు భయసందేహాలు పెనగొనగా తనలో తానిట్లు తలపోశాడు. "అర్ధాంగి రాకకే అంత అవరోధంగా మాట్లాడిన అన్న, తన రాకకు అనుమతిస్తాడా? అనుమతించకపోతే అయోధ్యలో నాకింకేమిపని? అనుభవించవలసిన అన్నా వదినలే అంతవిరక్తులైతే, వారి పరిచర్యలో జీవితం కడతేర్చ దలచుకున్న నాకీ సంసారజంజాటం ఎందుకు? నేనూ విరక్తుడనై జీవిత శేషం గడుపుతాను. అందుకూ అంగీకరించకపోతే, అన్నపాదాలకు ఆత్మ బలిదానం చేస్తాను" అని నిర్ణయం చేసుకుని పరుగు పరుగున వచ్చి అన్న పాదాలపైబడి దుఃఖిస్తూ ఇలా అన్నాడు.

## వారితో వచ్చుటకు లక్ష్మణుడు రాముని ప్రార్థించుట

"అన్నా! ఆశ్రయించుకొనివున్న తమ్ముణ్ణి అన్యాయం చేసి

అడవులకు పోవటం నీకు ధర్మంకాదు. రామానుజ నామం లక్ష్మణునికి ఇంక ఏ విధంగా చెల్లుబాటు అవుతుంది? నీపై వదినకున్న అధికారం నాకు లేదు. నేను సేవకుణ్ణి. నా ఉనికి నీ ఆదరాభిమాన, ఆగ్రహాలపై ఆధారపడి ఉంటుంది. నన్ను మనసారా ఆత్మ ద్వితీయుడవని నీవే చెప్పావు. ఆ ప్రేమ భావం ఇప్పుడేమైంది? నాలో ఉన్న లౌకిక, పౌరుష, అహంకారాలు నీ జ్ఞానబోధతో నశింపజేశావు. ఈ ఇహ సుఖాన్ని "నీవు" అనే వరం నమ్ముకుని వదులుకున్నాను. ఇహపరాలకు దూరమైన ఈ శరీరం ఇంక నాకెందుకు? నన్ను నీ సేవకు కానిపోతావో, అనుపయుక్తమైన తనువును పరిత్యాగం చేయటానికి సమ్మతిస్తావో నీవే నిర్ణయించుకో. ఇప్పుడు నా మనస్సు నాలోలేదు. దండకారణ్యంలోపోతున్న మీ రక్షణకు చాపాన్ని ధరించి ముందుపోతున్నది. దుంపలూ, పండ్లూ, సమిధలూ సేకరిస్తున్నది. నివసించటానికి ఆశ్రయం కల్పిస్తున్నది. స్నానపానాదులకు జలంకోసం పరిసరాలలో వెదకుతున్నది. పీఠంపై దేవతామూర్తులవలె వ్యాఘ్రాజినంపై మీరు కూర్చుని ఉండే ఖడ్గం ధరించి ఆశ్రమం చుట్టూ కాపలా కాస్తున్నది. నీవులేనివేళ మాతృ దేవతకు బిడ్డవలె వదినకు సంరక్షకురాలుగా సంచరిస్తున్నది. నీవు వద్దనేది మనసులేని జడ శరీరాన్ని. ఇక క్షణకాలంలో ఇది శాశ్వతంగా జడమైపోతుంది. అమ్మా! వదినా! అన్నది వజ్ర హృదయం. నీ విషయంలోనే ఎంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించాడో స్వయంగా తెలుసుకున్నావుకదా. ఇక సేవకుని విషయంలో చెప్పేదేముంది? నీవైనా చెప్పి మీ సేవా ఫలం నాకు కలిగేటట్లు చేయి. నీ మాట కాదనలేదు. కోరలు తీసిన పాముగా నన్నుచేసిన అన్న వ్యర్థంగా బుస కొట్టి నలుగురిచే రాళ్ళ దెబ్బలూ, కర్ర దెబ్బలూ తిని బ్రతకమంటున్నాడు" అన్నాడు.

తమ్ముని మాటల్లో ద్యోతకమవుతున్న నిర్దిష్టమూ, నిష్కృష్టమూ అయిన భావం రామచంద్రుణ్ణి ఆపాదమస్తకం కదిలించివేసింది.

## రాముడు లక్ష్మణుని అయోధ్యలో నుండుమనిచెప్పుట

ఏం చెప్పటానికీ నోరు రాలేదు. కొంతకాలం మౌనంగా ఉండి, తమ్ముణ్ణి ఆలింగనము చేసుకొని, సత్యప్రియూతైన కొన్ని మాటలు

చెప్పాడు. "తమ్ముడా! నా హృదయం తెలిసికూడా నన్ను శంకిస్తున్నావా? మీ వదిన ఎడబాటైనా కొంత సహించగలనేమోకాని నీ యెడబాటం నిజంగా నేను సహించలేను. నిన్ను రమ్మని చెప్పక పోవటానికి కొన్ని కారణాలున్నై. వాటి పరిష్కారం నీవుగానీ, నేనుగానీ చేయవలసిందే. ఇతరులకు సాధ్యమైతే సంతోషంతో మిందేరమ్మని చెప్పేవాణ్ణి. అనకూడదు కాని, నా కంటే నీవు సర్వగుణసంపన్నుడివి. ఇప్పటి పరిస్థితులన్నీ నీకు తెలుసు. నేను పోవటానికే అంత అంగలార్చిన తల్లి నీవుకూడా లేకపోతే ఏమవుతుంది? పినతల్లి ఏమవుతుంది? అభం శుభం తెలియని మరదలు ఊర్మిళ ఏమవుతుంది? మనతండ్రి స్వస్థుడుగాలేడు. ఏ సమయంలో ఏమి వుపద్రవం వస్తుందో చెప్పలేం. రాజు కావలసిన భరతుడులేడు. చక్కపెట్టవలసిన తండ్రి కైకమ్మ ఇంటిలో కాపురం. ఆయన చేసిన పని తెలిస్తే ప్రజల ఆగ్రహం గట్లు తెంచుకుంటుంది ఈ కల్లోలానికి కారణం మంత్రుల సహాయంతో మన అమ్మలు చేస్తున్నారని ఆమెకు ఆగ్రహం. అందుపై ఆమె మంత్రాంగం. పెంచిన నన్నే కఠినంగా మాటలతో నొప్పించిన పినతల్లి సపత్నుల పట్ల సమరసభావంతో వుండటం కష్టం. మనసు మారిన ఆమె మాటలకు కామపాశబద్ధుడైన తండ్రి కాదనలేడు. భరతుడెంత మంచివాడైనా "సహవాసయాదోషగుణాభవంతు" అన్నట్లు, తల్లిమాట తలకెక్కకపోదు. నీవిక్కడవుంటే నేనున్నట్లే అని ధైర్యంతో వ్రతపాలనం చేసివస్తాను. వచ్చిన అనంతరం నీ వాంఛ తీరుస్తాను నామాట దాటనివాడవు, నా వాడవు, అన్నమాట అపార్థం చేసుకోకు. అన్నిటినీ సరిపెట్టుకున్నా, మరదలి విషయం మాత్రం నాకు హృదయ విదారకంగా వుంది. ఆమెను కూడా కొనిరమ్మంటానికి అమ్మలగతి ఏమిటి? ఆలనా పాలనాలేని అనాథల వలె వారు అల్లాడిపోతారు. నిన్ను ఒంటరిగా రమ్మంటానికి నాది వజ్రంతో చేసిన హృదయంకాదు. నా నిష్ఠురత దుష్టశిక్షణంలోనే కాని శిష్టరక్షణంలోకాదు. ఈ స్థితిలో నా కర్తవ్యమేమిటి? "భార్యతో అడవికి పోతున్న రాముడు భార్యను వదలి తన సేవకు తమ్ముణ్ణి రమ్మంటం ఏం ధర్మ"మని లోకులు దుమ్మెత్తిపోస్తారు. "భర్తకు లేకపోయినా, బావగారికైనా జాలిలేకపోయిందా? ఆడుది ఐన అక్కగారికి ఆపాటి ఆలోచన

రాలేదా?" అని మరదలు భావిస్తే ఆ పాపం నాకురాదా? తమ్ముడా! చెప్పు. నీవే చెప్పు. నీవు చెప్పినట్లే వింటాను. మన వంశగౌరవం, మనగౌరవం ఎలా దక్కుతుందో చెప్పు" అన్నాడు.

లక్ష్మణుడు, అన్నమాటలకు ఖిన్నుడైనాడు. ఆయన చిత్రించిన గృహానుబంధచిత్రం, నీటిలో మంచిపెడ్డవలె రామాంకితమైన మానసంలో కరిగిపోయింది. ఆ స్థానంలో అగ్రజుడు చిత్రించిన బొమ్మకు బదులు వేరొక బొమ్మవచ్చి నిల్చింది. ఆ బొమ్మలో-

## లక్ష్మణుని రాకకు రాముడు సమ్మతించుట

పెద్దమ్మలైన కౌసల్యా సుమిత్రల పాదసేవలో పరవశించిన భరతుడున్నాడు. తమతమ పెండ్లివేళల తండ్రులిచ్చిన మణిమాన్యాలూ, రాణులుగా గౌరవం పొందటానికి సర్వాధికారంగా భర్త ఇచ్చిన ఐశ్వర్యంతో కూడిన రాజలాంఛనాలూ, ముప్పొద్దులు వేళతప్పక పూడిగం చేసే పరిచారకులూ, సంతర్పణలతో తృప్తిపడి "చిరకాలం వర్ధిల్లండి తల్లులారా!" అంటూ దీవించిపోయే అర్థులూ, ఆశ్రితులూ, పశ్చాత్తాప తప్తుడైన పతిముఖ్య వుండగా ఇరుపైపుల ఉపచారంచేస్తున్న కౌసల్యా సుమిత్రలూ, తనయుని ఎడబాటుకు తల్లిగానీ, భర్త ఎడబాటుకు భార్యకానీ విచారపడక అక్కడ సన్నిధానంలో అమ్మ, మనోహరుని క్షేమం కోసం మహాతపస్సమాధి మగ్నయైన భార్య ఉన్నారు. పుష్యయోగ సమయంలో రాజ్యాభిషేకం కోసం అలంకరించిన సింహాసనం శూన్యంగా ఉంది. తాను చేసిన పనికి తరుణోపాయంలేక సిగ్గుతో తలవంచుకుని తల్లడిల్లుతున్న కైక వుంది. అన్నను ఆ చిత్రం చూడమని లక్ష్మణుడన్నాడు.

ఆ చిత్ర దర్శనంతో రాముడు మారుమాట చెప్పక అనుసరించుటకు అనుమతిచ్చాడు. తమ్ముణ్ణి మనసారా, నోరారా పిల్చాడు. పిలిచి, "మామగారి యజ్ఞ సమయంలో ప్రచేతస మహర్షి ఇచ్చిన భీమ, దర్శనాలనే రెండు ధనుస్సులూ, వజ్రాన్ని అపహసించే రెండు ఖడ్గాలూ, రెండు అభేద్య కవచాలూ, రెండు అక్షయతూణీరాలూ, మన గురుదేవులైన వశిష్ఠ మహర్షుల ఆశ్రమంలో అర్పనా నిమిత్తం ఉంచాను. వనవాస సమ

కొన్ని పండ్లూ తెచ్చుకుని తన ధర్మాలను నెరవేర్చుకుంటూ కుటుంబాన్ని పోషిస్తున్నాడు. ఆరోజు అడవినుంచి రాగానే భార్య భర్తతో ఇలా అంది. "స్వామీ! శ్రీరామచంద్రుడు అరణ్యానికిపోతూ సంచులకొద్దీ సంతర్పణలూ, దానధర్మాలూ చేస్తున్నాడట. ఖజానా అంతా కరిగించి వేస్తున్నాడట. మీరుకూడా ఆయనను ఆశ్రయిస్తే మన దారిద్ర్యం పోతుంది. పోయిరండ"ని చెప్పి పంపింది. ఆ విప్రుడు ఆలి చెప్పినట్లే, చిరిగినగుడ్డలు దాల్చి, రామదర్శనానికి పోయాడు. ఆ నిరుపేద పారుని, ఆ జీర్ణాంబరధారిని, ఆ సిలపర్ణ రాయని, ఆ జరామూర్తిని, ఆకారమాత్ర మానవ వృద్ధుని, రామప్రాసాదము గాచే భటులు అయిదవ ప్రాకారం వరకూ అడ్డగించలేదు. కారణం రామాజ్ఞ. ఏ సమయంలోనైనా, ఏ పరిస్థితిలోనైనా, బాధల్లో వుండి దర్శించవస్తే అభ్యంతరం పెట్టరాదని ఒక సారే శాసించటం జరిగింది. సమప్రదేశంపై బండిపలె తిన్నగా నడిచి రామచంద్రుణ్ణి దర్శించి దీవించాడు. ఆ వృద్ధ బ్రాహ్మణుని వాలకంచూసి, లోపల చాలా బాధపడ్డాడు. "ఆఖరు ఘడియల్లో వచ్చేదే" అని అభిమాన పడ్డాడు. అయినా వెనుకాడక, "స్వామీ! తమ రాకకు కారణం ఏమిటో సెలవిస్తారా?" అని నమస్కరించి సప్రశ్రయంతో ప్రశ్నించాడు.

"అయ్యా! నేను గర్గముని కుమారుణ్ణి. నా పేరు త్రిజటుడు. నిరుపేదను. బహుళసంతానం కలవాడను. అడవిలో ఉంఛవృత్తితో జీవిస్తున్నాను. దైవికంగా ఇక్కడకు రావటం జరిగింది. మీ వితరణ ప్రజలూ, నా భార్య చెప్పితే విని మీ దర్శనార్థంవచ్చాను ప్రభువుల ఔదార్యం, పిల్లల అదృష్టం" అని సమాధానం చెప్పాడు.

"స్వామీ! ఇప్పుడు నావద్ద వేయి ఆవులు మాత్రమే వున్నవి. తాము విపరీతంగా భావించక మీ చేతిలోనున్న కర్రను మీరు ఎంతదూరం విసరగలరో అంతమేర భూమి, ఆ ఆవులూ ఇస్తాను" అన్నాడు. వృద్ధుడు ఆ మాటలు విని, మనస్సులో సంతసించి, పంచె వెనుకకులాగి దోపి, పైగుడ్డ నడుముకుచుట్టి, కుడికాలు ముందుకుచాచి, గాలి పూరించి, చేతిలోనున్న దండాన్ని గిరగిరా త్రిప్పి విసిరాడు. ఆ బ్రాహ్మణకర నిర్ముక్తమై దండం వాయువేగంలో పయనించి అర్ధయోజన దూరంలో వున్న సరయూనదీ సమీపాన గ్రాసం - మేస్తున్న ఆలమందలోపోయి

పడింది. అదిచూచి రాముడు ఆశ్చర్యం పొందాడు. అధికారులను పిలిచి ఆ ధేనువులనూ, ఆ మేరకు భూమినీ విప్రోత్తమునకు సంక్రమింపచేయ మని చెప్పాడు.

"అయ్యా! భూసురోత్తమా! వృద్ధులైన మిమ్ములను వృధాగా ఆయాసపెట్టాను. అందుకు క్షమించండి. మీలో దాగివున్న బ్రహ్మ తేజం నేనేకాక లోకంకూడా గుర్తించాలనీ, ఇంతశక్తివున్నా, సామాన్య సంసారపోషణకు వినియోగించకుండా, కష్టమైనవృత్తితో కాలం వెళ్ళ బుచ్చుతున్న మీ యోగ్యత మానవులందరికీ ఆదర్శంకావాలనీ, ఈవిధంగా కోరాను. మీ అపురూపమైన శక్తికి ఆనందించాను. ఇంకా నావద్ద కొద్ది ధనమేవుంది. అదికూడా గ్రహించి నన్ను ధన్యుణ్ణి చేయండి. జానకీ! నీవద్ద ఏమైనావుంటే ఈయన గృహిణికి, పిల్లలకూ ఇవ్వు" అని అన్నాడు. త్రిజటుడు దానం గ్రహించి "రామప్రభూ! త్యాగదానాలు రఘువంశ్యులకు వెన్నతో పెట్టిన విద్య. నాకు నీ వనవాసవృత్తాంతం, నీవు సర్వస్వం దానంచేస్తున్నావన్న విషయం తెలుసు. ఐనా నేనై నిన్ను కోరదలుచుకోలేదు. నా ఆడువి కుటుంబభారంవల్ల పడుతున్న కష్టాలుచెప్పి నీ దర్శనానికి పొమ్మంటే వచ్చాను. ఆమె దాని అభిమతం యుక్తమైనదయితే భర్త అవశ్యం తీర్చటానికి యత్నించాలి. అందుకే వచ్చాను. ఆమె ఆనందానికి హద్దులేనంతగా నీ దయాహృదయంతో పొందాను.

అవసరానికి మించిన ఐశ్వర్యం మనుష్యులకు మంచిదికాదు. అది సోమరితనానికీ, దుస్వార్థ ప్రయోజనాలకూ కారణం అవుతుంది. ఇక ఏమీ వద్దు. మీ పూర్వులను మరపించావు. నీ అరణ్యవాసవ్రతం ఆధివ్యాధులు అడ్డు రాకుండా, లోకకళ్యాణకరంగా పరిణమించుటకు, నాలో ఏశక్తి అంతర్నిహితంగా వుండి నిన్నాశ్చర్య చకితుణ్ణి చేసిందో ఆ శక్తిని నీకు ధారపోస్తున్నాను. సీతా లక్ష్మణ సహితంగా క్షేమంగా తిరిగివచ్చి రాజ్యపరిగ్రహం చేయుదువుగాక" అని దీవించి ఇంటికి వెళ్ళాడు. వెనువెంటనే ఆయన గ్రహించిన దానానుసారం అధికారులు దఖలు పరిచారు.

## తండ్రిని చూడబోయే సీతారామలక్ష్మణులపై ప్రజలు దుఃఖించుట

శిరస్స్నానం చేసినవాని శరీరంలాగా తేలికపడిన రాముడు తండ్రిని చూడటానికై భార్యతోనూ, తమ్ముడితోనూ కలసి ప్రాసాద సోపానాలు దిగుతుంటే ప్రజలు గొల్లుమని ఏడ్చారు. కొందరు పాదాలపై పడ్డారు. కొందరు గుంపుగా అడ్డం వచ్చారు. "మా గతి ఏమిటి? మమ్మేంచేసి పోతున్నారు?" అని నిలదీసి అడిగారు. కొందరు దూర దూరంగా నిల్చి దుఃఖించసాగారు. కొందరు మేడలెక్కి చూచారు. కొందరు చెట్లపైకి ప్రాకారు. కొందరు ఉన్నత ప్రదేశం కనబడితే చాలు, విచక్షణా రహితంగా అధిరోహించారు. అశేష ప్రజానీకం హాహాకారాలతో, ఏదో కోల్పోయినట్లు గుండెలు బాదుకుంటుంటే, ప్రాకృతిక భావనాదూరులై, పాదచారులై, రాజ వీధుల వెంటబడి పోవసాగారు. వారినిచూచి పౌరులు వాపోతూ, బిగ్గరగా అక్కృస్సు ఆపుకోలేక ఇలా అన్నారు, "రాజపుత్రులకు ఉచితములైన ఛత్రం, చామరం, స్తుతి, వేదపఠనం లేకుండా బాటసారివలె పోతున్నావా ప్రభూ? పరివారకులేమైనారు? పరివారం ఏమయింది? మంత్రి సేనాపతులెక్కడ? అంగరక్షకులేరీ? అయ్యయ్యో! ఎంత కష్టం ప్రాప్తించింది? మా చిన్నబాబు రాజుకావాలనీ, మమ్మందరిని ఏలుకోవాలనీ రోజూ వేయి దేవుళ్ళకు మొక్కుకున్నామే. చివరకు మా ఆశ అడియాస అయిందా? బూడిదలో పోసిన పన్నీరైందా? సర్వసర్వంసహా పాలకునకు పెద్ద బిడ్డడై, సుఖసంతోషాలలో తులతూగవలసిన వాడు పాదరక్షలైనా లేకుండా వీధుల్లో పోతుండే చూచి ఏడ్వమని మా మొగాల్లో విధి వ్రాశాడా? ఏమి ఈ వైపరీత్యం? లోకంలో ఎక్కడైనా వుందా? ఇప్పుడు మన కర్తవ్యమేమిటి?

## కైకేయీ దశరథులను పౌరులు నిందించుట

మనముందు పట్టాభిషేకం చేస్తానని మాట ఇచ్చి, ఇప్పుడీ విధంగా ఎందుకు మాట తప్పాడో, ఏం తప్పు చూచి మా బాబయ్యకు ఈ శిక్ష వేశాడో ఆయన్నే నిలబెట్టి అడుగుదాం. ప్రజాభిప్రాయం కావా

లంటూ పెద్ద సభచేసి మమ్మల్ని వంచిస్తాడా ఈ రాజు? మా తాతలు, ముత్తాతలు, వారి తాతలు కూడా ఎరుగని ఈ పని ఎందుకు చేశావని అడిగితే ఏం చెపుతాడో విందాం. మా రామయ్య రాష్ట్రం ఎలా దాటి పోతాడో మేమూ చూస్తాం. దెయ్యం పట్టినవాడిలాగా, పెళ్ళాం మరులు కొలిపితే కన్నకొడుకును కానలపాలు చేస్తాడా? లోకంలో చెడ్డవాడైనా బిడ్డను దండించడే? ఈయన గుణవంతుడైన కొడుకునే దండిస్తున్నాడు. ఇంక ఏ మొగంతో మమ్మల్ని చూస్తాడు? ఆ కైకమ్మ ఆడమన్నట్లు ఆడతాడా? పెద్దతనం వచ్చి బుద్ధి పెడతల బట్టిందా?

మహిమలుగల దేవతలకే కానరాని మా సీతమ్మతల్లి అందరికీ కనబడుతూ అయ్యోయ్యో! ఎలా నడిచిపోతున్నదో. కోపంవస్తే ఏడేడు పధ్నాలుగు లోకాలనూ భస్మీపటలం చేసే లక్ష్మయ్యబాబు తలవంచుకుని అన్నవెంట ఎలా వస్తున్నాడో. ఈ బుద్ధిలేని ముసలిరాజూ, పగబట్టిన పాము కైకమ్మా మనకెందుకు? మా రామయ్య తండ్రి, సీతమ్మ తల్లి, లక్ష్మయ్యబాబూ ఎక్కడికిపోతారో మనం అక్కడికే పోదాం. వారున్న చోటనే వుందాం. ఈ తోటలెందుకూ? పేటలెందుకూ? ఈ ఇళ్ళూ వాకిళ్ళూ ఎవరిక్కావాలి? ఇళ్ళల్లో నిల్వవున్న నిధి నిక్షేపాలు పెల్లగించి, ధనం తులు పాడుబెట్టి, పశువుల పలుపులు సడలించి, దేవుళ్ళనూ, అగ్ని హోత్రాలనూ తీసుకుని మనంకూడా అడవికే పోదాం. మనం వదిలి పెట్టిన కొంపల్లో జిల్లేళ్ళు, పల్లేరు, తుమ్మలూ, వుమ్మెత్తలూ మొలుస్తాయి. ఎలుకలు తవ్వి పోసిన మట్టిరాసులతో, పాడుపడ్డ ముంగిళ్ళతో, దుమ్ము నిండి, బూజుపట్టి గబ్బిలాలకూ, పాములకూ, తేళ్ళకూ, పిశాచాలకూ ఆవాసమైన అయోధ్యా నగరంలో కొడుకుకు పట్టం గట్టుకొని కైకమ్మనే కులకమను. ఆమె అనుగ్రహంలో ఆ ముసలయ్యను బ్రతకమను. గుంపుగట్టి మనం అడవుల్లోనికిపోతే, అక్కడవున్న పులులూ, సింహాలూ, తోడేళ్ళూ, నక్కలూ, ఎలుగుగొడ్లూ, అడవి దున్నలూ, పందులూ భయపడి ఎక్కడా తావులేక ఇక్కడ చేరి తలదాచుకుంటై. అప్పుడు ఆ అడవి అయోధ్యగా మారుతుంది. రామయ్య తండ్రి మనకు ఏలిక అవుతాడు. సీతమ్మ చల్లని చూపుల్లో పల్లవించి పోతాము. అడవిగా మారిన అయోధ్యలో ఆ కొడుకును పెట్టుకుని ఆ దంపతులు పిశాచసంసారం

చేస్తుంటాడు. మన పెద్దలందరూ ప్రయాణ సన్నాహం సాగించమని దండోరా వేయించండి" అన్నారు.

## తండ్రికి తన రాక రాముడు ఎఱిగించుట

కడుపు మంటతో కఠినంగా మాట్లాడుతున్న ప్రజలవంక చూడ లేక, తల దించుకుని వెండికొండ లాగా వెలిగే తండ్రి మందిరానికి చేరువగా పోయి, అవనతమస్తకుడై, ఎఱ్ఱవారి కన్నుల వెంటవస్తున్న వేడినీళ్ళను, గోటితో చిమ్ముకుంటూ, జరిగిన సంఘటనాన్ని పునశ్చరణ చేస్తూ అనుస రిస్తున్న సుమంత్రుణ్ణి చేరపిలిచి, రాముడు తన రాకను తండ్రికి తెలిపి రమ్మన్నాడు. వెంటనే సుమంత్రుడు రాజాంతఃపురంలోనికి పోయి, నీరు జల్లిన నిప్పులాగా, బలహీనమైన తటాకంలాగా, గ్రహణం బట్టిన దినకర బింబంలాగా, దుఃఖభారంతో క్రుంగి, కృశించి, "రామా, రామా!" అంటూ అలమటించి పోతున్న వృద్ధరాజునకు స్వస్తిపలికి, గాద్గద్యంతో, "ప్రభూ! మీ పెద్దకుమారుడు తన సర్వస్వం దానధర్మాలకు వినియోగించి, భార్యా సోదర సహితుడై, మీ దర్శనం చేసుకొని అడవికి పోవటానికి సిద్ధమై వచ్చాడు త్వరగా దర్శనం మీరు ఇప్పిస్తే చూచి వెళ్ళిపోతాడు" అంటూ చెప్పాడు. "మంత్రీ! నేను ఒంటరిగా మా రామయ్యను చూడను. భార్యా సహితంగా చూడదలిచాను. నా యాజ్ఞగా అంతఃపుర స్త్రీ జనాన్ని కొనిరా" అని చెప్పాడు. ఆయన ఆనతి ప్రకారం మూడువందల ఏబది మంది సతీ మణులను, రామ వియోగానికి వాడి వత్తులవుతున్న వారిని, కౌసల్యా సుమిత్రలతో నైక గృహాన్ని చేర్చాడు. వారందరు తన మందిరంచేరారని తెలిసి రాజు, రాముణ్ణి రమ్మని చెప్పవలసినదిగా సుమంత్రునకు చెప్పాడు.

## సీతాలక్ష్మణసమేతుడై వచ్చిన రాముని రాజుచూచుట

మేఘం వెంట మెరపుల్లాగా, భార్యాసోదరులు వెన్నంటివచ్చు చుండగా, ఉన్నతోన్నతమైన మహారాజ ప్రాసాదం మెట్లు ఒక్కొక్క టిగా ఎక్కుతూంటే, మాగిన ప్రేమపు ప్రాణాలు,యమభటులు పాశంతో ఒక్కొక్క స్థానంనుంచి పైకి లాగుతున్నట్లు మరణావస్థలో నున్నవి.

పూర్వం ఇంతమంది అంతఃపురకాంతలు ఒక్కచోట, అందులో కైకేయి వున్న గృహంలో కలిసికొనటం జరుగలేదు. వాళ్ళందరి మనస్సుల్లో కైకపై అసహ్య భావం అలముకున్నది. పతి ఆజ్ఞ మీరనివాళ్ళు కనుక ఆ ఇంటికి వచ్చారు కాని, లేకపోతే ఎన్నడూ రారు. కన్నవాళ్ళు కాకపోయినా అందరికీ రాముడంటే పుత్రవాత్సల్యమే. లక్ష్మణుడు తన ఇంట్లో, తప్పితే పెద్దమ్మ కౌసల్య ఇంట్లో తప్ప ఇంకెవరింటికీ ఎప్పుడూ పోడు. భరతశత్రుఘ్నులు అయోధ్యలో ఉండటం తక్కువ. ఇక శ్రీరాముడు పిలిచినా పిలవకపోయినా ఏదో సాకుతో అందరు తల్లుల ఇండ్లకువెళ్ళి పరామర్శించి, వాళ్ళ ఆదరాభిమానాలు చూరగొన్నాడు. అదికాక రామునితో ఒక్కమాట మాట్లాడినా, అతణ్ణి ఒక్కసారి చూచినా ఇక జీవితాంతం మరువలేరు. అందరికీ తలలో నాల్కలాగావున్న వాడిని అన్యాయంగా అడవులకు పంపించే స్త్రీరూప పిశాచాన్ని ఎవరు గౌరవిస్తారు? ఆమె అంటే అందరికీ రోత పుట్టింది. రాముని ఎడబాటు ఎవరు సహిస్తారు? జగదీశుడైన రాముడు వగచెందుతుంటే జగత్తు సంతోషిస్తుందా? వేరు కుళ్ళితే, వృక్షం ఆకులూ, పూలూ, పండ్లూ కలిగి శోభిస్తుందా? రాముడు నిండు ప్రవాహంలాగా, నవ్వు వెన్నెలకురుస్తున్న వదన చంద్రునితో తండ్రిని సమీపించాడు. వస్తూన్న రాముణ్ణి అల్లంతదూరంలో చూచి "రామా! వచ్చావా! ఏదీ! నన్ను ఆలింగనం చేసుకోనీ" అంటూ విసురునలేచి, రెండు చేతులూ ఏనుగు తొండంవలెచాచి పరుగున ముందుకు నాల్గడుగులువేసి, చాపచుట్టగా తూలి నేలపై పడ్డాడు. అంతఃపురం స్త్రీల హాహాకారాలతో మందిరాంతర్భాగమంతా మార్మ్రోగుతున్నది. గబగబ రామలక్ష్మణులు పడిన తండ్రిని బలంగా పైకి లేవనెత్తి మంచంపై చేర్చి వుపచారం చేస్తున్నారు. వారి సేవతో కొంత తేరుకుని, కొడుకులపై చేతులువేసి, కౌసల్యాదేవిని ఆనుకుని కన్నులు మెల్లగా తెరచి నాల్గువైపులా కలయ చూశాడు.

## సతీ సోదరులతో అడవికి పోవుటకు రాముడు అనుజ్ఞ వేడుట

పిచ్చివానివలె, సర్పదష్టునివలె, మూర్ఛునివలె దిగాలుపడి

చూస్తున్న తండ్రి దైన్యస్థితికి లోలోన కుంది, తండ్రిని సత్యవాక్య పాలకునిగా చేయ నిశ్చయించుకుని ధైర్యంతో రాముడు ఇలా చెప్పాడు.

"తండ్రీ! నాకోసం విచారపడకు. మీ ఆజ్ఞ నాకొక్కడికే అయినా సీతనూ, తమ్ముణ్ణీ వెంట కొనిపోతున్నాను. అనేక విధాలుగా వీళ్ళకు నచ్చచెప్పాను. కాని, వారి మనోనిశ్చయాన్ని మార్చలేక పోయినాను. గట్టిగా రావద్దని చెపితే, ఆత్మ హత్యకు పాల్పడేస్థితిలో ఉన్నారు. ఆ విధంగా జరగడం ఇష్టంలేక, కాననవాసం కష్టమైనా ఇష్టపడ్డాను. తమ్ముడు భరతుణ్ణి పిలిపించి పినతల్లిగారికి సంతోషకరంగా పట్టాభిషేకం చేయండి. వికలమైన మనస్సుతో మీరు రాజ్యం పాలించలేరు. రాజ్యం అరాజకం కాకుండా త్వరగా ఆ పని పూర్తిచేయండి. ఈ దుర్ఘటనకు పౌరులూ, సామంతులూ ప్రతి క్రియాభావాన్నిపొంది రహస్య మంత్రాలోచనలతో తిరుగబడకుండా చూడండి. నేనీ రాజ్యాభిషేకానికి అంగీకరించటంకూడా మీ ఆనందం కొరకే. నా కెప్పుడూ రాజ్యంపై మమకారంలేదు. నాకు లేనట్లే తమ్ముడు సౌమిత్రికి కూడాలేదు. అతనికి ఆ బుద్ధేపుండే మానవులే కాదు, దేవతలు సైతం అడ్డుకొనలేరు. నిష్కారణంగా ఎందుకు తనంత తాను వనవాసం విధించుకుంటాడు? లేదని చెప్పటానికే! పద్నాలుగేండ్ల అనంతరం మళ్ళీ మీ పాదాభివందనభాగ్యంపొందుతాను. ఆశీర్వదించి అనుజ్ఞఈయండి" అన్నాడు. ఆ పలుకులు ములుకులవలె చెవుల్లోనాటి, తల దిమ్మెక్కి, నెత్తి బాదుకుంటూ, "నాయనా! రామా! యౌవన మదంలో, అధికార దర్పంలో, లోకంతోపాటు, ప్రాణరక్షణం చేసిందనే ప్రీతితో ఈ దుర్మార్గురాలికి 'రెండు వరాలు ఇస్తున్నాను, ఎప్పుడైనా కోరుకో. తప్పక నెరవేరుస్తాను' అని మాట ఇచ్చాను. వేలసంవత్సరాలు గడిచినై. ఇప్పుడవి తీర్చమని పట్టుబట్టింది. దుష్టమోహపాశబద్ధుణ్ణి కనుక, ముందాలోచన లేకుండా "తీరుస్తా"నని నీ మీద ప్రమాణంచేసి చెప్పాను. ఆ అవకాశాన్ని ఈ దుర్మార్గురాలు, ఏ ఆడుదీ చేయలేని ఈ దుస్సాహసం చేయటానికి వినియోగించుకుంది. నీ వంటి పుత్రుణ్ణి, సకల జనానంద కరుని, కఠిన కాంతారంపాలు చేసిన నికృష్ట జీవిని. నాకు నరకంగాక ఉత్తమ గతులెలావస్తయ్? నామాట తిరస్కరించి, ఈభూమండలమంతా ఏక

తంత్రంగా ఏలుకో. నీకీపనివల్ల పాపంరాదు. నారాయణద్వేషి అయిన హిరణ్యకశిపుని ఎదిరించి ప్రహ్లాదుడు భక్తుల్లో అగ్రేసరుడు కాలేదా? తండ్రీ! నేను స్వయంగా నిన్ను అరణ్యానికి పొమ్మని చెప్పలేను. ఇప్పుడు నేనా కార్యాన్ని నిరోధిస్తున్నాను ఇదే నీ తండ్రి యాజ్ఞగా దీని పాలించు" అని రాముని రెండు చేతులూ పట్టుకొని దశరథుడు ప్రతిమాలాడు.

## శ్రీరాముడు తన నిశ్చయాన్ని తండ్రికి చెప్పుట

రాముడా పలుకు లాలించి "జనకా మీరెందుకింత బాధపడతారు? రాజు, రాముడైతే ఏమి? భరతుడైతే ఏమి? ఇద్దరం మీ బిడ్డలమే కదా? నాకా, రాజ్యంపై వాంఛ లేదని ముందే చెప్పాను. అది అంగీకరించటం మీ ఆనందం కోసమనే చెప్పాను. సత్యవాక్య పాలకులలో ప్రథములుగా పేరెన్నికకన్న మీరు నామీది వ్యామోహంతో అసత్య వచనుడనే అపకీర్తికి పాల్పడతారా? కామమోహితుడనై, కాని పని చేశానన్న మీరే, పుత్రవ్యామోహంలోపడి ఇంకొక కానిపని చేస్తారా? ఇప్పుడేమి పుట్టి మునిగింది? నేను మళ్ళీ వచ్చేవాడినే కదా. నేను అడవుల్లో కష్టాలు పడతానేమోయనే భయంతో మాట తప్పవలసిన పని అసలే లేదు. సుఖసంతోషాలు పంచుకునే భార్య, నాకై శరీరాన్ని త్యాగంచేసి రక్షణ నిమిత్తం వస్తున్న తమ్ముడూ వుండగా, ఇంక కష్టమేమిటి? "రాజభోగాలనుభవించిన సుకుమారదేహులు, గ్రీష్మవాతాతపాలకూ, కందమూలఫలాశనానికీ ఏవిధంగా తట్టుకోగల"రని బెంగపెట్టుకోనక్కరలేదు. శరీరతత్వం తెలిసినవారెవ్వరూ అందుకు బాధపడరు. అసలు దానికి ఏమీ అక్కరలేదు. ఏది అలవాటు చేస్తే అంతకే తృప్తిపడుతుంది మార్పుచేస్తే, కొద్దికాలం వ్యతిరేకించినా, మరల దానితో సరిపెట్టుకుంటుంది మానవులే కదా మహర్షులంతా? వారిని ఈ ప్రకృతి ఏమి బాధించింది? మేమూ ఆ మహర్షుల ధర్మాన్నే ఆచరించుతాము. ఈ అల్ప విషయానికి యుగయుగాలుగా మన వంశంలో వస్తున్న ఈ సత్యవ్రతం, ఇంతవరకూ విగుణీకృతంగా నెరవేర్చిన మీరు, నాకై భంగపరచవద్దు. సర్వదేవతలు మెచ్చే అశ్వమేధం చేశారు. ఎవ్వరూచేయని

పుత్రకామేష్టిచేసి ప్రజాపత్యపురుషుణ్ణి సంతోషపరిచాను. తనుగని ఐశ్వ ర్యంలో దానధర్మాలు, అతిథి పూజలు చేశారు. బ్రహ్మణ్యుల అమోఘ మలైన ఆశీస్సులనందుకున్నారు. కాలదోషాలైన కరువు, కాటకాలూ, కంపనాలు, ఉప్పెనలూ, రోగాలూ, అకాల మృత్యువులు లేకుండా, ప్రజలు గుండెలపై చేతులు పెట్టుకుని సుఖించేలాగా పాలించారు. వంశోద్ధారకులైన నల్గురు కొడుకులుంగని పున్నామనరకం జయించారు. ఇటువంటి మీకుగాక, వుత్తమగతులు ఇంకెవరికి వస్తాయ్? మీరు గతాన్ని మరిచి, వర్తమాన భవి ష్యత్తుల స్వీకరించండి. వృద్ధురాలూ, అమాయకురాలూ అయిన నాతల్లిని కనిపెట్టి ఉండండి. ఆనందంతో అనుమతినీయండి" అని ఖండితంగా తన మనోనిశ్చయాన్ని ప్రకటించారు.

## రామ వనవాసానికి రాజు సమ్మతించుట

ఆ మాటలకు అక్కడ ఉన్న వారంతా నిరుత్తరులైనారు. దశ రథుడు ఆవేదనలో కొంత సంయమనం పొంది, "తండ్రీ! నీ మాటలకు నేనేమని ప్రత్యుత్తరం ఇవ్వగలను? బృహస్పతియైనా, నీ మాటలు ఖండించి బుద్ధి మరల్చలేడు. ఇక ఇహపరాల మధ్య నలిగిపోతున్న నేనా ఖండించేది? మీరు పోవటానికి ఇష్టపడుతున్నాను. బుద్ధిహీనుడనై చేసిన వాగ్దానానికి లోక ప్రఖ్యాత గౌరవం సంపాదించి పెట్టావు. నా చివరికోరిక మన్నించు. మీరు మగ్గురూ ఈరోజు నావద్ద గడపండి. ఈకాలమైనా మిమ్ములనుచూస్తూ దుఃఖం మరిచిపోతాను. వెలిగివెలిగి ఆరి కొడిగట్టిన దీపం వలె ఉన్న నీ తల్లిని ఒక్కమారు చూడు. రేపోమాపో చావనున్న నన్ను చూడు. ఈ పంచప్రాణాలూ నీమీద పెట్టుకొని జీవిస్తున్న ఈ అమ్మలందరినీ చూడు ఈ వాక్క కోరిక కాదనక తీర్చు. తెల్లవారక ముందే పోదురుగాని, నేను ప్రమాణంచేసి చెపుతున్నాను. ఇంత వరకు సత్యంపట్ల ఏ పాపం చేయ లేదు. ఇప్పుడు చేయకుండా కాపాడావు. ఈ మాట కూడా పాటించు" మంటూ వేడుకున్నాడు. ఆ మాటలకు రాముడు:—

"తండ్రీ! సర్వం తెలిసిన మీరే ఇంత పామరత్వం పొందితే నేనేం చెప్పగలను? తమరు నామీదగల ప్రేమతో ధర్మం మరచిపోతు

న్నారు. పినతల్లికి మీరేకాక "నేను నీ అభీష్టాన్ని తీరుస్తా"నని ప్రమాణం చేశాను. మీరూ వున్నారు. ఇప్పుడు విన్నారుగా. మీకాక నన్నూ అసత్యపాప కూపంలో పడి, వున్నతగతులకు దూరం కమ్మంటున్నారు. నేను మీమాట చెల్లిస్తే, ముగ్గురి హృదయాలు సంతోషిస్తయ్. వరాలిచ్చిన మీకూ, పొందిన తల్లికీ, తీర్చిన నాకూ మనశ్శల్యం పెకలించబడి, సత్యవ్రత పాలనం చేత మీకూ, మీ మాట చెల్లించిన నాకూ పూర్వ్యలోక ప్రాప్తి కలుగుతుంది. అమ్మకు ఇప్పుడే పోతానని మాట ఇచ్చాను. ఈ పదిగడియల కాలంలో మీరు పొందే సంతోషం ఏముంది? నేనిక్కడ వున్నంత కాలం ప్రజలు శాంతిగా వుండలేరు. వారి ఆగ్రహం పెరిగి ప్రమాదం రావచ్చు. రేపైనా పోవలసిందే కదా.

## సుమంత్రుడు కైకేయిని నిందించుట

నాపై మీకున్న ప్రేమకన్నా ఏమిచ్చి తృప్తిపరుస్తారు? అది పూర్ణంగానే ఇచ్చారు. అమ్మ కోరిన మొదటి వరం మీరు తీర్చండి. రెండో వరం నేను తీరుస్తాను. తండ్రికొడుకు లిద్దరూ సత్యాన్ని పాలించారని కన్నవారూ, విన్నవారూ సంతోషపడతారు. చేసేపని వెంటనే చేస్తే అను మానాలకు అవకాశం వుండదు. కాలహరణం చేస్తుంటే, కాని వూహలెన్నో వస్తయ్? ఆ అవకాశాన్ని ఎందుకు ఇవ్వాలి? జనకా! నేను సర్వవిధాలా మిమ్మల్ని సత్యసంధులుగా చేయ నిశ్చయం చేసుకున్నాను. సూర్యచం ద్రులు గతులు తప్పినా దాశరథి మాత్రం సత్యవ్రతం నుంచి జారడు. మీ కోరికకు మారుమాట చెప్పినందుకు క్షమించండి. నాకు సెలవివ్వండి. అమ్మా! ఇప్పటికే ఆలస్యమైంది. నీ మనసులో ఏమీ అనుకోకు. భరతునకూ నాకూ భేదం లేదనే దానివి. గుర్తుందా? ఆ భావమే నాకూ ఉంది. తమ్ముడు రాజైతే, నేను రాజునైనట్లే సంతోషిస్తాను. త్వరలో ఆ శుభకార్యం నెరవేర్చండి. ప్రజలకు కావలసింది ప్రభువు. అతడు గుణవంతుడు కావాలి. అంతే. "పెద్దవాడా? చిన్నవాడా?" అని చూడరు. తగాదావస్తే, రెండుగా చీలి, అనుకూలురు కొందరుగా, ప్రతికూలురు కొందరుగా ఏర్పడుతారు. కాని, అది లేనప్పుడు అందరూ హర్షిస్తారు. ఇక మాకు సెలవు" అని

వృభయులకూ నమస్కరించాడు. సీతాలక్ష్మణులను ప్రయాణానికి హెచ్చరించాడు. "రామా! కోదండరామా! అయోధ్య రామా! రఘురామా! దశరథ రామా! పోతున్నావా? నన్ను వదలిపోతున్నావా?" అని బిగ్గరగా ఆక్రందించి, ఆ ఆవేశంలో స్పృహ కోల్పోయాడు. మొదలు నరికిన మ్రానువలె భూమిపై పడ్డాడు. ఆ వృద్ధరాజుపాటునకు అందరూ "అయ్యో! అయ్యో! ఎంతపని జరిగింది? మా ఆత్మాభిరాముడు అడవుల పట్టాడా? ఇంక మా మొర ఆలించే దెవరు?" అంటూ ఏడ్వసాగారు. అంతవరకు గుండె చిక్కబట్టుకొన్న సుమంత్రుడు, తాలిమికోల్పోయి, పండ్లు పటపటకొరికి, అసహ్యంతో చేయి విదల్చి, కన్నుల్లో బొటబొట నిప్పు కణికలు రాలగా, ముక్కుపుటాలు అదరగా, శరీరం కదలిపోతుండగా, చిటచిట లాడుతూ, రాజు మనస్సు తెలిసి, కోపం రూపం దాల్చినట్లు, మొగం ఎరుపెక్క, ఒక్కొక్క మాట ఒక్కొక్క బాణం వలె గుండెల్లో నాటగా కైకేయిని నిందించసాగాడు.

"ఆడుదాని రూపం దాల్చిన పిశాచీ! కాని కోరికకోరి, కట్టుకున్న మగనిచే ఛీ కొట్టబడి, విసర్జింపబడి, ఇంకా నలుగురిలో ఎలా తలఎత్తి నిలువగలిగావు? ఇంతకాలం మా అనుభవంలో, ఎన్ని అవాంతర పరిస్థితులు వచ్చినా శైలంవలె చలించేవాడు కాడు. ఇంద్రాదులెత్తివచ్చినా వెను కంజవేయని దుర్జయుడు. సముద్రంవలె అసత్యపంకిలం అంటని గంభీరుడు. ఇంతటివాని ఎంత జాణవు కాకపోతే మోసగించి, మురిపించి వరాలు పొందగలవు? ఇంతమంది కులస్త్రీలు గొల్లుమని ఏడుస్తూ గుండెలు కొట్టుకుంటుంటే, కొమ్మలువిరిగిన మోడువలె నిలువగలిగిన నీవు ఎంతకు తగవు? నీ చెప్పుచేతల్లో భరతుని పాలనం ప్రజలు సహిస్తారా? సాగనిస్తారా? నిన్ను నిలువనిస్తారా? కొడుకుకోసం మగణ్ణి వదులుకున్న నీకు, మనసులో ఎంత మమకారంవుందో వెర్రిరాజు గ్రహింపలేకపోయినాడు. ఇప్పుడు రాజ్యం రాజుచేతిలో లేదు. రామునికి పట్టం కడతానని మాముందు పలికిననాడే పోయింది ఉన్నది ప్రజల చేతుల్లో. మేం ప్రజాబంధువులం. నీకొకమాటా, మాకొకమాటా చెప్పినరాజు మమ్మల్ని ఆజ్ఞాపించే హక్కు

మట్టిపాల్జేసుకున్నాడు. నీ ఈ దుర్మార్గానికి భూమి ఇంకా ఎందుకు నిలిచింది? మహర్షులు నిన్నెందుకు శపించక మన్నించారు?

మామిడి చెట్టును నరికి, వేపచెట్టుకు పాలుపోసి పెంచితే, చేదు కాపుకాక, తీపికాపు కాస్తుందా? ఆ తల్లికి పుట్టిన నీకు ఆ గుణాలు కాకపోతే వేరే ఎలావస్తయ్? మీ పుట్టుపూర్వోత్తరాలు మాకు తెలియని వేమీ లేవు. నీ తండ్రి, సిద్ధుని అనుగ్రహించే మృగముల ధ్వనిరూపమైన మాటలు గ్రహించేశక్తి పొందాడు. ఒకరోజు ఎర్రచీమ ఇంకొక చీమతో పల్కేమాట శయనించిన మీ తండ్రి విని నవ్వితే, నీ అమ్మ చెప్పుమని పట్టుపట్టింది. సిద్ధాజ్ఞ లేక ఇతరులకు తను తెలుసుకున్న విషయంచెపితే తలపగిలి చస్తాడు. అందుకు ఆయన మొండికెత్తి చెప్పకపోలే, చెప్పకపోతే వదలనని హఠం చేసింది. సిద్ధుడు, ఏమైనాసరే చెప్పవద్దన్నాడు. ఆయన మాటతో నీ తల్లిని వదలిపెట్టి తపస్సుకు వెళ్ళాడు. మీకు ధర్మలంటే ఆటవస్తువులు. అది తెలియక మహారాజు ఇంత అపవాదుకు తల వొగ్గాడు. నా మాటవిను. నలుగురిలో రాజు చెప్పినట్లు నడుచుకో. భర్తను గౌరవించటంనేర్చుకో. ఎందుకు కుడిచికూర్చుండి యుగాంతరాల వరకూ చెడ్డదానివన్న పేరు తెచ్చుకుంటావు? నీకిది మాయని మచ్చ. భరతుడు రాజు ఎలాగూకాడు. రెంటికీ చెడిన రేవడిమల్లె, అటు రాజ్యానికీ, ఇటు భర్తకూ దూరం కాబోకు.

ఇంతకాలం కడుపులో పెట్టుకుని పాలించిన ప్రభువుమాట దక్కటానికి మేముకూడా రామునితో అడవికి పోతాము. నీవూ, నీ కొడుకూ, ఏలుకొండి. వంశాచారం చొప్పున పెద్దవానికి రాజ్యం అప్పగించి, చరమ జీవితం పూర్వుల్లాగా ఆశ్రమంలో గడిపే యోగం భర్తకు కలిగించు" అన్నాడు.

## రాముని వెంట సైన్యం పంపమని మంత్రితో రాజు చెప్పుట

ఆ విధంగా ఆగ్రహావేశాలతో సుమంత్రుడు కైకను దూషిస్తుంటే ఎవ్వరూ వారించలేదు. వృద్ధరాజు లోలోపల కొంత సంతోషించక

పోలేదు. రామాదులు మౌనంగా వున్నారు. కైకేయి ముందే ఈ స్థితులు వూహించుకుని కార్యరంగంలో దిగింది కనుక, ఏమీపట్టనట్లే వూరుకుంది. అంత జాణలో "సిగ్గుసిగ్గు. అంత అధికారం వెళ్ళబోసి అంత ఐశ్వర్యం అనుభవించి, ముసలిరాజుకు ముక్కుతాడుకట్టి, మూడు చెరువుల నీళ్ళు తాగించిన కైక, మంత్రి అనరానిమాటలంటుంటే విని ఎలా బ్రతుకుతూంది? అందులోనూ అందరిలో. ఆడుదానికి ఇంతకంటే అవమానం ఏముంది? రేపు భరతపట్టాభిషేకం కాగానే అధికారం చేజిక్కించుకుని, అందర్నీ నల్లుల నలిపినట్లు నలిపేస్తుంది కాబోలు. బిడ్డలగన్న తల్లికదా. గొడ్రాలుకూడా చేయని ఇంత ఘోరం చేయటానికి మనసెలా వచ్చిందో. అయినా మనకెందుకు? ఆమె కర్మఫలం ఆమే అనుభవిస్తుంది. కోరి ఆమెతో శత్రుత్వం పెట్టుకుని కొరివితో తల ఎవరు గోక్కుంటారు?" అంటూ అంతఃపురకాంతలు గుసగుసలుపోతూ, నోళ్ళు నొక్కుకుంటున్నారు. ప్రభువు ఆయాసంతో, సుమంత్రుణ్ణి పిల్చి,

"సుమంత్రా! రోగికి మధురాహారం రుచిస్తుందా? చెట్టుచెడే సమయానికి కుక్కమూతిపిందెలు పుట్టినట్లు, ఈ చెనటికి దుర్బుద్ధి పుట్టింది. నీవు జాగుసేయక, రామచంద్రుని ఆప్తులనూ, అభిమానులనూ, మిత్రులనూ పిలిపించు. చతురంగబలాన్ని సిద్ధపరచు. వేశ్యల, వైశ్యుల, సంగీత విద్వాంసుల పౌరాణికుల భూసురుల వెంటనే రమ్మని కబురు పంపు. రాముడు సంచరించే ప్రదేశాల్లో దుష్టమృగాల ప్రమాదంలేకుండా సంహరిస్తారు. మార్గం సుగమం చేస్తారు. మనస్సునకు వినోదం కలిగిస్తారు. తోడునీడగా వుంటారు. నాకున్న ధనకనక వస్తువాహన రత్నభూషణాలన్నీ వాహనాలపై కెక్కించు. సమప్రదేశాల్లో, జల సమృద్ధిగల చోట్లలో, నా కుమారుడు యజ్ఞాలుచేసి మునికోటిని సత్కారిస్తాడు. రాజ్యసంబంధమైనవేవీ అక్కరలేదు. వ్యక్తులకు విభాగించబడిన ఆస్తులూ, వస్తుసముదాయం మాత్రమే రామునివెంట పంపుటకు సన్నద్ధంచేయి. యథాతథంగా రాజ్యాన్ని భరతుడే పాలిస్తాడు" అని ఆజ్ఞ ఇస్తుంటే, కైకేయి భయాకులచిత్తంతో, మొగం- వెల వెలబోతుండగా, మాటతొట్రుపడ, కంఠంలో గద్గదనిండ, కోపంతో కన్నులు ఎరుపెక్క, రాజువంక చురచుర చూచి "రాజా! ఈ ఇష్టం

లేని వరాలు ఎవరిమ్మన్నారు? కోరుకోమంటే కోరుకున్నాను. దానికి ఇంత రాద్ధాంత సిద్ధాంతాలెందుకు? నన్నల్లరిపాల్జేయటం ఎందుకు? నీ కోరికలు తీర్చనని ఒక్కమాటంటే పోయేపనికి ఈ ఏడుపులెందుకు? ఈ తిట్లెందుకు? నీవు సత్యవంతుడివి కావాలి. నేను చెడ్డదానిని కావాలి. అందుకే ఇంత అల్లరిచేస్తున్నావు. చెడినచేనుకు రెండుమందెలా? ఎలాగూ నేను చెడ్డదానినే అయినాను. ఇక మొగమాటం ఎందుకు?

ప్రజలులేక, ధనధాన్య సమృద్ధి లేక, చతురంగబలంలేక బ్రాహ్మణులు లేక, కళాకారులు లేక పాడుబడిన అయోధ్యలో పట్టం కడతావా భరతునికి? రాజైనవాడు, చినిగిన గుడ్డలతో, బూడిదెగప్పిన శరీరంతో, తనలోతాను మాటలాడుకుంటూ, వీథులలో ఉన్న అపరిశుద్ధ వస్తువుల ప్రోగుచేసి మూటగట్టుకుని మోసే పిచ్చివాడులాగా భూమిని మోస్తుంటే, రాజబహిష్కారంపొంది, అడవులలో తిరిగేవాడు అన్ని భోగాలు అనుభవిస్తూ, అందలం ఎక్కి తిరుగుతాడా? ఇదేనా నీ విచ్చిన వరానికి అర్థం? "మాటలు మాత్రం అమ్మవి. పెట్టుమాత్రం పిన్నమ్మది" అన్నట్లు చేశావు. ఇప్పుడు తెలుసుకున్నాను. నీవెంత సత్యసంధుడవో. నన్నెంత ప్రేమించావో. చేయతలిస్తే సలక్షణంగా అన్నమాటప్రకారం భరతుణ్ణి రాజుగాచేయి. రాముణ్ణి అడవికిపోయే పద్ధతిలోనే వెళ్ళేట్లుచేయి. అంతేకాని, కుటిల మార్గంతో ప్రవర్తిస్తే నేను సమ్మతింపను. మీ వంశంలో సగరుడు పెద్దకొడుకనీ, రాజ్యార్హత కలవాడనీ చూడక అసమంజుని దేశంనుంచి వెళ్ళగొట్టలేదా? ఆయన నీలాగే పిచ్చి అల్లరికి దిగాడా?" అని గద్దించి పల్కింది.

## మహామంత్రి సిద్ధార్థుడు కైకేయికి బుద్ధిచెప్పుట

ఆ పల్కులకు వృద్ధరాజు "ఛీ! ఛీ!" అని అసహ్యించుకున్నాడు. అక్కడ చేరిన వారంతా ముక్కుపై వ్రేలువేసుకున్నారు. అప్పుడు మంత్రులలో ముఖ్యుడైన సిద్ధార్థుడు కైకేయి మాటకు సమాధానం చెప్ప సాగాడు "ఏమమ్మా కైకేయీ! తెలిసి చెప్పావా ఈ పోలిక, తెలి యక చెప్పావా? ఆ గాథ నీవు తెలియకపోతే నే చెపుతా విను. ఆ అసమంజుడు రాజపుత్రుణ్ణనే దురహంకారంతో, ఈ పట్టణంలో ఆడు

కుండే పిల్లలను బలవంతంగా ఎత్తుకొనిపోయి సరయూ నదిలో పడేసే వాడు. ఆ బిడ్డలు తేలగానే రెండుచేతుల్తో మళ్ళీ లోపలికి అదిమి వాళ్ళు చావంగానే గంతులువేసుకుంటూ ఇంటికి చేరేవాడు. కొంతకాలం ప్రజలీ దురాగతం సహించారు. అందరూ రాజువద్దకుపోయి, కొడుకుచేసే ఘోర కార్యాన్ని చెప్పి, మీకు కొడుకుకావాలో, ప్రజలుకావాలో చెప్పుమన్నారు. అంతవరకూ సంగతి తెలియని రాజు కొడుకునుపిల్చి దండించి రాజ్యంలోనుంచి వెళ్ళగొట్టాడు. ఆ క్రూర కిరాతకుడు పెళ్ళాంబిడ్డలతో అడవులో పడరాని కష్టాలుపడి నీచాతినీచమైన చావు చచ్చాడు. మరి మా రామచంద్రునిలో ఏమి దోషాలుచూసి అడవికిపొమ్మన్నావు? మాకు ఇంతవరకు అటువంటివి ఏమీ కనబడలేదు. నీకు తెలిస్తే చెప్పు. నీవు వేసిన శిక్షకంటే అధికంగా వేస్తాం. ఎందుకింత పట్టుదల? కానిపని అని తెలిసికూడా లోకాపవాదం నెత్తినరుద్దుకోకు. లోకాచారం ప్రకారం రాముని రాజుగా చేయనీ. పెద్దవాణ్ణి. నీ మేలు కోరి చెపుతున్నాను. పండువంటి పచ్చని సంసారం పాడుచేసుకోకు. గుణవంతుణ్ని నిష్కారణంగా బాధిస్తే, ధర్మానికి హాని కలుగుతుంది. తప్పకుండా ధర్మహాని ఇంద్రునివంటి వానినైనా కాల్చివేస్తుంది." అన్నాడు. ఆ వృద్ధమంత్రిమాటలన్నీ మనుబోతుపై బడిన వానలాగా కైకేయిపట్ల వ్యర్థమయినై.

అప్పటికీ ప్రసన్నత మొగంలో కనుపించని కైకను చూచి, రాజు పట్టరాని కోపంతో "ఈ బుద్ధిమంతుని మాటలు నీకు రుచించవు కాదటే పాపినీ! లోభికి మాటనష్టి అన్నారు పెద్దలు. రాజ్యలోభంతో, భర్తను చంపుకుని, కొడుకుచే దూషింపబడి, లోకులచే పలుగాకిలాగా ఎన్నబడి ఏం సౌభాగ్యం అనుభవించదలిచావో అదే ఇక అనుభవించు. అంతా నీ నెత్తినే కట్టుకో. సర్వం వదలి రామునితో అడవికే పోతా. నీ విధవ పాలనలో నేనుంటానా? చివరిమాట చెపుతున్నా. నీ ఏడ్పు భరతునికోసమైతే వాణ్ణి పిలిపిస్తాను. వాడు అంగీకరిస్తే సంతోషంగా రామునిచే పట్టాభిషేకం చేయిస్తా. నేనూ, కౌసల్యా, సుమిత్రలూ, సీతారామలక్ష్మణులూ నీకు అడ్డంలేకుండా అడవికి పోతాం. వాడు అంగీకరించక పోతే రామునికి పట్టాభిషేకం జరిగించు. అంతవరకూ రామవనవాసం అపు" అన్నాడు. కైక గొంతులో పచ్చి వెలక్కాయ

పడినట్లయింది. "ముసలిరాజు మెడకు వేస్తే కాలికీ కాలికివేస్తే మెడకూ బంధం తగిలిస్తున్నాడు. ఒకవేళ కొడుకు ఒప్పుకొనకపోతే, ఇంత ప్రయత్నం భగ్నమైపోతుంది. అంతా అయింతర్వాత తెలిస్తే, ఇష్టం లేకపోయినా, ప్రజలు ప్రభుత్వం స్వీకరించుమని వాడిని పట్టుపడతారు. అప్పుడు తప్పక స్వీకరిస్తాడు. ఇప్పుడు రామవనవాస ప్రయాణం ఆప రాదు. అడిగిన ప్రశ్నకు బదులు చెప్పకపోతే రాముణ్ని వుంచి, భర తుణ్ని పిలిపిస్తారు. వాడు అన్ననుచూచి పాదాక్రాంతుడవుతాడే కాని, పట్టాభిషేకం సంగతి పట్టించుకోడు సరికదా, తానే ఆ పనికి పూనుకుం టాడు. ఏమని చెప్పాలి? ఆఁ!— అవును— స్ఫురించింది. ఈ సమాధా నంతో అందరికీ వాగ్బంధం అయి తీరుతుంది. రామ ప్రయాణం జరిగి తీరుతుంది" అని నిర్ణయించి-

"రాజా! ఇంతవరకు లేని అవసరం భరతునితో ఇప్పుడేం వచ్చింది? ఇస్తానని ప్రమాణంచేసింది నాకా? భరతునకా? నాకైతే వాడి ఇష్టానిష్టాలతో పనేముంది? నా కోరిక చెల్లించు. వాడికైతే వాణ్ణే పిలి పించు. ఇచ్చింది నాకే కనుక రామ ప్రయాణం ఆపటానికి వీలులేదు. దానానంతరం వస్తువుపై దాతకధికారం ఎలా లేదో నీకూ రాజ్యంపై అధి కారంలేదు. వరము నాదీ, ఆపై నాకొడుకుదీ. ఇప్పుడు చెప్పు భరతుణ్ని పిలవటం ఎంత న్యాయమో" అని నిష్కర్షగా చెప్పింది.

## సీతారామలక్ష్మణులకు కైక నారచీరెలు ఇచ్చుట

ఈ సంభాషణ అంతావిన్న రాముడు, మేరుపుఃలె ధృతిమంతుడై, వినతుండై, భక్తిపురస్సరంగా తండ్రిని చూచి, "ఎందుకు తండ్రీ! ఈ విపరీత సంభాషణం? అడవిలో ప్రకృతిసిద్ధంగా లభించే పదార్థాలతో బ్రతు కును తోయటానికి సిద్ధపడిన నాకు, మరల ఈ సంసారజంజాటం ఎందుకు? ఏనుగును దానంచేసి ఇనుప గొలుసుకై పెనుగులాట ప్రారంభించారు. ఇంత భ్రాంతి ఎందుకు మీకు? మీరు ఆదరంతో నాకిచ్చిన సర్వం భరతు నకు ఆశీఃపూర్వకంగా తిరిగి ఇచ్చేస్తున్నాను. గంప ఒకటీ, గడ్డపారా ఒకటీ తెప్పించు. భార్యా సోదర సహితంగా నేను అడవికి పోతున్నా, బ్రహ్మచర్యాశ్రమంలో పళ్ళాలుగేంద్లూ గడపదలిచాను. నాకు ఈ

లలిత వస్త్రాలతో గానీ, ఈ రత్నాభరణాలతోటి గానీ పనిలేదు. నాకొక జత, నా తమ్మున కొక జత నారచీరెలు తెప్పించి ఇయ్యండి. మహాప్రసాదంగా స్వీకరించి, మహారణ్యాలకు పోతాం. భరతుడు రానక్కర లేదు. రాముడిక వుండ నవసరమూ లేదు" అని చివరి నిర్ణయం చేశాడు. రాముని మాటలకు కైక ఎంతో లోపల ముకిసిపోయింది. తన మాట దక్కించినందుకు ఎంతో శ్లాఘించింది. ధర్మాధర్మాలూ, న్యాయాన్యాయాలూ లోకానికే వదలిపెట్టింది. చరచర లోపలికిపోయి తానే రెండు జతలు పురుషులు ధరించేవీ, ఒక జత స్త్రీలు ధరించేవి తెచ్చి, రామునకు రెండు జతలు ఇచ్చింది. రాముడు తీసుకుని, కళ్ళకద్దుకుని తమ్మునికి ఒక జత ఇచ్చి, మిగిలిన జత తాను ధరించాడు. వెంటనే లక్ష్మణుడుకూడ కట్టుకున్నాడు. కైక సీతవంకచూచి, మిగిలిన మూడోజత చేతికిచ్చింది. ఆగర్భ శ్రీమంతురాలు. అందుకున్నదేకాని ఏమిచేయాలో తెలియక వాటి వంక బిత్తరపోయిన జింకలాగా చూడసాగింది. కొంతసేపటికి ఒక చీరె మెడకు చుట్టుకుంది రెండోది చేతితో అటూఇటూ త్రిప్పుతున్నదే కాని కట్టుకోలేకపోయింది ఆ అసూర్యంపశ్య పడుతున్న అవస్థనుచూచి రాముడు ఆమె పట్టుచీరపై ఎలా ధరించాలో ఆ విధంగా కట్టాడు. నిండు జనంలో, అంతఃపురకాంతల మగవాడు చీరకట్టటం చూస్తున్న మూడు వందల ఏబదిమంది రాజకాంతలు తల వంచుకుని, సీతను వుండిపొమ్మని వేడుకున్నారు. నీవు మాకుగా, నీ భార్యను చూసుకుంటూ జీవిస్తామన్నారు. రాముడు వారి ప్రార్థన వినక లోనికరిగి యథాప్రకారం, చీనాంబరాలూ, భూషణాలూ పరిత్యజించి, నారచీరలు ధరించి రమ్మని భార్యను ఆదేశించాడు.

## సీత నారచీరెలు కట్టగూడదని వసిష్ఠుడు నిషేధించుట

సీత చాటునకేగి భర్త చెప్పినట్లు వల్కలాలు ధరించబోతుండే, వశిష్ఠమహర్షి ఆగ్రహంతో ఆసనంపైనుండి చివాలునలేచి, "ఆగు. మైథిలీ! ఆగు. నీవు నారచీరెలు కట్టటానికి వీలులేదు. వనవాసం రామునకే కాని నీకుకాదు. ఆత్మేశ్వరిఅంటే, భర్తలో అర్ధాంశ. నీభర్తవచ్చువరకూ నీవేపాలించు. నీకేపట్టాభిషేకం చేస్తాం. నీవుసమ తల్లివి కనుక ఇష్టపడక పతినను సరిస్తా

